# సత్యశోధన

(అతీంద్రియ శక్తుల ఉనికిపై డా॥ కోవూర్ శాస్త్రీయ పరిశోధనలు)

ఇతివృత్తం

**డాక్టర్ ఏ. టి. కోవూర్**

కథనం

**బి. సాంబశివరావు**



స్వేచ్ఛాలోచన ప్రచురణలు

# SATYA SODHANA

*Dr. A.T. Kovur's research on parapsychical activities*

Narration : **B. Sambasiva Rao**

© **Publishers**

*Editorial Board Director*
Isanaka Muralidhar

*Publication No.3*
*First Published:* January, 2019
*Copies:* 1000

*Published by*
**Swetchalochana Publications**
S.Venugopal, Manager,
H.No. 1-6-133/6/C/2, Behind Sessions Court,
Subhash nagar, Mahaboobnagar-509001
Cell: 99088 25459. E-mail: varma.nirala@gmail.com

Price: Rs. 120/-

*Sole Distributors*
**Navachethana Publishing House,**
Giriprasad Bhavan, Bandlaguda (Nagole), GSI (Post),
Hyderabad-500068. Ph.No.: 040- 24224453 / 54

*For Copies:* All branches of
**Navachethana Book House, Visalandhra Book House**
and other all leading Book stores

*Printed at*
Rowshni Graphics, Uppal, Hyderabad-39. Cell: 9246172133

# మా మాట

డాక్టర్ అబ్రహాం తిమోతి కోవూర్ గురించి నేటితరానికి అంతగా పరిచయం వుండకపోవచ్చు. కానీ 40 ఏళ్ల క్రితమే, భారతదేశం అంతటా తిరిగి, మేధావులకే పరిమితమైవున్న హేతువాదాన్ని సామాన్య ప్రజానీకం చెంతకు చేర్చటానికి ఆయన అందించిన ప్రేరణ నేటికీ అనితరసాధ్యంగా మిగిలింది. మూఢనమ్మకాలతో సతమతమవుతున్న కుటుంబాల దగ్గరకు వెళ్లి వాళ్ల వేదనలకు గల కారణాలను వారికే వివరించి వైజ్ఞానికస్పృహను పెంచాడు. ప్రపంచంలో ఎక్కడా అభౌతికశక్తులుండవని, వాటిని ఎవరైనా తనముందు నిరూపిస్తే రూ.1000/- ఇస్తానని 1965లో, దేశంలో తొలిసారిగా, ఆయన విసిరిన సవాలు ఇప్పటికీ అజేయంగా వుంది. ఆ ఛాలెంజ్ విలువ ఇపుడు రూ. 10లక్షలు దాటింది. ఇలా, తొలిఛాలెంజర్‌గా, హేతువాదాన్ని సామాన్యుల చెంతకు చేర్చిన మేధావిగా, బాబాల గారడీల నిరూపణకు ఇంద్రజాలాన్ని ఉద్యమ ప్రచారంలో భాగంగా మలిచిన తొలి ఉద్యమకారునిగా, మహారాష్ట్రలో డా॥ నరేంద్ర దభోల్కర్, తమిళనాడులో బి.ప్రేమానంద్ లాంటి గొప్ప హేతువాదులను ప్రేరేపించిన మేధావిగా డాక్టర్ కోవూర్‌కున్న చరిత్ర సుప్రసిద్ధం.

మూఢనమ్మకాల గుట్టును రట్టు చేయటానికి చేసిన పరిశోధనల కథాసంపుటి ఈ 'సత్యశోధన'. ఇప్పటికే రెండు ముద్రణలతో పాఠకాదరణ పొందింది. ఇది మూడో ముద్రణ. గ్రామీణ ప్రాంతాల్లోనే కాక, పట్నాల్లో సైతం అనేక మూఢనమ్మకాలు ఇప్పటికీ పీడిస్తున్నాయి. వాటిని ఎలా వదిలించుకోవాలో ఈ పుస్తకం తెలియజేస్తుంది. పిల్లలు, పెద్దలు కూడా దీన్ని చదివాక తప్పక వైజ్ఞానిక స్పృహను పెంచుకోగల్గుతారు.

సుప్రసిద్ధ రచయితలయిన సి.వి., రంగనాయకమ్మ, జయగోపాల్, మానసిక వైద్యులయిన డా॥ రామారెడ్డి లు తొలిముద్రణ సందర్భంగా వెలిబుచ్చిన అభిప్రాయాలకు వారికి మరోసారి కృతజ్ఞతలు తెలుపుతున్నాం. డా॥ ఎ.టి.కోవూర్ అనుభవాల ఇతివృత్తాలను చక్కని కథలుగా మలచిన సాంబశివరావు కోవూర్‌పై విలువైన సమాచారాన్ని అందించారు. వారికి, ఈ పుస్తకాన్ని డి.టి.పి. చేసిన బి.మానవతకు, లోపలి పేజీల్లోని చిత్రాలను అందించిన మనోజ్ కు, అచ్చువేసిన రాష్మి గ్రాఫిక్స్, హైదరాబాద్ వారికి ధన్యవాదాలు తెలుపుతున్నాం. పాఠకుల నుంచి విలువైన సూచనలను ఆహ్వానిస్తున్నాం.

**- సంపాదకవర్గం, స్వేచ్ఛాలోచన ప్రచురణలు**

**" శాస్త్రీయ స్పృహను, మానవవాదాన్ని, పరిశీలనాతత్వాన్ని, సంస్కరణను పెంపొందించటం ప్రతి భారతీయ పౌరుని విధి"**

**- భారత రాజ్యాంగం, ఆర్టికల్ 51ఎ (హెచ్), విభాగం IV-A**

## ముందు మాటలు

# భ్రమలు తొలిగించే పుస్తకం

సాంబశివరావు గారికి,

మీ 'సత్యశోధన' పూర్తిగా చదివాను. కోవూర్ పరిశోధనల గురించి కొత్తగా చెప్పేదేముంది? గతంలో కూడా చదివాం. అయితే, ఈ పుస్తకంలో చాలా సంఘటనలు కొత్తగా ఇప్పుడే తెలిసాయి.

ఎంత మూఢనమ్మకాలు వుండే వాళ్ళయినా ఇలాంటి సంఘటనలు చదవడం మొదలుపెడితే 'తర్వాత ఏమవుతుందో చూద్దాం' అన్న కుతూహలంతో వదలకుండానే చదువుతారు. చదివితే మాత్రం తప్పకుండా కొంచెం ఆలోచనలో పడతారు. చీటికీమాటికీ భూతవైద్యుల దగ్గరకీ, జ్యోతిష్యుల దగ్గరకీ పరుగెత్తకుండా ఎవరైనా మంచి డాక్టర్ దగ్గరికి వెళ్ళాలనే ఆలోచన తప్పకుండా వస్తుంది. ఈ పుస్తకం చదివిన వాళ్ళు అలా ఆలోచిస్తారంటే అంతకన్నా ఏంకావాలి?

అయితే ఈ కేసులన్నిటిలోనూ ఆయా వ్యక్తుల్ని కోవూర్ ఆదుకున్నాడు. వాళ్ళ సమస్యల్ని వాళ్ళకి చక్కగా వివరించి చెప్పగలిగాడు. వాళ్ళకి తక్షణం పరిష్కారాలు దొరికాయి. మరి ఇక్కడ మనకి ఇలాంటి మార్గం ఏముంది? ఇలాంటి సమస్యల్లో చిక్కుకున్న వాళ్ళు ఎవరి దగ్గరకు వెళ్ళాలి? అలాంటి మార్గం కూడా ఈ పుస్తకంలో మీరు ఏదన్నా చూపాలి. అంటే, 'ముందుమాట'లోనో లేదా వ్యాసంగానో "ఎవరికైనా ఇలాంటి సమస్యలు వస్తే ఫలానా సంఘ సభ్యుల్ని కలసి మాట్లాడండి. లేదా సైకియాట్రిస్టుల్ని కలవండి" – అని మీకు తెలిసినంతవరకూ ఎవరైనా వుంటే – ఆ సమాచారం కూడా ఇస్తే ఇలాంటి సమస్యల్లో వున్నవారికి ఉపయోగపడుతుంది.

ఈ పుస్తకం చదివిన వాళ్ళకి తప్పకుండా చాలా భ్రమలు తొలిగిపోతాయి. కోవూర్ ఆశయం కూడా అది సాధించాలనే కదా?

హైదరాబాద్ – రంగనాయకమ్మ
30-06-97

## గుడ్డినమ్మకాలను గురిచూసే రచన

డాక్టర్ కోవూర్ ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రవేత్త. ప్రత్యేకంగా సుప్రసిద్ధ మానసిక శాస్త్రవేత్త. ఆయన బహుముఖ ప్రజ్ఞావంతుడు. ప్రచండమైన కార్యశూరుడు. మహోన్నత మైన తన ప్రతిభాపాండిత్యాలతో సమాజంలో వున్న సమస్త అంధ విశ్వాసాలను చీల్చిచెండాడాడు. పుట్టపర్తి సాయిబాబానూ, అతడి గారడీ పనుల్ని పబ్లిక్‌గా సవాలు చేశాడు. సైంటిఫిక్ ఆలోచనా ధోరణిని, దేశదేశాల్లో ప్రచారంచేసి, వినూత్న వైజ్ఞానిక వికాసం కోసం జీవితాంతం కృషి సల్పాడు.

డాక్టర్ కోవూర్ తన జీవితానుభవాల్ని ఈ కథల్లో సోదాహరణంగా వివరించాడు. సాంబశివరావుగారు, కోవూర్ జీవితానుభవాల్ని తెలుగుకథల రూపంలో రాసి ప్రచురిస్తున్నారు.

ఆత్మ-పరమాత్మల పేరిట, పూజార్లు ప్రచారం జేసే బూటకాలు, పూర్వజన్మ-పునర్జన్మ, స్వర్గనరకాలు, పాపపుణ్యాలు, యోగుల-బాబాల-సన్యాసుల మోసాల్ని, వంచనని కోవూర్ కథల్లో అత్యంత నిశితంగా ఎండగట్టారు. సైన్సునీ, సైంటిఫిక్ ప్రయోగాల ద్వారా నిరూపించి, చదువుకొన్న మూఢుల కళ్ళు తెరిపించడానికి ప్రయత్నించాడు. మహత్తుల పేరిట గారడీవాళ్ళు చేసే గమ్మత్తుల్ని స్వయంగా తానే చేసిచూపాడు.

సాంబశివరావు గారు ఈ కథాసంపుటిలో అసాధారణ కథాకథనం ప్రదర్శించారు. సరళ సుందరమైన తేటతెలుగులో ఈయన రాసిన ఈ హేతువాద కథల సంపుటిని తెలుగు పాఠకులు తప్పక ఆదరిస్తారని గట్టిగా నమ్ముతున్నాను. చదువులేని పామరులే గాక చదువుకొన్న మూఢులు, ఆస్తికులు-నాస్తికులు, మతవాదులు-భౌతికవాదులు, వేయేల సమస్త శ్రేణులకి చెందిన వారూ ఈ కథల్ని తప్పక చదివితీరాలి. చదువు లేనివారికి చదివి చెప్పాలి. అన్ని మతాలకి చెందిన పునరుద్ధరణవాదం (రివైవలిజం) తుఫాన్‌వేగంతో మన దేశప్రజల్ని ముంచెత్తివేస్తోన్న ఈ దశలో, ఈ కథల సంపుటి, సమస్త అంధవిశ్వాసాలకి వ్యతిరేకంగా ఉద్యమించగలదు. ఈ సత్య శోధన కథాసంపుటి ప్రచురిస్తోన్న సాంబశివరావుగారిని హృదయపూర్వకంగా అభినందిస్తోన్నాను.

– సి.వి.

(సాంస్కృతిక విప్లవోద్యమకవి)

21-08-97

## సామాజిక ప్రయోజనం గల కథలు

ఎవరి రచనయినా, ఎటువంటి రచనయినా చదవడం సులభం, సమీక్షించడం కష్టం. అయితే, ముందుమాట వ్రాయడం ఇంకా కష్టం. ముందుమాట వ్రాయడానికి ముందు, రచయిత మనసుని పట్టుకోగలగాలి. అతడే విషయాన్ని దృష్టిలో పెట్టుకుని రచన చేయడం జరిగిందో, తన ప్రయత్నం నెరవేర్చుకోవడంలో ఎంతవరకు విజయం సాధించాడో గ్రహించి, తన రచనతో పాఠకులను ఏమాత్రం రంజింపచేస్తాడో గ్రహించగల్గాలి. కల్పనా సాహిత్యాన్ని సృష్టించడం సులువు. వాస్తవాన్ని అందంగా ఆకట్టుకునేలా చెప్పడం కష్టం. ఈ పుస్తకం ఈ రెండో కోవకు చెందినది. ఇక విషయానికి వస్తే.....

ఒక సైకియాట్రిస్టుగా నాకున్న కాసింత గుర్తింపును దృష్టిలో ఉంచుకుని శ్రీ సాంబశివరావుగారు, తన కథనం నడిపిన ఈ హేతువాద కథాసంపుటికి అభిప్రాయం రాసే అవకాశం కల్పించారు. మానసిక వైద్యనిపుణుడి దృక్కోణంలో ఈ కథలన్నిటినీ పరిశీలించి నా అభిప్రాయం వ్రాశాను. అయితే, సాంబశివరావుగారి ఆలోచనా ధోరణులకు, ఆశయాలకు ఏ మేరకు ఇది అద్దం పడుతుందో చెప్పలేను.

నేను శ్రీ అబ్రహాం కోవూర్ గురించి ఎంతో విన్నాను. వారిపట్ల ఎంతో గౌరవం. చిన్నప్పుడు నాకున్న దెయ్యాల భయం పోగొట్టడానికి తోడ్పడిన అంశాలలో ఒకటి వైద్యవిద్య అయితే మరొకటి డా॥కోవూర్ గారి ప్రతిభ గురించి వినికిడి. ఆయన ఆంగ్లంలో వ్రాసిన రచనలను చదవాలని చాలాసార్లు అనుకొన్నాను. అయితే చదివే తీరుబడి రాలేదు. INDIAN SKEPTIC వంటి పత్రికల ద్వారా ఆయన రచనల గురించి పైపైన తెలుసుకోవడం జరిగింది. అతీంద్రియ అంశాలు నిరూపిస్తే లక్షరూపాయిలిస్తానని ఆ రోజుల్లోనే సవాల్ చేసి మూఢనమ్మకాలకు వ్యతిరేకంగా పోరాడిన మహామనిషి శ్రీ కోవూర్‌గారు. ఇప్పుడు అదృష్టవశాత్తు శ్రీకోవూర్‌గారి రచనలకు తెలుగులో కథనం సమకూర్చి బహుశా స్వేచ్ఛానువాదం చేసి శ్రీ సాంబశివరావుగారు అభిప్రాయం కోసం నాకు పంపించడం ద్వారా నా చిరకాల వాంఛితాన్ని నెరవేర్చుకొనేలా చేసారు. సాధారణంగా ఏదైనా కథకు మూలం చదివి, తరువాత అనువాదాన్ని చదివినపుడు కొంత అసంతృప్తికి లోనవుతాం. దానికి కారణం మూలంతో పోల్చినపుడు సహజత్వం లోపించడంగానీ, శైలిలో లోపంగానీ కావచ్చును. కానీ, శ్రీ కోవూర్ గారి రచనలకు తెలుగురూపమైన ఈ 'సత్యశోధన' మాత్రం సాంబశివరావుగారి చేతులలో చక్కని రూపుదిద్దుకుంది. ప్రతి కథ మనమధ్య

జరుగుతున్నట్లుగానే వ్రాసారు. చదువుతున్నంత సేపూ 'ముందేం జరగబోతుంది' అన్న ఆసక్తితో చదివించేలా వ్రాసారు. సుమారు 40,50 సంవత్సరాల క్రితమే, సైన్సు ఇప్పుడంత అభివృద్ధి చెందని రోజుల్లో కూడా, మూఢనమ్మకాలకి సంబంధించి ప్రజల్లో పాతుకుపోయిన నమ్మకాలను తొలిగించి, వారిని విజ్ఞానపథంలో నడిపిన వ్యక్తి, శ్రీ కోవూర్‌గారు. శ్రీ కోవూర్ గారు మూలంలో ఉత్తమపురుష (First Person)లో చెప్పిన సంఘటనలను, అనువాదంలో సాంబశివరావుగారు ప్రథమ పురుష (Third Person)లోనికి మార్చి కథలుగా చెప్పడం వలన చదువరులకు మరింత ఆసక్తి కలిగే విధంగా రూపుదిద్దుకున్నాయి.

ఈ కథలలో ఎందరో మానసిక సమస్యలున్నవాళ్ళు, మోసగాళ్ళు కన్పిస్తారు. మూఢనమ్మకాలకు మూలస్థంభాలు ముఖ్యంగా ఈ రెండు రకాల మనుషులే. Hallucinations అనబడే భ్రమలతో ఉండేవాళ్ళు "ఆత్మలతో ముచ్చట్లు" కథలో కన్పిస్తారు. మన మనసులో ఉండే భయాల వలన కలిగే Illusions అనే భ్రమలు "కథలుకాచే మామిడి", "భయం..భయం...భయం..."కథల్లో కనిపిస్తాయి. పూనకాలు, ఒకే వ్యక్తిలో భిన్న మూర్తిమత్వాలులాంటి Dissociation అంశాలను, "దయ్యం బ్రతికింది", "మహాత్ములను ఛాలెంజ్ చేయండి", "ప్రేమికుడు", "దురుసు యవ్వనం", "పిల్లలూ! పురాణకథలున్నాయ్ జాగ్రత్త", "చెంబు జోస్యం", "దయ్యంతో వియ్యం", "కఫెన్"లాంటి కథలలో చూస్తాం. సంచలనం సృష్టించి మానసికానందం పొందడం "పునర్జన్మ అబద్ధమే" కథలో, సహోదరుల పట్ల అసూయ, "అసూయ తెచ్చిన అనర్థం" కేసులో కనిపిస్తాయి. అపరిష్కృతమైన Oedipal Conflict "ఇదో ప్రేమకథ"లో కనిపిస్తుంది. బహుశా కేసు ఎదుర్కోలేని బలహీనుడు ట్రిక్కు ద్వారా ప్రజలలో భయోత్పాతాన్ని కలిగించడం "ఎత్తుగడ" కథలో చూస్తాం. ప్రజలలో ఉన్న మూఢనమ్మకాలను ఆసరాగా తీసుకుని జీవనం సాగించే దగాకోరులను చూపించే "మహాత్ములా? గమ్మత్తులా?", "దగాకోరు", "దివ్యదృష్టి బండారం" అనే కథలు, ప్రకృతిలో నిరంతరం జరిగే సహజమైన సంఘటనలను అతీతశక్తులుగా అపోహపడడం "వెలుతురు చెట్లు" కేసులో చూడవచ్చు. ఇలా మనచుట్టూ జరుగుతున్న మోసాలను, మానసిక సంఘర్షణలను హేతుబద్ధంగా వివరించి ప్రజలకు ఎంతో మేలు చేసిన శ్రీ కోవూర్ రచనలు మన తెలుగువాళ్ళకి ఈ రూపంలో అందడం ముదావహం.

కాకపోతే, కోవూర్ గారి టైముకి, ఇప్పటికి, మానసిక శాస్త్రంలో ఎన్నో మార్పులు వచ్చేశాయి. వ్యాధికి సంబంధించిన భావనలు చాలా మారిపోయాయి. అలాగే

ట్రీట్‌మెంట్ పద్ధతులు కూడా మారిపోయాయి. Schizophrenia లాంటివి ఆయన పుస్తకంలో వాడినట్లుగా ఈ కాలంలో వుండవు. అలాగే పిడుక్కీ, బియ్యానికీ హిప్నోథెరపీ మంత్రమే అన్నట్లుగా వుండదు మానసిక వైద్యం అంటే. అయినా మనం తీసుకోవలసినది ఆయన యొక్క సైంటిఫిక్ స్పిరిట్, హేతువాద దృక్పథం తప్ప వ్యాధి నిర్ధారణలో వెంట్రుకలు చీల్చే లాంటి వాగ్వివాదాలు కాదు. ఈ విషయం మినహాయిస్తే, శ్రీ కోవూర్‌గారి వంటి వైద్యేతర రంగానికి సంబంధించిన వ్యక్తి మూఢనమ్మకాలపై సాధించిన ఈ విజయం ఎంతో ఘనమైనది.

ముందు చెప్పినట్లుగా శ్రీ సాంబశివరావుగారి అనువాదం చాలా చక్కగా ఇదే మూలమా అన్నంత ఫ్రీగా సాగింది. కొన్ని తమిళ పేర్లు కూడా కాస్త ఆంధ్రీకరించవచ్చు. వాళ్ళు 'గాంధీ' వ్రాయాలన్నా, కాంతి వ్రాయాలన్నా ఒకేలా వ్రాస్తారు. ఎందుకంటే వాళ్ళకు 'ప'కు'బ'కు ఒకటే క్షరం. అందుకే 'పాకియం' అనే పేరు మన తెలుగు భాగ్యంతో సమానం. 'తానాపతి' అన్నది 'ధనపతి'గా వాడొచ్చు. ఆ విధంగా జరిగితే మరికొంత ఫ్రీ అవునేమో!

జనజీవన జాగృతికి 'సత్యశోధన' వంటి పుస్తకాలు ఎంతయినా ప్రయోజన కరమైనవి. ఇటువంటి రచనలు పాఠకులలో ఓ ఉత్తేజాన్ని స్ఫూర్తినీ కలుగచేస్తాయి. ఎప్పుడైనా ఫలానా చోట ఎవరినో దయ్యమావహించిందనో లేదా ఎవరో స్వామీజీ బంగారు గొలుసు సృష్టించాడనో మొదలయినవి చదివినప్పుడు గానీ, విన్నప్పుడు గానీ అదంతా వట్టి బూటకమని భావించి పోరాడే స్థాయికి పాఠకులు వెళ్ళగలుగుతారు. సమాజానికి ఉపయోగపడే ఇటువంటి రచనలు మరిన్ని అందించాలని శ్రీ సాంబశివరావుగారిని కోరుతున్నాను.

**- డాక్టర్ కర్రి రామారెడ్డి**
M.B.B.S., M.D.(Psych.), M.B.A., M.A.(Pol.Sci.)
M.A.(Litt.),M.S.(Psych.), D.F.E.,D.C.E.,D.F.M.
(నరములు మరియు మానసిక వ్యాధుల ఆస్పత్రి)
ప్రకాశంనగర్, రాజమండ్రి - 533013

రాజమండ్రి,
23-07-97

# అలుపెరుగని హేతువాద పోరాటశీలి కోవూర్

భారతదేశంలో ప్రగతిశీల ఉద్యమకారులకు డాక్టర్ ఎ.టి.కోవూర్ పేరు పరిచయమే. బాబాలు, అవతార పురుషులు తమ మాయలు మహిమలను తన ఎదుట చేసి చూపవలసిందిగా సవాలు చేస్తూ తెలుగునాట ఎన్నో పట్టణాలలో, బహిరంగ సభల్లో కోవూర్ ప్రసంగించారు. కేరళలో పుట్టి శ్రీలంకలో అధ్యాపకునిగా పనిచేస్తూ అక్కడ హేతువాద ప్రచారం మొదలుపెట్టాడాయన. 'దేవుడు' అన్న మూఢవిశ్వాసం ఎక్కడవున్నా దయ్యాలు, మంత్రాలు, మహిమలపై నమ్మకాలుంటాయి. ఇండియాలాగే శ్రీలంక కూడా ఇలాంటి మూఢవిశ్వాసాలకు ఆటపట్టుగా వుంది. అమాయక ప్రజలు కరుడుగట్టిన భయంకర విశ్వాసాలకు ఎంతగా బలైపోతున్నదీ గుర్తించిన కోవూర్ వాటి నిర్మూలనకు పూనుకున్నాడు.

ఎక్కడ మంత్రగాడూ, దయ్యం, మహిమలున్నాయని తెలిసినా వెళ్ళి పరిశీలించేవాడు. అవన్నీ ఎంతటి మోసపూరితమో, ఎంతటి బూటకమో వాటి గుట్టుమట్టులను తన పరిశోధనల్లో విడమర్చి చెప్పాడు. ప్రతీ మహిమ వెనుకా ఏదో కుట్ర, మోసం, స్వార్థం దాగివుండడాన్ని నిరూపించి చూపాడు. మంత్రగాళ్ళు, భూతవైద్యులు, అవతారపురుషులు, బాబాలు, స్వాములు, ప్రజల మూఢవిశ్వాసాల్ని సొమ్ము చేసుకోవడానికి మంత్రాలనీ, మహిమలనీ, అతీతశక్తులనీ ప్రచారం చేస్తున్నారన్నాడు. విశ్వంలో 'మహిమ' అంటూ ఏదీ లేదన్నాడు. కార్యకారణ సంబంధాలకు, ప్రకృతికీ అతీతంగా ఏదీ జరగదని శాస్త్రబద్ధంగా నిరూపించినవాడు కోవూర్.

పత్రికలు కోవూర్ చేస్తున్న మూఢవిశ్వాస నిర్మూలనా ప్రచారానికి ఎంతగానో తోడ్పడ్డాయి. బాబాల్ని, మంత్రగాళ్ళనీ, అతీంద్రియ శక్తులప్రదర్శకుల్నీ కోవూర్ సవాలు చేస్తూ తన ఎదుట తమ మహిమల్ని నిరూపించినట్లయితే లక్షరూపాయలను బహుమతిగా ఇస్తానన్నాడు. 1960లోనే సాయిబాబా చేస్తున్న "మహిమలన్నీ" కేవలం బూటకమని, కాదంటే తన ఎదుట శాస్త్రీయ పరిశోధనకు లోబడి బహిరంగంగా నిరూపించి లక్షరూపాయలను గెలుచుకోవాలని కోవూర్ చేసిన సవాలు బాబా వంటినిండా తేళ్ళు, జెర్రులు ప్రాకినట్లు చేసింది. ఈ శాస్త్రీయ భావ ప్రచారాన్ని శ్రీలంకకే పరిమితం చేయక భారతదేశంలో కూడా తన 80 ఏళ్ళ పడిలో ముఖ్య పట్టణాలన్నిటా పర్యటించి ప్రచారం చేశాడు. భారతదేశమంతటా కోవూర్ ప్రచారం



**1976లో నెల్లూరులో జరిగిన హేతువాద ప్రచార సభలో బాబాలవలె గాలిలోంచి బూడిద తీసి చూపుతున్న కోవూర్**

చూసిన ఎందరో మేధావులు, శాస్త్రవేత్తలు మొట్టమొదటిసారిగా మూఢవిశ్వాసాల నిర్మూలనా అవసరాన్ని, శాస్త్రీయభావ ప్రచార ఆవశ్యకతనీ గుర్తించగలిగారు. దీని పరిణామమే బెంగుళూరులో శాస్త్రవేత్తలుకొందరు కూటమిగా ఏర్పడి సాయి బాబా మహిమలను సవాలు చేయడం జరిగింది. అక్కడక్కడ ఎన్నో హేతువాద సంఘాలు ఏర్పడ్డాయి. ఆ ప్రేరణతో ఇప్పటికీ అవి పని చేస్తున్నాయి.

కేవలం, మహిమలు, మంత్రాలనే సవాలు చేయడం కాకుండా కోవూర్ శాస్త్రవేత్తలను కూడా వంచిస్తున్న పునర్జన్మ వృత్తాంతాలను అతీంద్రియ దృష్టి, జ్యోతిష్యం, పూనకాలు, స్వస్థత ప్రార్థనలు, యోగసిద్ధులు మొదలగు ఎన్నో విధాలైన - ప్రకృతి విరుద్ధమైన , శాస్త్రీయ సూత్రాలకు భిన్నమైన- సంఘటనల్నీ, అంశాలనీ లోతుగా అధ్యయనం చేశాడు, పరిశోధించాడు. "అతీంద్రియ దృష్టి" ప్రచారకుడు యూరిగెల్లర్‌ని, జ్యోతిష్య ప్రచారకుడు బి.వి.రామన్‌ని, యోగుల్ని, మాంత్రికుల్ని ఇలా ఒక్కర్ని కాదు, ఎందరినో, తమ ప్రచారాల్లోని నిజానిజాలెంతో శాస్త్రీయపరిశోధనలకు కట్టుబడి నిరూపించి లక్షరూపాయిలు గెలుచుకోవలసిందిగా పిలుపునిచ్చాడు.

కోవూర్ కంటే ముందు ఇట్లా మహిమల్ని నిరూపించమని సవాలు చేసినవారు చాలా కొద్దిమంది మాత్రమే వుండేవారు. వారిలో ప్రసిద్ధ ఇంద్రజాలికులైన హేరీ హౌడినీ, జోసఫ్ రిన్, మాస్కలైనిలాంటి ఇంద్రజాలికులు (మెజీషియన్సు) చెప్పుకోదగినవారు. ఆత్మలు, దయ్యాలు ఉన్నాయనీ, వాటితో మాట్లాడవచ్చునీ అమెరికా, యూరప్ దేశాలలో ఎందరో ఆత్మవాదులు చేసిన ఎత్తుగడలన్నీ వీరు ఎంతో నిశితంగా పరిశోధించి శాస్త్రవేత్తల, ప్రజల ముందర ఎండగట్టారు. ఆత్మలు, దయ్యాలు, మహిమలు, ఉన్నాయని నిరూపించగల ఏ ఒక్కరికైనా పదివేల డాలర్లు బహుమతి ఇస్తానని ప్రకటించారు. వీరి సవాళ్ళను స్వీకరించి పరిశోధనలకు ముందుకొచ్చిన 'ఆత్మవాదు'లెందరో ఓటమిపాలైనారు. కోవూర్‌పై వీరి ప్రభావం బాగా కనిపిస్తోంది.

కోవూర్ మంచి పరిశోధకుడు, మానసిక శాస్త్రజ్ఞుడు, జీవశాస్త్రం, ఖగోళశాస్త్రాలు ఆయనకు బాగా ఎరుక. దయ్యాలు, భూతాలు, చేతబడులు, అమ్మవార్లు, క్రీస్తుపట్ల

ఏర్పరుచుకున్న గట్టిమూఢనమ్మకాలు, లక్షలాది మందిని పూనకాలు (హిస్టీరియా), బెంగ (డిప్రెషన్)లాంటి అనేక శారీరక-మానసిక రుగ్మతలకు గురిచేస్తుండడంతో అలాంటి బాధితులెందరినో తన మాటల ప్రేరణతో (సజెషన్స్) సంపూర్ణ ఆరోగ్యవంతులుగా చేయగలిగాడు. వానపాముల్ని కోసి, కోసిన ముక్కలు వేటికవి స్వతంత్రజీవులుగా బ్రతకడాన్ని చూపించాడు. ఒక మాదిరి సాలెపురుగుల్ని ఫ్రిజ్‌లో అతిశీతలీకరణకు గురిచేసి -అవి చచ్చిపోయినట్టు నిర్ధారించాక, వాటికి కావలసిన వేడినెక్కించి మళ్ళా బ్రతికించి చూపాడు. 'ఆత్మ' అన్నది ఏ జీవికి అవసరం లేదని, అలాంటిదేదీ లేదని నిరూపించాడు. శ్రీలంకలో కోవూర్‌ని చాలామంది మేధావులు, భూతవైద్యులు, జ్యోతిష్యులు, స్వాములోర్లు సవాలు చేసారు. తీరా కోవూర్ వారి సవాళ్ళను స్వీకరించగానే తెరమరుగయ్యేవారు. ఆయన ఎక్కడ ఏ సభలో పాల్గొన్నా వందలాది మంది ఆసక్తిగా హాజరయ్యేవారు. బాబాలను, ఆయన సవాలు చేయడంతో యువతీయువకులు ఎంతో ఉత్సాహంగా ఆదరించేవారు. 1976సం॥లో భారతనాస్తికసమాజం ఆధ్వర్యంలో 'పుట్టపర్తి సాయిబాబా బండారం'పై డాక్టర్ కోవూర్ చేత ప్రసంగాన్ని ఆంధ్రవిశ్వవిద్యాలయం కాన్వొకేషన్ హాలులో ఏర్పాటు చేశాం. ఆ ప్రచార సందర్భంగానే నన్నూ, నాస్తిక సమాజం కార్యకర్తలు అనంత్, మూర్తి, సన్యాసిరావులను పోలీసులు లాకప్పులో పడవేసారు. అప్పటి ఎ.ఎస్.పి.దృష్టిలో 'బాబాల బండారం' అంటూ మేము పోస్టర్లు అంటించడం నేరమైందట. మేము ఊహించనంత జనం వచ్చారు. హాల్లో ఇసుక వేస్తే రాలనంత జనం. టిక్కెట్ల కోసం త్రోపులాట, కోట్లాట. నిజానికి విశాఖపట్నంలో ఏ ప్రదర్శనకీ అంత జనం ఎగబడలేదు నేటివరకు! ఇదంతా కోవూర్ కీర్తికీ, ఆయన చేపట్టిన ఉద్యమ ప్రభావానికీ నిదర్శనం. ఇదేవిధంగా 1975 మేలో తమిళనాడు తిరుచ్చి పట్టణంలో కోవూర్, నేను పాల్గొన్న సభల్లోనూ జరిగింది. తెండెప్పలుగా కోవూర్ ప్రసంగాన్ని, బాబాల బండారం ప్రదర్శననీ చూడడానికి తరలివచ్చారు జనం. కోవూర్ శ్రీలంక హేతువాద సంఘానికి అధ్యక్షుడు. 'Rationalist Ambassador' వార్షిక పత్రికల్లో తాను మూఢవిశ్వాసాల నిర్మూలనా పోరాటంలో ఎదుర్కొన్న అన్ని సంఘటనల, వ్యక్తుల గురించి వివరించారు. మహిమలు-మహత్తులుగా, అతీతశక్తులుగా భావింపబడుతున్న అనేక అంశాల గురించీ ఆయన రచించిన ఇంగ్లీష్ రచనలను తెలుగులో ప్రచురించే హక్కును నా పేరిట వ్రాసివ్వడం మా ఇరువురి చెలిమికీ తార్కాణంగా నిలుస్తుంది. అలా వెలువడినదే గతంలో భారత నాస్తిక సమాజం ప్రచురించిన 'కోవూర్ వ్యాసాలు'.

కోవూర్ మన మధ్య సజీవుడై లేకున్నా శాస్త్రీయదృష్టిని ప్రజల మధ్య ప్రచారం చేస్తున్న వందలాది మందికీ ఆయన ప్రేరణగా నిలిచిపోయాడు. "లక్షరూపాయల సవాలు' అన్నది ఆయనతో అంతం కాలేదు. భారత నాస్తిక సమాజంతో పాటు మరికొన్ని సంఘాలు కూడా మహిమలను ప్రదర్శించే ఏ బాబాకైనా, స్వామీజీకైనా లక్ష-రెండు లక్షలే కాదు రూ.21లక్షలు దాకా ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాయంటే ఇది కోవూర్ ఇచ్చిన ప్రేరణ ఫలితమే. మూఢనమ్మకాల నిర్మూలనా ప్రచారంలో కోవూర్ అవలంబించిన ఈ విధానం జనాకర్షకమైనదే కాదు. ఎంతో ప్రయోజన కరమైంది కూడా.

ఈ ప్రచారం, ఈ ఉద్యమం కొనసాగుతుంది. ఈ దేశంలోనే కాదు, ప్రపంచ మంతటా, మానవమేధను కలుషితం చేస్తున్న ఒక్క అవతారపురుషుడూ, ఒక్క స్వామీజీ, ఒక్క మంత్రగాడైనా ఉన్నంతదాకా కోవూర్ విసిరిన సవాలు నిలిచేవుంటుందంటే అతిశయోక్తి కాదు.

**- డాక్టర్ జయగోపాల్**
కేంద్రప్రధాన కార్యదర్శి
భారత నాస్తిక సమాజం

విశాఖపట్నం
19-08-97

## కథలు చదవబోయేముందు..... ఒక్కమాట

భారతదేశానికి స్వతంత్రం వచ్చి యాభై యేళ్ళయిందని ఎన్ని 'బంగారు పండగల్ని' చేస్తున్నప్పటికీ ఆ స్వతంత్రం వల్ల సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక రంగాలలో ప్రజలకు కల్గిన మేలు మాత్రం చెప్పుకోదగినంత లేదు. కులం కుమ్ములాటలు, మతం మారణకాండలు ఏ మాత్రం తగ్గలేదు. పైగా ఆ రెండు చెట్టాపట్టాలేసుకుని రాజకీయ ఆర్థిక రంగాల్లో మరింతగా తిష్టవేసి దేశప్రగతిని కుంటుపరుస్తున్నాయి. ఫలితంగా, అనేక దురాచారాలు, మూఢనమ్మకాలు పెరుగుతూ ప్రజల జీవితాలను, ఆలోచనలను శతాబ్దాల కొద్దీ వెనక్కి నెడుతున్నాయి. సైన్సు పెరుగుతోందని సమాజానికి అది ఎంతో ఉపయోగపడుతోందని అనిపిస్తున్నప్పటికీ, సైంటిఫిక్ ఆలోచనా ధోరణి మాత్రం ప్రజల మెదళ్ళకెక్కడం లేదు.

నేటి రచయితలు ఎన్నెన్నో విషయాలు మీద పుస్తకాలు వెలువరిస్తున్నారు. తెలుగు కథాసాహిత్యంలో ఎన్నో విలువైన రచనలు వస్తున్నాయ్. కాని, ప్రజల్లో శాస్త్రీయాలోచనలను, హేతువాద నాస్తికదృక్పథాన్ని పెంచగల సాహిత్యం మాత్రం అతి తక్కువగా వస్తోంది. ఇటువంటి సాహిత్యం అన్ని ప్రక్రియల్లో ఇబ్బడిముబ్బడిగా వస్తే ప్రజాజీవితాల్లో పెనుమార్పులు వస్తాయి. ఈ ఆలోచనే 'సత్యశోధన' ప్రచురణకు నన్ను ప్రేరేపించింది.

డాక్టర్ అబ్రహం థామస్ కోవూర్ 1976లో విజయవాడ వచ్చినప్పుడు వారి ఉపన్యాసం విన్నాను. నాస్తిక హేతువాద ఉద్యమవ్యాప్తి కోసం వారు పడిన తపన నాకిప్పటికీ ఆశ్చర్యాన్నిస్తోంది, ఆ ముసలితనంలో కాలికి బలపం కట్టుకుని, భారతదేశమంతటా పర్యటిస్తూ ప్రచారం చేసారు. తెలుగు నేలమీదా వారి ప్రభావంతో హేతువాద సంఘాలు పుట్టాయి. నాస్తిక సంఘాలు బలపడ్డాయి. వారు రాసిన కొన్ని వ్యాసాలను భారత నాస్తిక సమాజం 'కోవూర్ వ్యాసాలు'గా ప్రచురిస్తే, నాస్తిక కేంద్రంవారు 'కోవూర్' జీవితాన్ని అందించారు. చార్వాక, నాస్తికయుగం, హేతువాదం పత్రికలు వారి వ్యాసాలను ప్రచురించాయి. అవన్నీ చదివి, అనేకమంది హేతువాదులుగా మారిపోయారు. తెలుగునాట కోవూర్ తెచ్చిన హేతువాద విప్లవం చారిత్రకమైనది.

కోవూర్ పుట్టి ఈ యేటికి నూరేళ్ళు. శ్రీలంక, భారతదేశాల్లో అనేకచోట్ల శతజయంతి సభలు జరగనున్నాయి. 1898 ఏప్రిల్ 10న కేరళలోని తిరువెళ్ళలో,

ఇపెతోమా కట్టనార్, మరియం దంపతులకు కోవూర్ జన్మించారు. విద్యాభ్యాసం కేరళ, బెంగాల్ రాష్ట్రాల్లో జరిగింది. 1928 నుంచీ ఉద్యోగ నిమిత్తం తన నెచ్చెలి అక్కాతో శ్రీలంకలోనే కోవూర్ వున్నాడు. 30 ఏళ్ళ పాటు ఉద్యోగం చేసి 1959లో రిటైరయి అప్పటినుంచీ నాస్తిక హేతువాద ప్రచారానికే తన జీవితాన్ని అంకితం చేసారు. పుట్టపర్తి సాయిబాబా, నీలకంఠ బాబా వంటి మోసగాళ్ళకు ఆయన పేరంటేనే భయంగా వుండేది. అతీతశక్తులు, మహిమలు ఉన్నాయని నిరూపిస్తే లక్షరూపాయ లిస్తానని 1963లోనే ఛాలెంజ్ చేసి అజేయునిగా నిలిచారు. 1978 సెప్టెంబర్ 10న 80 ఏళ్ళ వయసులో కోవూర్ మరణించినా, వారిచ్చిన ప్రేరణ నేటికీ నాస్తిక హేతువాదులను నడిపిస్తూనే వుంది. ఆయన పోరాటకృషి నేటి తరానికి తెలియటం కోసం ఆయన శతజయంతి సందర్భంగా ఈ 'సత్యశోధన' వస్తోంది.



**1976**లో నెల్లూరులో జరిగిన హేతువాద ప్రచార సభలో యోగుల వలె తన 'నాడీ స్పందన'ను ఆపిన కోవూర్. పరీక్షిస్తున్న వైద్యులు

'సత్యశోధన'పై అభిప్రాయం కావాలని రంగనాయకమ్మగారిని అడిగాను. వారు దీనిని సొంతం చదివి, అభిప్రాయం రాస్తూ ఈ కథల్లోని కేసులను కోవూర్ పరిష్కరించిన విధంగా, పరిష్కరించేవారు ఎవరైనా వుంటే తెలపమన్నారు. "ఎవరైనా ఇలాంటి సమస్య వస్తే, ఫలానా సంఘ సభ్యుల్ని లేదా సైకాలజిష్టుల్ని కలవండి" అని సూచించమన్నారు. ఇదొక నిర్మాణాత్మక సూచన.

కానీ, కోవూర్ మాదిరి మనో విజ్ఞాన పరిజ్ఞానం, మేజిక్, హిప్నాటిజంలలో నిపుణత, కేసుల్ని నిశితంగా పరిశీలించి పరిష్కరించగల తెలివి వున్నప్పటికీ, ఎక్కడ ఏ మూఢనమ్మకం తలెత్తినా వెళ్ళి దాని లోతుపాతుల్ని గ్రహించి, పరిష్కరించే చొరవ గల మేధావులు మనకులేరు. ఇప్పుడిప్పుడే భారత నాస్తిక సమాజం కార్యకర్తలు, కొందరు హేతువాదులు అలాంటి ప్రయత్నం చేస్తున్నారు. వారింకా ఈ పనిలో పరిపక్వత సాధించాల్సి వుంది. కోవూర్ పరిష్కరించిన కేసులు ఎక్కువగా మనోవ్యాధులకు సంబంధించినవే. వాటి వెనుక ఆర్థిక, సాంఘిక, సామాజిక కారణాలుంటాయి. ఆ కారణాల గుట్టును రట్టుచేయకుండా ఆ వ్యాధులను కుదర్చడం తేలికకాదు. కొన్ని వ్యాధులకు వైద్యం అవసరం. ఆ వైద్యాన్ని అందించగల మానసిక

వైద్యులు నేడు తెలుగునాట అనేక పట్నాల్లో వున్నారు. విశాఖపట్నంలో డాక్టర్ జి.భాగ్యారావుగారు తన మానసిక వైద్యంతో భారత నాస్తిక సమాజ కార్యకలాపాలకు సహకరిస్తూ అనేకమంది రోగులను బాగుచేస్తున్నారు. ఈ పుస్తకంపై అభిప్రాయాన్ని అందించిన డాక్టర్ రామారెడ్డిగారు ప్రజాక్షేమాన్ని ఆశించే అలాంటి మానసిక వైద్యులే. నేడు భారత నాస్తిక సమాజం ప్రధాన కార్యదర్శిగా వున్న ఎన్.విక్రమ్‌గారు తన హిప్నాటిజం, మేజిక్ ప్రదర్శనలతో బాణామతి, పూనకాలు మొదలైన మనోవిభ్రమలకు చికిత్సనిచ్చి ఆదుకుంటున్నారు. ఇటువంటి వారి కృషి, మరో ప్రక్క పల్లెపల్లెలో ప్రజాచైతన్యం వెల్లివిరియాలని కోరుతూ, పనిచేసే కార్యకర్తలు నిత్యమూ ఆ పల్లెలో ప్రజల్తో బ్రతుకుతూ అనేక మూఢనమ్మకాలను గమనిస్తున్నారు. వారికి కూడా ఉపయోగపడుతూ, కొంతైనా మార్గదర్శకంగా ఈ 'సత్యశోధన' తోడ్పడగలదని నా నమ్మకం.

'సత్యశోధన'లోని కథలన్నీ కోవూర్ స్వీయఅనుభవాలే. కోవూర్ వీటిని అనుభవాలుగానే చిత్రించాడు. ఇవన్నీ కథాశైలితో వుంటే తెలుగు పాఠకులకు తేలికవుతుందని నేనీ ప్రయత్నం చేసాను. అంటే మూలకథ కోవూర్‌ది, కథనం మాత్రమే నాది. ఇందులోని కథలన్నీ 'ది సిలోన్ రేషనలిస్ట్ అంబాసిడర్' పత్రికలో వచ్చాయి. జయ్ కో పబ్లిషర్స్ ప్రచురించిన పుస్తకాలు కూడా చూసాను. 1990-91 కాలంలోనే కొన్ని కథలు నాస్తికయుగంలో అచ్చయ్యాయి. అప్పుడు వాటిని చదివి "ఇవి చాలా బాగున్నాయ్. ఆపకుండా ప్రచురించండి" అని రంగనాయకమ్మగారు రాసారు. అలాగే ఈ కథలను మళ్ళీ మళ్ళీ పుస్తకంగా తేవడానికి ప్రోత్సహించిన భా.నా.స.ప్రధాన కార్యదర్శి జయగోపాల్‌గారికి, నా నెచ్చెలి బి.లీలగారికి, పి.వి.రమణమ్మగారికి కృతజ్ఞతలు చెప్పుకొంటున్నాను. పుస్తకాన్ని చదివి కొన్ని సవరణలు, సూచనలు అందించిన రంగనాయకమ్మగారికి, చక్కని అభిప్రాయాలను అందించిన డాక్టర్ రామారెడ్డిగారికి, సి.వి.గారికి, కోవూర్ పోరాట వ్యక్తిత్వాన్ని చిత్రించిన జయగోపాల్‌గారికి, అక్షరాలు అందంగా కూర్చిన సాయిసత్య కంప్యూటర్స్, విశాఖపట్నం వారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

**- బి.సాంబశివరావు**

# లోపలిపేజీలలో

# అసూయ తెచ్చిన అనర్థం

ప్రశాంతమైన ఉదయకాలపు వేళలో డాక్టర్ కోవూర్ దినపత్రికలో ముఖం పెట్టి సీరియస్‌గా చదువుతున్నాడు. ఇంతలో కాంపౌండ్ గేట్ కిర్రున తెరుచుకుంది. తలెత్తి చూశాడు.

"నమస్కారం సార్!"

"నమస్తే! మీరు..."

నా పేరు చిన్నతంబి సార్. నేను ఇక్కడే కొలంబోలో చిన్న వ్యాపారం చేస్తున్నాను. మీగురించి చాలా విన్నాను. నాకొచ్చిన సమస్య మీవల్లే పరిష్కారం కాగలదన్న నమ్మకంతో వచ్చాను సార్!" ఇతని వాలకం చూస్తే ఏదో మనోవేదనలో ఉన్నట్టుంది. పైగా 'సమస్య' అంటున్నాడు. ఏమిటో తెలుసుకోవాలని కోవూర్‌పేపరును ప్రక్కన పెట్టాడు.

"ఊ.. చెప్పండి. ఏమిటి మీ సమస్య"

"మాది జాఫ్నాలోని కరైనగర్ ప్రాంతం సార్. అక్కడే మా అమ్మా నాన్నా, అక్కా బావ, వాళ్ళ పిల్లలు అంతా మా తాతలు కట్టించిన ఓ పాత ఇంట్లో వుంటున్నాం. ఆ ఇంటికి ఏ శని పట్టిందో ఏ దయ్యం పూనిందో.. తెలీదు. రెండు నెలల నుంచీ రాత్రిళ్ళు రాళ్ళు పడుతున్నాయి. ఇంట్లో వస్తువులు మాయమవుతున్నాయి. దాచుకున్న డబ్బు కనిపించడం లేదు. ఏం చెప్పమంటారు సార్! ఆ ఇంట్లో రాత్రి అవుతుందంటే వణికిపోతున్నారు. ఇలాంటి వాటిని మీరు అవలీలగా పరిష్కరించగలరని మిత్రులు చెప్పగా విన్నాను. దయచేసి మీరు ఆ మా సమస్యను తొలగించాలి సార్!"

చిన్నతంబి కళ్ళలోఎంతో ప్రాధేయత. ముఖంలో జాలి, ఒక్కక్షణం సాలోచనగా చూశాడు కోవూర్.

"చిన్నతంబీ! ఇలాంటివి నేను ఎన్నో తొలగించిన మాట నిజమే, ప్రయత్నిస్తే నీవే దీన్ని పరిష్కరించుకోవచ్చు."

"అదెలా సార్!"

"నిజానికి దయ్యాలనేవి ప్రపంచంలో ఎక్కడా వుండవు. అలాంటప్పుడు మీ ఇంట్లో ఎలా వుంటాయి? ప్రయత్నిస్తే నీవే పట్టుకోవచ్చు".

ఎలా ప్రయత్నించాలో కొంత వివరించాడు కోవూర్. అంతా విన్నాక చిన్నతంబికి ధైర్యం వచ్చింది. ప్రయత్నించి ఇంటి దొంగను పట్టుకొంటానని కళకళలాడే ముఖంతో వెళ్ళిపోయాడు. కానీ పట్టుమని పదిహేను రోజులు గడిచీ గడవక ముందే మళ్ళీకోవూర్ ముందు ప్రత్యక్షమయ్యాడు చిన్నతంబి. బరువెక్కిన గుండెతో, నిరాశతో వచ్చిన చిన్నతంబి చెప్పిందంతా విన్నాడు కోవూర్. తన ఇంట్లో ఎవరూ నేరస్థులులేరని, ఖచ్చితంగా ఏదో దయ్యమే ఇవన్నీ చేస్తుందని తాను గట్టిగా నమ్ముతున్నానని చిన్నతంబి చెప్తుంటే కోవూర్ పెదాలపై చిరునవ్వు కదలాడింది. తాను బయలుదేరక తప్పదనుకొన్నాడు. తాను ఎప్పుడు వచ్చేది చెప్పి చిన్నతంబిని పంపివేశాడు.

ఆరోజు 1965వ సంవత్సరం మే 13వ తేదీ. కొలంబో నుంచి వచ్చిన విమానం జాఫ్నాలో దిగింది. అక్కాతో కలసి విమానం దిగుతున్న కోవూర్‌ని చూడగానే పిళ్ళై ముఖంలో ఆనందం పుచ్చపువ్వులా విరిసింది. సాదరంగా ఆహ్వానించి కారులో తన ఇంటికి తీసుకెళ్ళాడు.

చిన్నతంబి తండ్రి తానాపతి పిళ్ళై తాను రిటైరయ్యేంతవరకు సింగపూర్ ఓడరేవులో గుమాస్తాగా పనిచేశాడు. జపాన్ వాళ్ళు మలయాను ఆక్రమించాక, తన భార్య పొన్నమ్మ, కూతురు పాకియం, కొడుకు చిన్నతంబిలతో జాఫ్నా వచ్చేశాడు. దాచిన డబ్బుతో కూతురు పెళ్ళిచేశాడు.

పాకియం భర్త పొన్నాంబలం. అతడొక వ్యాపారి. వారికి ముగ్గురు పిల్లలు - దేవనాయకి, సుకీర్తం, సెల్వమ్మలార్. పెద్దవాళ్ళిద్దరూ చదువుతున్నారు.

అంతకుముందు రోజే పిళ్ళై కుటుంబం 'మురుగన్' దేవుని వద్ద 10రోజుల పాటు పూజలు జరిపి వచ్చారు. తమ ఇంటికి పట్టిన పీడను వదిలించమని వారు 'మురుగన్' (సుబ్రహ్మణ్యస్వామి)ని వేడుకొన్నారట. చిన్నతంబి కోవూర్ రాకను వారికి ముందే చెప్పాడు.

ఇంట్లో దిగగానే కోవూర్, ఇంటినీ, వెనుక ఉన్న తోటను, పరిసరాలను క్షుణ్ణంగా పరిశీలించాడు. చిన్నతంబిని పిలిచి తన మధ్యాహ్నం భోజనం గురించి అడిగాడు. లోలోపల ఆశ్చర్యపడుతూనే చిన్నతంబి, తమ ఇంట్లో తమతోనే భోంచేయవలసిందిగా కోరాడు. అయితే, తాను రమ్మనేంతవరకు దేవనాయకిని ఇంటి వరండాలోనే ఉంచాలని, ఎక్కడికి కదలనివ్వవద్దని కోవూర్ చిన్నతంబిని కోరాడు.

ఇంటికి కొద్దిదూరంలో వున్న అతిథి గృహంలో తన పరిశోధన మొదలుపెట్టాడు కోవూర్. వరుసగా తానాపతి పిళ్ళైని, పొన్నమ్మను, పాకియంలను పిలిచి అడగవలసినవన్నీ అడుగుతుంటే, వాటిని రికార్డు చేసుకోవడంలో లీనమైంది అక్కా.

***

జనవరి చివరివారంలో తానాపతి పిళ్ళై కీళ్ళనొప్పులతో మంచానపడ్డాడు. కషాయాలు ఎన్ని తాగించినా, ఎన్ని రకాల నూనెలతో మర్దనం చేయించినా ఫలితం కనపడలేదు. మరో పదిహేనురోజులకే అతిసారవ్యాధితో పొన్నమ్మ కూడా మంచమెక్కింది. ఇలా ఒకరి తర్వాత మరొకరు జబ్బు పడడానికి కారణం ఏమిటి? ఇలా ఎన్నడూ జరగలేదే! రేపు పాకియం, ఎల్లుండి వాళ్ళ పిల్లలు కూడా ఇలాగే అయితే...! అమ్మో! అలా జరగడానికి వీల్లేదు.



పిళ్ళై తన అనుమానం తీర్చుకోవడానికి ప్రక్క గ్రామంలోనే వుంటున్న ఓ మంత్రగాణ్ణి సంప్రదించాడు. అసలే జాలరి వృత్తిలో వున్న ఆ మంత్రగాడికి, పిళ్ళై కోరి వచ్చి వలలో చిక్కిన చేపలా కన్పించాడు. అంజనం వేసి, మహాభయంకరమైన దయ్యం ఒకటి వారి ఇంటిలో వుంటున్నదని, లక్ష్మి అనబడే దూరపు చుట్టం చేతబడి చేయించి ఆ దయ్యాన్ని పంపింది అని కథ అల్లాడు. 150రూపాయిలిస్తే తాను ఆ దయ్యం పనిపడతానని హామీ ఇచ్చాడు.

ఫిబ్రవరి 3వతేదీ దయ్యాన్ని వదిలించే 'విడుపుపూజ' జరిగింది. మంత్రగాడు కోరినవన్నీ అమర్చారు. చాలా ఖర్చు అయింది. అయినా వారి అనారోగ్యంలో మార్పేలేదు.

మర్నాడు పిళ్ళై బావి దగ్గర స్నానం చేస్తూ తన కట్టుడు పళ్ళ గుత్తిని (కృత్రిమ దంతాల సెట్) తీసి ప్రక్కనే ఉన్న రాతి మీద పెట్టాడు. స్నానం ముగిసాక చూస్తే అది కన్పించలేదు.

తర్వాత ఇలాంటివి జరిగాయి. తలుపుల తాళాలు పోయాయి. టూత్‌పేస్ట్ ట్యూబు కన్పించలేదు. ధర్మాసుపత్రి వారు ఇచ్చిన మందులు మాయమయ్యాయి. ఇవి రెండ్రోజుల తర్వాత వంటగదిలో ఒక గిన్నె కింద దొరికాయి.

మార్చినెల నుంచి ఇంట్లో రాళ్ళు కూడా పడసాగాయి. అవి కూడా ఉదయం 9గంటలలోపు, మధ్యాహ్నం 2గంటల నుండి, రాత్రి 9గంటలలోపు పడేవి.

పిళ్ళై మళ్ళీ మంత్రగాళ్ళ కోసం తిరిగాడు. ఓ రైల్వే ఉద్యోగి, పేరు శివపెరుమాన్, తటస్థపడి తను గొప్ప శక్తిగల మంత్రగాణ్ణని, అతీతశక్తులెన్నో తన వద్ద ఉన్నాయని నమ్మించాడు. అంజనం వేసి, పిళ్ళై శత్రువొకరు వారి తోటలో ఒక చోట మంత్రించిన శక్తిని దాచారని, దాని వల్లేవారి కుటుంబంలో ఎన్నో కష్టాలు వస్తున్నాయని, ఇంకా వస్తాయని కూడా భయపెట్టాడు. తన గొప్పతనాన్ని చాటుతూ ఒక మాజీ మంత్రికి తానెలా

సాయపడిందీ చెప్పాడు. పిళ్ళై నమ్మక తప్పలేదు. వారిద్దరి మధ్య రూ.5000 నుంచి బేరం మొదలై చివరికి రూ.500 దగ్గర కుదిరింది.

ఓరోజు రాత్రి 10గంటల నుంచి పూజ మొదలైంది. అర్ధరాత్రి దాకా ఏవో మంత్రాలు వల్లెవేస్తున్నాడు శివపెరుమాన్. హఠాత్తుగా పూజ మీదనుంచి లేచాడు. తోటలోకి వెళ్ళి గునపంతో త్రవ్వాక ఏదో మర్చిపోయినవానిలా గబగబా గదిలోకి వెళ్ళాడు. అందరూ ఆశ్చర్యంలోంచి తేరుకోకముందే వంటి మీద నూలుపోగు లేకుండా, మొండిమొలతో తిరిగివచ్చాడు. అప్పటి వరకూ అదంతా చూస్తున్న పొన్నమ్మ, పాకియంలు తిట్టుకుంటూనే ఇంట్లోకి వెళ్ళిపోయారు. గోతిలోకి దిగిన శివపెరుమాన్ మరో రెండు అడుగులు త్రవ్వాడు. చివరికి ఓ తాయెత్తును విప్పి చూపించాడు.ఎవరికీ అర్థంకాని గీతలవి. తాను చదివి, అర్థమైనట్లు నటించి, ఇకనుంచి మరే బాధలు వుండవని చెప్పి, బట్టలు కట్టుకుని తన డబ్బు పుచ్చుకొని చక్కా వెళ్ళిపోయాడు.

పిళ్ళైకి, చిన్నతంబికి అదంతా మోసంగానే తోచింది. అయినా ఏమీ చేయలేక పోయారు. గుడ్డినమ్మకాల పిరికితనం వారిని మాట్లాడనీయలేదు.

మర్నాటి నుంచి మళ్ళీ రాళ్ళు పడసాగాయి. ఇంట్లోని అల్లరి ఏమీ తగ్గలేదు. పిళ్ళై శివపెరుమాన్ దగ్గరికి పరిగెత్తాడు. మళ్ళీ ఒకసారి రమ్మని ఒత్తిడి చేశాడు. ససేమిరా రానని, తనకు వేరే పనులున్నాయని తప్పించుకున్నాడు.

ఓరోజు పిళ్ళైని చూడాలని ఓ స్నేహితుడు వచ్చాడు. తెచ్చిన చేతిసంచిని టేబిల్ మీద వుంచి లోనికి వెళ్ళాడు. టిఫిన్ చేసివచ్చేసరికి సంచి కనిపించలేదు. అందులో ఎన్నో విలువైన డాక్యుమెంట్స్ కూడా ఉన్నాయని బాధపడ్డాడు. ఎంత వెదికినా ఫలితం లేకపోయింది.

తర్వాత రోజు నుంచి కష్టాలు మరీ ఎక్కువయ్యాయి. పొయ్యి మీద ఉడికే అన్నంలో ఇసుక, పెంట కన్పించేవి. ఒక్కోసారి అన్నం పెట్టుకోవాలని పాత్రలు తీస్తే వాటిలో కూడా ఇవే కన్పించేవి. ఎన్నోసార్లు అన్నం తినకుండానే గడపాల్సి వచ్చింది.

ఓసారి 'పాకియం' తన ముగ్గురు కూతుళ్ళతో బావి దగ్గరకు స్నానానికి వెళ్ళింది. బట్టలు విప్పదీసి బావి ప్రక్క పడేసి అయిదురూపాయిల నోటును వాటి క్రింద పెట్టింది. అందర్నీ స్నానం చేయించాక చూస్తే ఆ డబ్బు కనిపించలేదు.

ఇది జరిగాక, ఓరోజు పొన్నాంబలం ఇద్దరు మంత్రగాళ్ళను తీసుకువచ్చాడు. వారికేమైనా పెట్టాలని పాకియం, దేవనాయకిని పిల్చి లడ్డూలు తెమ్మని సంచి ఇచ్చి పంపింది. వాటిని తేగానే సంచిలోకి చూస్తే వాటినిండా ఇసుక వుంది. ఏమయిందని అడిగితే, తనకేమీ తెలియదని అమాయకంగా మొహం తిప్పింది. మళ్ళీ పంపారు తెమ్మని. రెండోసారి అలానే జరిగింది. అది కూడా దయ్యం పనే అనుకొని స్వయంగా ఏదో పిండివంటకం చేసింది పాకియం.

మంత్రగాళ్ళు పూజ మొదలుపెట్టి అర్థరాత్రి దాటాక, రెండు కోడిపుంజులను బలిఇవ్వడానికి పూనుకొన్నారు. తీరాచూస్తే ఒక్క పుంజే వుంది. రెండోదేమైంది? వారిలోనూ భయం పుట్టింది. ఆ ఒక్కదాన్ని బలి ఇవ్వడానికి సిద్ధపడగానే వాళ్ళ మీద రాళ్ళ వాన మొదలయింది. తమ వల్ల కాదని పలాయనం చిత్తగించారు.

రెండురోజులయ్యాక, తనకు రొమ్ములో నొప్పిగా వుందంటూ కేకలు పెట్టింది దేవనాయకి. పాకియం జాగ్రత్తగా గమనించగా, రొమ్ములో గడ్డ పుట్టిందని లబోదిబోమంది. అది కూడా దయ్యం పనే అనుకున్నారు అందరూ. మంత్రగాళ్ళ మీద నమ్మకం తగ్గింది. ఇలవేల్పు 'మురుగన్'ను కొలవటమే మార్గమనుకొన్నారు. పదిరోజుల పాటు ఎన్నో కానుకలు, పళ్ళు, పూలు సమర్పించుకుంటూ పూజలు చేయసాగారు.

ఇదే సమయంలో చిన్నతంబి, కోవూర్ గురించి వినడం, వెళ్ళడం, ఒప్పించడం అయిపోయింది. కోవూర్ దంపతులు వచ్చే నాటికి తమ పూజలు పూర్తి చేసుకొనేవచ్చారు.

***

కోవూర్ 'పాకియం'తో మాట్లాడుతూనే ఉన్నాడు. బయట ఏదో కలకలం. ఎవరో ఎవర్నో తిడుతున్నారు. చూసిరమ్మని పాకియంని పంపాడు. ఆమె తిరిగి వచ్చి తన పక్కింటావిడ రాజ్యలక్ష్మి వచ్చిందని, తన తండ్రి ఆమెను తిడుతున్నాడని చెప్పింది. తమ ఇంటిలో జరిగే పీడలన్నింటికీ 'లక్ష్మి' కారణమని ఓ మంత్రగాడు చెప్పాడని, అప్పట్నుంచి తన తండ్రికి ఆమెపై అనుమానం అని, ఆమె ఎప్పుడు వచ్చినా తిడతాడని కూడా చెప్పింది.

కోవూర్ పాకియంని పంపించి, దేవనాయకిని పిలిపించాడు. అందరిలా కాకుండా, దేవనాయకితో ప్రత్యేకంగా ప్రవర్తించాడు. తనకన్నీ తెలుసుననీ, ఆమె ఇవన్నీ చేస్తుందని కూడా నొక్కి చెప్పాడు. ఆమె కూడా తన గుట్టు తెల్సిపోయిందని, తను అబద్ధమాడినా ప్రయోజనం లేదని గ్రహించింది. నిజాన్ని ఒప్పుకొంది. తానే ఇవన్నీ చేస్తున్నట్లు ఎవరికీ చెప్పవద్దని కోవూర్‌ని బ్రతిమిలాడింది. మళ్ళీ ఇటువంటి చేష్టలు చేయనని మాటిస్తే ఎవ్వరికీ చెప్పనన్నాడు కోవూర్.

కోవూర్ అడిగిన మీదట, తానే వస్తువులు తీసింది, ఎక్కడదాచిందీ, ఏమేమీ చేసిందీ వివరంగా తెలిపింది దేవనాయకి.

తలుపుల తాళాలు తానే దాచానని, టూత్‌పేస్ట్ ట్యూబ్‌ని ఇంటి వెనుక తాటిచెట్టు మొవ్వలో దాచానని చెప్పింది. అయిదురూపాయిల నోటు కొబ్బరి చెట్టు మట్టల్లో వుంచానని, తన తండ్రి స్నేహితుని సంచిని తాటిచెట్ల పొదల్లో పడేసానని, అయితే తన తాతగారి కట్టుడుపళ్ళ సంగతి తనకు తెలియదని లడ్డూల్లో ఇసుక తనే వేశానని ఒప్పుకొంది.

నిజం ఒప్పుకొన్నందుకు దేవనాయకిని మెచ్చుకొన్నాడు కోవూర్.

అంతా మధ్యాహ్న భోజనాన్ని పూర్తిచేశారు. తర్వాత అందర్నీ ఒకచోటికి రప్పించి సమావేశపరిచాడు కోవూర్. వారితో ఇలా అన్నాడు.

"ఈ ఇంట్లో ఏ దయ్యమూ లేదు. ఎవరూ ఏ మంత్రమూ వేయలేదు. ఎవర్నీ అనుమానించి అవమానించడం మానవత్వం కాదు. ముందు మీరంతా అనుమానించిన రాజ్యలక్ష్మికి క్షమాపణ చెప్పండి. మంత్రగాళ్ళకే మహిమలుంటే ప్రపంచంలో వార్ని మించిన ధనవంతులుండరు. అంజనాలు వేయడం, కార్డులు చూసి భవిష్యత్తు చెప్పడం, చెంబు జోస్యాలు, దయ్యాల్ని వదిలించడం మొదలైనవన్నీ మోసాలే. అజ్ఞానాన్ని అమాయకత్వాన్ని సొమ్ము చేసుకోవాలనుకునేవారికివి సులువైన మార్గాలు.

ఇకనుంచి ఆ ఇంట్లో మీకే ఇబ్బందులు వుండవు. పోయిన వస్తువులన్నీ తిరిగి వస్తాయి. కట్టుడుపళ్ళు తప్ప. వాటిని ఏ కాకో ఎత్తుకుపోయింది. పిళ్ళై, పొన్నమ్మలకు వచ్చిన అనారోగ్యం దయ్యాల వల్ల కాదు. అలాగే దేవనాయకికి రొమ్ముల్లో వచ్చిన గడ్డ కూడా అలాంటిదే.

వీటన్నిటికీ వైద్యుణ్ణి సంప్రదించాలి కానీ, మంత్రగాళ్ళను కాదు. మంత్రాల వల్లే రోగాలన్నీ తగ్గితే ఆస్పత్రుల్లో వైద్యులతో పాటు, మంత్రవైద్యులు వుండేవారు. ఇకనుంచి ఏ మంత్రగాణ్ణి దేనికీ సంప్రదించకండి".

వారం తర్వాత కోవూర్‌కి చిన్నతంబి నుంచి ఫోన్ వచ్చింది. తమ ఇంట్లో ఇప్పుడే బాధలు లేవన్నాడు. పోయినవన్నీ దొరికాయని చెబుతూ తమ పీడలన్నిటినీ తొలిగించినందుకు కోవూర్‌కి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. అయితే, ఆ తర్వాత మూడు రోజులకు చిన్నతంబి మళ్ళీ కోవూర్ ముందు ప్రత్యక్షమయ్యాడు. తన ఇంట్లో మళ్ళీ పూర్వపు 'పీడ' మొదలయిందని వాపోయాడు. రాళ్ళు పడుతున్నాయని, ఇంట్లో మునుపటి మాదిరిగానే అన్నీ జరుగుతున్నాయని ఆందోళన పడ్డాడు.

దేవనాయకి తనకిచ్చిన మాట తప్పిందన్నమాట! ఇక తను ఉపేక్షించితే ప్రయోజనం లేదు. కోవూర్ చిన్నతంబికి విషయమంతా వివరించాడు. ఈ పనులన్నింటికీ దేవనాయకి ఎలా కారణమో వివరించాడు. చిన్నతంబికి మేనకోడలిపై కోపం హద్దుమీరింది. ముఖం కందగడ్డ అయింది. పరిస్థితిని గమనించిన కోవూర్ అతణ్ణి శాంతింపచేసాడు. దేవనాయకిని ఏమీ అనవద్దని, ఆమె పట్ల శాంతం, సానుభూతి చూపిస్తేనే ప్రయోజనముంటుందని చెప్పాడు. ఒక వారం రోజులపాటు మానసిక వైద్యుని వద్ద ఉంచితే అన్ని తగ్గిపోతాయని కూడా సూచించాడు.

అయితే రెండు రోజులయ్యాక పిళ్ళై, పొన్నాంబలం, దేవనాయకి కోవూర్ దగ్గరకు వచ్చారు. అందర్నీ కిందనే వుంచి, దేవనాయకిని తన ట్రీట్‌మెంట్‌రూంలోకి తీసుకెళ్ళాడు కోవూర్.

ఇచ్చిన మాట తప్పినందుకు దేవనాయకి ఏడ్పుమొహం పెట్టింది. మరెప్పుడూ అలాంటి పనులు చేయనని, తన తండ్రి ముందు నేరాన్ని ఒప్పుకొంటానని చెప్పింది. తర్వాత దేవనాయకిని హిప్నాటిక్ నిద్రలోకి పంపి తగిన సూచనలిచ్చాడు కోవూర్. పిళ్ళై

ముందు, దేవనాయకి తన తప్పులను అంగీకరించింది. ఆమె పట్ల ప్రత్యేక శ్రద్ధ, ప్రేమ ఉండాల్సిన అవసరాన్ని గూర్చి కోవూర్ పిళ్ళైకి వివరించాడు.

ఇంట్లో వ్యక్తులే ఇటువంటి 'చిలిపి చేష్టల'కు పాల్పడి, కుటుంబాన్ని ఆందోళనకు గురిచేస్తుంటారని కోవూర్ చిన్నతంబికి మొదట్లోనే చెప్పినా నమ్మలేదు. లడ్డూలు తేవడానికి వెళ్ళిన దేవనాయకి వాటిలో ఇసుక కలిపి తెచ్చినా ఆమెను అనుమానించలేదు. మానవాతీత శక్తుల పట్ల వారికున్న మూఢత్వమే దీనికి కారణం.

కోవూర్, పిళ్ళై ఇంటికి వచ్చిన కొద్దిసేపటికే దేవనాయకిని అనుమానించి ఆమెను వరండాలో ఉంచాడు. అదే జరగకపోతే వారికి మధ్యాహ్న భోజనంలో ఏవేవో కన్పించేవి. వేరేచోట భోజనం చేయవల్సి వచ్చేది.

దేవనాయకి పొన్నాంబలం, పాకియంల తొలిబిడ్డ. అందుకే అందరికీ గారాబు బిడ్డ అయింది. చిన్నతనం నుంచీ ఎవరు ఎక్కడికి వెళ్ళినా ఏదో ఒక కానుక కొని తెస్తుండేవారు. ఆమెకేమైనా జరిగితే అంతా తల్లడిల్లిపోయేవారు. ఇలాంటి స్థితిలో దేవనాయకికి చెల్లెలుగా 'సుకీర్తం' పుట్టింది. అప్పట్నుంచి తన పట్ల అందరి ప్రేమ తగ్గినట్లు ఆమె గ్రహించగల్గింది. తన చెల్లెలి పట్ల అసూయ బీజాలు కూడా మనసులో ఏర్పడ్డాయి. మరికొన్నేళ్ళకి మరో చెల్లెలు 'సెల్వమ్మలార్' పుట్టింది. నిప్పుకు గాలి తోడయినట్లయింది. పూర్వమున్న ప్రేమాభిమానాలు ఇప్పుడు తనకెవ్వర్నుంచీ లభించడం లేదు. పైగా యవ్వనదశ దాపురిస్తోంది. మాటలో, మనసులో, నడకలో, నడతలో మార్పులొస్తున్నాయి. తనను అందరూ గుర్తించాలి. అందరిలో తనకి గుర్తింపు కావాలి. అదెలా వస్తుంది? దేవనాయకి మనసులో మొదలైన ఆలోచనల అలజడికి ఆకృతినిచ్చిన సంఘటన పొన్నమ్మ, పిళ్ళైల అనారోగ్యం. వైద్యునికి బదులు మంత్రాలనాశ్రయించడం, ఆ ఇంట్లో ఏదో దయ్యం తిష్టవేసి ఇవన్నీ కల్పిస్తోందని మంత్రగాళ్ళు చెప్పడం, దేవనాయకి చేతలకు గ్రీన్‌సిగ్నల్ అయింది. వరుసగా ఏదో ఒక అలజడి సృష్టిస్తూనే వుంది.

అయితే మనకు మరో సందేహం రావచ్చు. తాను ఇకపై ఏ నేరమూ చేయనని కోవూర్‌కి మాట ఇచ్చాక కూడా మళ్ళీ ఎందుకు దేవనాయకి తన 'అల్లరి' సాగించింది?

కోవూర్ దేవనాయకిని గూర్చి వాళ్ళ పెద్దలకి చెప్పలేదు. కనుక ఇన్నాళ్ళు 'దయ్యమే' ఇవన్నీ చేసిందనే తప్పుడు భావన నుంచి వారు తేరుకోలేదు. పైగా కోవూర్ దగ్గర్లో కూడా లేడు. కనుక తను మళ్ళీ గొడవలు సృష్టించడానికి పూనుకొంది. మొదటే కోవూర్ హిప్నాటిజం ద్వారా సూచనలిచ్చివుంటే, అందరికీ ఆమెను గూర్చి చెప్పివుంటే రెండోసారి దేవనాయకి ప్రయత్నించి ఉండేది కాదు.

ముందుగానే దేవనాయకిని 'ముద్దాయి'గా కోవూర్ గుర్తించడానికి లేదా అనుమానించడానికి ఆమె తెచ్చిన లడ్డూల్లో ఇసుకవుండడం, ఆమె స్కూల్లో వున్న సమయంలో ఇంట్లో ఏమీ జరగకపోవడం ముఖ్య ఆధారాలు. ●

# ఆత్మలతో ముచ్చట్లు

అది 1941వ సంవత్సరం. అప్పుడు జాఫ్నా జిల్లాకోర్టుకు సైమన్ రోడ్రిగో అనే వ్యక్తి జడ్జిగా వుండేవాడు. అప్పటికే అతనికి అత్యంత ప్రియమైన అతని భార్య మరణించింది. ఆమె వియోగం అతన్ని బాగా కలచివేసింది. ఆమె తలపుల్లో అతడు అన్నీ మరిచేవాడు.

చనిపోయినవారి ఆత్మలు తనని బాగా ప్రేమించే వారిని అంటిపెట్టుకుని వుంటాయనే మూఢనమ్మకం రోడ్రిగోకి బాగావుంది. అలాగే, అభ్యసిస్తే ఆత్మని కూడా వశం చేసుకోవచ్చుని తను కోరినవారి ఆత్మలతో అన్ని విషయాలను స్వేచ్ఛగా మాట్లాడవచ్చుని విన్నాడు. కోర్టుపనిపై వుండే శ్రద్ధ కన్నా ఆత్మలపై ఆసక్తి ఎక్కువైంది.

ఆత్మల గురించి సమాచారం వున్న పుస్తకాలెక్కడున్నాయని తెలిసినా వాటిని సంపాదించి చదివిందాకా విశ్రమించేవాడు కాడు. జాఫ్నా పబ్లిక్ లైబ్రరీలోని ఆత్మల పుస్తకాలన్నీ రోడ్రిగో ఇంట్లో టేబుల్ మీద గానీ, కోర్టులోని అతని ఛాంబర్‌లోగానీ కన్పించేవి.

క్రమంగా ఓ వార్త జాఫ్నాలో వ్యాపించింది. జడ్జిగారు ఆత్మలతో మాట్లాడుతున్నారని అందరూ అనుకోసాగారు. తన భార్య ఆత్మతో గంటలకొద్దీ మాట్లాడేవాడనీ, తనకు చెందిన, తన కుటుంబానికి చెందిన చాలా విషయాలను గూర్చి చర్చించేవాడనే ప్రచారం అధికమయింది.

ఈ విషయాలన్నింటిని గూర్చి ఎవరైనా రోడ్రిగోని అడిగితే నిజమేనని చెప్పేవాడు. తనకు ఆత్మలతో మాట్లాడే విద్య ప్రేమకుమార్ ద్వారా లభించిందని చెప్పుకునేవాడు.

డాక్టర్ కోవూర్ వద్ద ఆత్మల గురించిన పుస్తకాలున్నాయని తెలిసి అతనితో పరిచయం పెంచుకున్నాడు రోడ్రిగో. కోవూర్ దగ్గరున్న అనేక ఆత్మల పుస్తకాలను చదవడానికి తీసుకెళ్ళేవాడు. వాళ్ళిద్దరూ మరణానంతర జీవితంపై గంటలకొద్దీ చర్చించేవారు.

రోడ్రిగో ఆత్మల విషయమై అడిగితే ఏ పుస్తకంలో, ఏ పేజీలో ఏ విషయముందో ఇట్టే చెప్పేవాడు – క్రీస్తు బోధకులు తమ ఉపన్యాసాల్లో బైబిల్ వాక్యాలను అధ్యాయాలు, వాక్యాల సంఖ్యను ఉదహరించినట్లు.



మైర్స్, సోల్, సిడ్‌గ్విక్, పాడ్‌మోర్, ఆలివర్ లాడ్జ్, అలగ్జాండర్ కానన్, హేరీప్రైస్, థోలెస్ మొదలగువారి రచనలన్నీ అతనికి కంఠేపాఠం. విచిత్రమేమిటంటే జన్మరీత్యా, విశ్వాసంరీత్యా అతడు బౌద్ధుడు. బౌద్ధంలో ఆత్మ సిద్ధాంతానికి తావులేదు. కానీ రోడ్రిగో బౌద్ధాన్ని విస్మరించి ఆత్మల విషయంలో క్రిస్టియన్ సిద్ధాంతాన్ని బాగా నమ్మాడు.

ఆ రోజు నవంబర్ 5వ తేదీ. రోడ్రిగో చాలా వేగంగా కోవూర్ దగ్గరకి వచ్చాడు. అతని ముఖంలో, నడకలో ఏదో ఆదుర్దా, ఎంతో ఆనందం. "అబ్రహాం! నా భార్య మాట్లాడింది తెలుసా! గంటకు పైగా నాతో చాలా విషయాలు ఈ రోజు మాట్లాడింది. చనిపోతూ, చనిపోతూ నాతో చెప్పడం మరిచిన విషయాలన్నీ ఈరోజు చెప్పింది. ఇంకా వున్నాయట! మళ్ళీ వచ్చే ఆదివారం కలుస్తానని, అప్పుడు ఇంకా చెప్తానని వాగ్దానం చేసింది" అంటూ ఉల్లాసంగా చెప్పాడు. రోడ్రిగో ఇవన్నీ చెపుతూ ఉద్రేకంతో ఊగడం, కళ్ళను అటూ ఇటూ త్రిప్పుతూ పెద్దవి చేయడం, అతని కళ్ళు కన్నీళ్ళను జాలువార్చడం కోవూర్ గమనించాడు.

రోడ్రిగో చెప్పడం ముగించి కొన్ని క్షణాలు నిశ్శబ్దం వహించాడు. కాఫీ తీసుకున్నాక యథాస్థితికి వచ్చాడు.

'నీ భార్యతో ఎలా మాట్లాడగలిగా'వన్నాడు కోవూర్.

'నీకు తెలుసా! ప్రేమ్‌కుమార్ అనుభవం గల ఆత్మల సంభాషకుడు. అతడే మొదట నాకు ఇది నేర్పాడు. నా భార్యను రప్పించి నాతో మొదటగా అతడే మాట్లాడించాడు.' అన్నాడు రోడ్రిగో.

"మిస్టర్ రోడ్రిగో! నాకు ఈ వింత చూడాలని వుంది. ఈసారి నీ భార్యతో నీవు మాట్లాడేటప్పుడు నేనూ ఉంటాను"

"నో! మిస్టర్ కోవూర్! నా భార్యతో నేను అనేక రహస్యాలు మాట్లాడాలి. అవన్నీ మాట్లాడాక, నా భార్య అనుమతితో నీకా అవకాశం కల్పిస్తాను" అన్నాడు రోడ్రిగో.

కోవూర్, రోడ్రిగో మానసికస్థితిని కనిపెడుతూ నవ్వుకున్నాడు. ప్రేమ్‌కుమార్ చిరునామా తీసుకుని ఉత్తరం రాసాడు కోవూర్. తాను కలిసి మాట్లాడాలని అనుకుంటున్నానని అవకాశం కల్పించమని రాసాడు. తిరిగి జవాబు వచ్చింది. ఆ అవసరం లేదని, తానే నవంబర్ 22న కోవూర్ ఇంటికి వస్తున్నానని ప్రేమ్‌కుమార్ తెలియజేసాడు. అన్నట్టుగానే ఆరోజు కోవూర్ దగ్గరకు వచ్చాడు ప్రేమ్‌కుమార్. అల్లంతదూరంనుంచే....

"ఎంత ఆశ్చర్యం! వావ్! మీరు చాలా గొప్పవారు సార్!" అన్నాడు. కోవూర్ ఆశ్చర్యపోయాడు. పరిచయాలు కాకముందే తన గొప్పతనమెలా తెల్సిందో అర్థం కాలేదు.

"మిస్టర్ కోవూర్! మీలాంటి వ్యక్తులు ఎందరో వుండరు. దూరం నుంచి మిమ్మల్ని చూసాను. మీ తల చుట్టూ మీకు కన్పించని దేదీప్యమానమైన పరివేషం(దేవతల తలల వెనుక వుంటుందని చెప్పబడే గుండ్రటి వెలుగు-ఆరా) వుంది. అది నాకు కన్పించింది" అన్నాడు ప్రేమ్‌కుమార్.

"అలాంటి వేషాలు, పరివేషాలు నీలాంటి వారికే కనిపిస్తాయిలే" అంటూ నవ్వాడు కోవూర్.

"కోవూర్‌గారూ! మీ గురించి రోడ్రిగో చెప్పారు. ఆత్మలతో మీరు మాట్లాడాలను కుంటున్నారని, ఆత్మలకు సంబంధించి మీకెంతో జ్ఞానం వుందని - అవునా?" అన్నాడు.

కోవూర్ అవునన్నట్లు తలూపాడు. మరోప్రక్క ప్రేమ్‌కుమార్ ప్రవర్తనను, అతనిని చదువుతున్నాడు.

ఇద్దరి సంభాషణ చాలాసేపు కొనసాగింది. ఎన్నో విషయాలు తెలిశాయి. ప్రేమ్‌కుమార్ బాగా ఆస్తి గల కుటుంబంలో పుట్టారు. తల్లిదండ్రులు క్రైస్తవులు. జాఫ్నాలోని క్రైస్తవ మిషనరీ పాఠశాలలో చదివాడు. ఐరోపాలో క్రైస్తవ మిషనరీల ప్రభావానికి లోనయ్యాడు. అసలే చదువరీ, అందులో ధనికుడూ అవడం వల్ల సంఘంలో గౌరవం ఏర్పడింది. అన్ని రంగాల్లో 'పెద్దవారితో' స్నేహసంబంధాలు పెరిగాయి. బ్రతకడానికి ఏదో మోసం చేయాల్సిన అవసరం లేదు. యువకుడిగా ఉన్నప్పుడు క్రైస్తవ ఫాదరీ కావాలనుకున్నాడు. ఆ వృత్తిని తన సోదరుడు స్వీకరించడం వల్ల తాను మానుకున్నాడు.

ప్రేమ్‌కుమార్ మొదటి భార్య 1926లో చనిపోయింది. అప్పటికే వారిద్దరికీ ఒక కూతురు వుంది. ఆమె అంటే అతనికి మితిమీరిన ప్రేమ. పెద్దల బలవంతం వల్ల రెండో పెళ్ళి చేసుకున్నాడు. అయినా తొలి భార్య మీద ప్రేమ ఏ మాత్రం తగ్గలేదు. రెండో భార్య మీద ధ్యాస లేదు. రోడ్రిగో వలె ప్రేమ్‌కుమార్‌కి కూడా భార్య పోయిన దగ్గర్నుండీ, ఆమెతో మాట్లాడాలని ఉబలాటం ఏర్పడింది. ఆత్మల ఉనికి మీద విశ్వాసం వుండడం వల్ల తన భార్య ఆత్మను ప్రత్యక్షం చేసుకోవాలనే ఆసక్తి పెరిగింది. లండన్‌లో

సైకికల్ రీసెర్చ్ (ఆత్మల పరిశోధన) అనే సంస్థలో సభ్యుడై ఆ సంఘ పత్రికను రెగ్యులర్‌గా చదివేవాడు. ఓసారి లండన్ వెళ్ళినపుడు ఆత్మల్ని కూడా ఫోటో తీసే ఫోటోగ్రాఫర్లు ఉన్నారని విన్నాడు. ఎంతో శ్రమించి వారిని కలుసుకున్నాడు. తన భార్య, తన మామల ఫోటోలు కావాలన్నాడు. వాళ్ళ ఆకారాల గురించి వారికి వర్ణించి చెప్పాడు. ఫోటోగ్రాఫర్లు చాలా డబ్బు అడిగారు. అయినా ఇచ్చాడు. వాళ్ళు రెండ్రోజుల్లో తెచ్చి ఇచ్చారు. ఆ ఫోటోల్లో తన మామ, తన భార్యలను పోల్చుకోలేకపోయాడు ప్రేమ్‌కుమార్. ఆత్మలు అలాగే వుంటాయన్నారు ఫోటోగ్రాఫర్లు. చేసేదిలేక, వాటిని తెచ్చి తన పెట్టెలో దాచుకున్నాడు. అవకాశం వచ్చినపుడల్లా తీసి అందరికీ చూపిస్తాడు. అవి ఆత్మల నిజమైన ఫోటోలేనా? అని ఎవరైనా అడిగితే సందేహిస్తాడు అవుననటానికి.

మొదటగా 1934లో తన భార్యతో మాట్లాడానన్నాడు ప్రేమ్‌కుమార్. అది మొదలు ఇప్పటికి చాలాసార్లు మాట్లాడాడట.ముఖ్యమైన ఎన్నో విషయాలు చర్చించాడు. అయితే ఆత్మల నుండి వచ్చే జవాబుల్లో కొన్ని నిజం కానప్పటికీ, కొన్ని మాత్రం అచ్చమైన నిజాలేనంటాడు. తన మొదటి కూతురికి పెళ్ళి చేసేటప్పుడు భార్య ఆత్మతో సంప్రదించాడు. తనెప్పుడు కావాలంటే అప్పుడు తన భార్య ఆత్మను పిలిచి మాట్లాడగల శక్తిని సంపాదించానంటాడు ప్రేమ్‌కుమార్.

కోవూర్, ప్రేమ్‌కుమార్‌ని బాగా అర్థం చేసుకున్నాడు. అతని భార్యతో ఇప్పటికిప్పుడు మాట్లాడవలసిందిగా అభ్యర్థించాడు.

అందుకు ప్రశాంత ప్రదేశం కావాలన్నాడు ప్రేమ్‌కుమార్. అతన్ని తన లైబ్రరీలోకి నడిపించాడు కోవూర్. తన కుర్చీలో కూర్చోబెట్టాడు. కిటికీలు మూసివేసాడు. ప్రేమ్‌కుమార్ తన కెదురుగా వున్న గోడవైపుకి చూసాడు. ఎదురుగా గోడ మీద కోవూర్ తండ్రి నిలువెత్తు ఫోటో వ్రేలాడుతోంది. దానివైపే తదేకంగా చూసాడు. రెండు నిమిషాల్లో ధ్యానముద్ర వహించాడు.

“అదిగో! నా భార్య నాకిప్పుడు స్పష్టంగా కనబడుతోంది. అదుగో! అక్కడే ఆమె నిలబడి వుంది. నన్నే చూస్తోంది”అంటూ కోవూర్ తండ్రి ఫోటో వైపు చూపించాడు.

“గోడకు వేలాడే ఆ ఫోటోను చూస్తున్నారా?” అన్నాడు కోవూర్.

‘నో, నో మిస్టర్ కోవూర్! అక్కడ గోడ లేదు, ఫోటో లేదు, ఆకాశం వుంది. ఆ వినీల ఆకాశంలో.. తెల్లని మేఘాల మధ్య.. మరింత కాంతితో నా భార్య మాత్రమే వుంది.”

కోవూర్ ముందుకు నడిచాడు. ఫోటోపై చేతులుంచి – ‘ఈమేనా నీ భార్య!’ అని అడిగారు. ‘అవును, ఆమే! కానీ, నీవు తాకవద్దు. ప్రాణమున్న నీ చేతులతో తాకితే ఆమె అదృశ్యమవుతుంది’ అన్నాడు.

ఇపుడు ఏ ప్రశ్నలడిగినా తన భార్య జవాబులిస్తుందన్నాడు ప్రేమ్‌కుమార్. కోవూరనేక ప్రశ్నలడిగాడు. ఆ ధ్యానంలోనే ఆత్మలిచ్చిన జవాబులుగా ప్రేమ్‌కుమార్ వాటిని వివరించాడు. వారిద్దరి సంభాషణల సారాంశం ఇలా వుంది-

ప్రపంచంలోని మతాలన్నింటిలో క్రైస్తవమే నిజమైన మతమట! పునర్జన్మ గానీ, మరో అవతారం గానీఏదీ వుండదట. ఈ భూమ్మీద పుట్టకముందు, ఆత్మలకు ఏ జ్ఞానమూ లేదట. ఆత్మలక్కూడా పైన ఒక లోకం వుందట. అక్కడ కూడా నీరు, ఆహారం లభిస్తాయట. ఆత్మలు కూడా చిన్న చిన్న సమాజాలుగా విడిపోయి వుంటాయట. ఒక్కోదానికి ఒక నాయకుడుంటాడట. అతని అనుమతి లేకుండా ఏ పనీ చేయవట ఆత్మలు. బ్రతికివున్న తమ బంధువులతో మాట్లాడాలంటే వారి అనుమతి వుండాలట. ఆత్మలకు కూడా సెక్స్‌కోరికలు వుంటాయట. ప్రేమ్‌కుమార్ చనిపోయాక, అతన్నే భర్తగా పొంది సుఖించాలని అతని భార్య ఎదురు చూస్తోందట.

ఆత్మలు తెల్లటి బట్టలు ధరిస్తాయట. ఈ భూమి మీదున్న శరీర ఆకారమే ఆత్మలకుంటుందట. మనుషులకు తప్ప, ఇతర చిన్న చిన్న జీవులకి ఆత్మలుండవట. ఇతర గ్రహాల్లో కూడా మనుషులున్నారట. తమ లోకంలో కొంత కాలమున్నాక, ఇంకా తమకు పైనున్న లోకానికి వెళతాయట ఆత్మలు. చివరికి దేవునిలో లీనమవుతాయట. ఆత్మల లోకంలో విస్కీ, సోడాలూ కూడా వున్నాయట. ఆత్మలన్నీ ఇంగ్లీష్‌లోనే మాట్లాడుతాయట.

ఈ సుదీర్ఘ ప్రశ్నోత్తరాలయ్యాక ప్రేమ్‌కుమార్ తిరిగి మామూలు స్థితికొచ్చాడు. ఇద్దరూ లైబ్రరీ గదిలోంచి బయటపడి డ్రాయింగ్ రూంలోకి వచ్చి కూర్చున్నారు. అక్కడ మళ్ళీ ఇరువురి మధ్య మాటలు సాగాయి.

ఆత్మను చూడటానికి ముందు, చూసేటప్పుడు తిరిగి మామూలు స్థితికి వచ్చేటప్పుడు పొందిన అనుభూతులను వివరించమన్నాడు కోవూర్. ప్రేమ్‌కుమార్ వివరించాడు. తన ఆలోచనను చూపును తన భార్య ఆత్మకోసమే కేంద్రీకరించాననీ, కొంతసేపటికి అనేక కాంతులతో అనేక బొమ్మలు కదలాడసాగాయని, తన భార్య ఆత్మ తనతో మాట్లాడే అవసరం అంతగా లేదనడంతో ఇతర ఆత్మలతో కూడా మాట్లాడానని చెప్పాడు. అలాగే సంభాషణ పూర్తయ్యాక మానవలోకంలో వచ్చేటప్పుడు తనకేదో వెలితిగాను, మత్తు, దప్పిక అనిపించాయన్నాడు ప్రేమ్‌కుమార్.

తనకవసరమైనది ప్రేమ్‌కుమార్ ద్వారా తెలుసుకున్నాడు కోవూర్. అతనితో గడిపే అవకాశం కలిగినందుకు కృతజ్ఞతలు చెప్పి పంపించాడు.

***

ప్రేమ్‌కుమార్ చెప్పిన విషయాలన్నింటినీ క్రోడీకరించి చూసాడు కోవూర్. పరస్పర విరుద్ధాంశాలతో పాటు, ప్రేమ్‌కుమార్ మానసిక స్థితిని అంచనా వేశాడు. అతని విశ్లేషణ ఇలా సాగింది.

ఆధునిక మనస్తత్వశాస్త్రపు వెలుగులో ప్రేమ్‌కుమార్‌ని అంచనావేస్తే అతడొక మానసిక రోగి. ఇలాంటివారి అనుభవాలలో వాస్తవం వుండదు. రోడ్రిగోగాని, ప్రేమ్‌కుమార్ గాని తమ అత్యంత ప్రియమైన భార్యలతో తమ అనుభవాలను ఊహించుకొని బాధపడుతున్నారు. ఆ వయసులో వారికి కల్గిన భార్యావియోగం భరింపరానిదయింది. ఆత్మల గురించి తమకున్న నమ్మకాలు వారిని ఊరటపరిచాయి. అందుకే వాటిని గురించి చెప్పే పుస్తకాలు చదవటం, వాటిలోని విషయాలను చదవటం జరిగింది. ఆత్మలతో ప్రత్యక్షంగా మాట్లాడవచ్చని నమ్మారు. లండన్‌లోని ఆత్మల పరిశోధనా సంస్థలో ఒకప్పుడున్న సభ్యులు కూడా ఇలాగే భావించిన మాట నిజమే కానీ, ఈనాడు ఉన్న సభ్యులు ఆంటోని ఫ్లూ కాట్నర్, సైమన్స్, ఎడ్వర్డ్‌రాక్స్. హెన్సెల్, మెక్‌కాల్, స్పెన్సర్ బ్రౌన్ తదితరులు ఆత్మలున్నాయనటం అబద్ధమని, ఒక భ్రమాపూరిత మానసికస్థితిలో వాటిని చూశామని కొందరు నమ్మటం జరుగుతోందని తమ రచనల్లో పేర్కొన్నారు. వీరి రచనలను ప్రేమ్‌కుమార్ చదవలేదు. చదివివుంటే ఇలా తన సమయాన్ని వృథా చేయడు.

ఆత్మల విషయాల్లోనే రోడ్రిగో గానీ, ప్రేమ్‌కుమార్‌గానీ మానసిక రోగులు. మిగతా విషయాల్లో వీరు విజ్ఞత గలవారే. ప్రేమ్‌కుమార్ మాత్రం అనేక తీవ్రభ్రాంతుల్లో మునిగివున్నాడు. మానసిక వైకల్యం ఇతనిలో బాగా ముదిరింది. అనేక కాంతుల్ని, బొమ్మల్ని చూశాననటం దానివల్లే. కోవూర్ తండ్రి ఫోటోగాని, గోడగాని లేదని ఆకాశం మాత్రమే వుందనటం ఈ విపరీత మనోభ్రాంతి వల్లనే.

ప్రేమ్‌కుమార్ భ్రాంతిలో వున్నప్పుడు చెప్పిన జవాబులన్నీ ఆత్మలు చెప్పినవి కావు. అతనిలోని స్వంత అభిప్రాయాలే. క్రైస్తవ ప్రభావం ఎక్కువగా వుండడం వల్ల అతనిలో ఏర్పడిన భావముద్రలే అవన్నీ. ఆత్మలకు ఆహారం, నీరు వుంటాయనే అంశం క్రైస్తవ సువార్తల్లో వుంది. అదే నిజమని అంగీకరిస్తే, ఆత్మలక్కూడా జీవం వుంటుందని అంగీకరించాలి. జీవులకుండే మల మూత్రవిసర్జనాది కృత్యాలు అవీ చేస్తాయని ఒప్పుకోవాలి. అలాగే, నిజంగా ఆత్మల లోకంలో విస్కీగానీ, సోడాగానీ వుంటాయని వాదిస్తే, అక్కడ విస్కీ పరిశ్రమ, సోడా తయారీ భారీ ఎత్తున అవుతోందని ఒప్పుకోవాలి. అంటే అక్కడ కార్మికుల, యజమానుల గొడవలు శాంతిభద్రతల సమస్యలు రాకమానవు. ఓ తరహా ఆర్థిక వ్యవస్థ ఆత్మలక్కూడా వుందనుకోవాలి. దాన్ని బట్టి రాజకీయాలు, పార్టీలు తప్పక వుంటాయి. ప్రాథమిక జీవులకు ఆత్మలుండవని ప్రేమ్‌కుమార్ అనడానికి అతని క్రైస్తవ ప్రభావమే కారణం. అతడే హిందువైతే "భూమ్మీద 84లక్షల రకాల జీవజాతులున్నాయనీ అవన్నీ మరణానంతరం పైలోకంలో ఆత్మలవుతాయనే" చెప్తాడు. మరణానంతరం తన

భార్య తనతో సుఖించాలని చూస్తోందన్నాడు. చనిపోయాక కూడా తన భార్యతో సెక్స్ కోరికలు తీర్చుకోవాలనే అతని భావనలు అతనిలా చెప్పటానికి కారణం. అయితే ఇక్కడో నిజాన్ని ఇతడు గుర్తించలేదు. అతను చనిపోయాక, తన మొదటి భార్య దగ్గరకెళ్ళినా, కొన్నాళ్ళకు అతని రెండో భార్య అక్కడ కూడా తయారవుతుంది! అప్పుడు మళ్ళీ ఆయన ఇద్దరు పెళ్ళాల ముద్దుల మొగుడు కాక తప్పదు.

ఇక ఆత్మల ఫోటోల విషయం. ఇంగ్లాండులో అవకాశం వుండాలే కాని, ఏ రకంగానైనా మోసాలు చేయగల వుద్దండులున్నారు. ఎందరో ఫోటోగ్రాఫర్లు ఆత్మల ఫోటోలు తీస్తామని చెప్పడం నిజమే. ఇలా అమాయకులెందరో వారి మాయమాటల్లో పడి ఎంతో నష్టపోతున్నారు. ఓసారి ఫ్రెడ్ బార్లో, మేజర్ రాప్లింగ్ రోజ్ అనే జంట రచయితలు 'ఆత్మల ఫోటోగ్రఫీ'పై విచారణ నివేదిక ఒకటి తయారుచేసి ప్రపంచానికి వెల్లడించారు. ఆత్మల పేరుతో ఎంతమంది ఫోటోగ్రాఫర్లు ఏరకంగా ప్రజలను మోసం చేస్తున్నారో సాక్ష్యాధారాలతో వెల్లడించారు. ఆ ఫోటోగ్రాఫర్ల చేతిలో పడి ప్రేమ్‌కుమార్ కూడా మోసపోయాడు. తన మామ, తన భార్యల ఆత్మల ఫోటోలు నిజం కావని అతడూ అంగీకరిస్తున్నాడు.

ఆత్మలు కూడా మానవాకృతిలోనే వున్నాయని చెప్పటానికి కూడా క్రైస్తవ ప్రభావమే కారణం. కుళ్ళిపోయి, మన్నులో కలసిపోయిన శరీరాలు, లేదా మంటల్లో తగలబడి బూడిదైన మానవాకారాలు తిరిగి ఆత్మల లోకంలో అదే ఆకారాలను ధరిస్తాయా? ఇంతకన్నా మోసపూరిత కల్పన ఏమైనా వుందా?



# ఇదో 'ప్రేమ'కథ

'ప్రేమ' పదిహేనేళ్ళకి ఎస్.ఎస్.సి. ప్యాసయింది. పదిమందీ మెచ్చేవిధంగా ర్యాంకులు కూడా తెచ్చుకుంది. అసాధారణ ప్రజ్ఞగల ప్రేమ అంటే పాఠశాల ప్రధానోపాధ్యాయునికి ఎంతో ప్రేమ. కాలేజీలో చేరి, చదువులో రాణించాలనీ, కన్నవాళ్ళకీ, పాఠశాలకూ కూడా పేరు, ప్రఖ్యాతలు తేవాలని కలలు కనేది.

ప్రేమ తండ్రి జస్టిన్ పెరేరా పేరుమోసిన ఆయుర్వేద డాక్టర్. తన కూతుర్ని కాలేజీలో చదివించాలని మొదట్లో ఆయన అనుకోలేదు. కానీ పాఠశాల హెడ్మాస్టర్ వ్రాసిన లేఖ చదివాక ప్రేమను చదివించాలనే నిర్ణయానికి వచ్చాడు. హెడ్మాస్టర్ అంతటివాడు తన కూతుర్ని అంతగా పొగుడుతూ వ్రాసినందుకు గర్వంగా వుందతనికి.

పెరేరా భార్య చనిపోయిన దగ్గర్నుంచీ కూతురు ప్రేమనీ, కొడుకు ప్రేమకుమార్‌నీ అప్యాయంగా పెంచుతున్నాడు. ఇద్దరూ ఒకే స్కూల్లో చదువుతున్నారు. ప్రేమంటే టీచర్లకీ, విద్యార్థులకీ అంత ప్రేమ వుండటానికి కారణం తెలివితేటలతో పాటు ఆమెలో ఉన్న ఆకర్షణ కూడా.

ప్రేమ కాలేజీలో చేరిన అతి కొద్దికాలంలోనే అందర్నీ ఆకట్టుకొంది. అదే కాలేజీలో అప్పటికే సిరిసాల్గడో టీచరుగా పనిచేస్తున్నాడు. అతడూ ఆ కాలేజీలో చేరి ఎంతో కాలం కాలేదు. ప్రేమ చదువుని పరిశీలించి గణితంలో, భౌతికశాస్త్రంలో ప్రత్యేక శిక్షణ వుండాలని గుర్తించాడు. ప్రిన్సిపాల్ అనుమతితో ప్రతి బుధ, శుక్రవారాల్లో తానే స్వయంగా 'శిక్షణ' ఇవ్వసాగాడు. రోజులు గడిచేకొద్దీ గణితంలో ఆమె స్థాయి గణనీయంగా పెరిగింది. అలాగే యువకుడు, అందగాడు, ఉత్తముడూ అయిన సిరిసాల్గాడోపై ఇష్టం కూడా పెరిగింది ప్రేమకి.

రహస్యం ఏదీ ఎల్లకాలం దాగదు. ప్రేమ కొన్న కొత్త పుస్తకాలన్నీ సిరిసాల్గాడో సంతకాలతో కన్పించేవి. ఇది గమనించిన తోటి విద్యార్థులు ఒకటికి రెండు కల్పించి

పుకార్లు పుట్టించారు. అవి ప్రిన్సిపాల్ చెవులదాకా వెళ్ళాయి. ఫలితంగా సిరసాల్గడోని పిలిచి ప్రేమకు ఇచ్చే ప్రత్యేక శిక్షణ మానమన్నాడు.



ఈ చర్య సాల్గడోకి ఎంతో బాధ కల్గించింది. ప్రేమను దగ్గరగా చూసే అవకాశం ఇక లేదు గదా అని కుమిలి పోయాడు. ఆలోచించాక మరో ఉపాయం తోచింది. నేరుగా ఆమె తండ్రి దగ్గరకెళ్ళాడు. ప్రేమకు ఉండాల్సిన అదనపు శిక్షణ అవసరాన్ని గూర్చి చెప్పాడు. కాలేజీ అయ్యాక ఇంటి వద్ద శిక్షణ కొనసాగించడానికి పెరేరా అంగీకరించాడు.

ఓరోజు ప్రేమ కాలేజీలో వుండగా, సాల్గడో జెస్టిన్ పెరేరాను కలవటానికి ఇంటికివెళ్ళాడు. ప్రేమ పట్ల తనకున్న ప్రేమను అతనిముందు వెల్లడించాడు. తాను ప్రేమను పెళ్ళాడే ఉద్దేశంతో వున్నట్లు చెప్పాడు. జెస్టిన్ పెరేరాకు కోపం వచ్చింది. సాల్గడో కోరికను అంగీకరించలేదు. చిన్నప్పుడే ప్రేమను తన మేనల్లుడు 'జయతిస్సా'కు ఇవ్వడానికి నిర్ణయించుకోవడం గుర్తుకొచ్చింది. టీచరు స్థాయిలో వున్న సాల్గడో ఇలా శిష్యురాల్ని గూర్చి ఆలోచించడం పెరేరాకి కోపకారణమయినా పైకి మర్యాదగానే సాల్గడో నిర్ణయాన్ని తిరస్కరించాడు. ఊహించని వ్యతిరేకత రావటంతో సాల్గడో కళ్ళు చెమ్మగిల్లాయి.

సాల్గడో ముఖాన్ని బట్టి పెరేరాకు అతని బాధ అర్థమయింది. జాలిపడ్డాడు. ఈ విషయాన్ని మళ్ళీ ఆలోచిస్తాననీ, అప్పటిదాక ప్రేమకు అదనంగా ఇచ్చే శిక్షణ అవసరం లేదని అన్నాడు.

సాయంకాలం ప్రేమ కాలేజీనుండి ఇంటికి వచ్చింది. పెరేరా కూతుర్ని దగ్గరకు పిల్చాడు. సాల్గడో గురించి ఆమె అభిప్రాయం అడిగాడు. సాల్గడో ఒక మంచి టీచరని, కాలేజీలో అందరూ అతనంటే ఎంతో ఇష్టపడతారనీ, పాఠాలు బాగా చెప్తాడనీ, మర్యాద మన్నన తెలిసినవాడనీ... ఇలా చెప్పుకుపోతోంది ప్రేమ. ప్రేమ ముఖాన్ని బట్టే ఆమె ఇష్టాన్ని కూడా గ్రహించాడు పెరేరా.

మర్నాటి నుండి సాల్గడో గురించి, అతని కుటుంబ స్థితిగతుల గురించి ఆరా తీశాడు. తన మేనల్లుని కంటే యోగ్యుడని తోచింది.

మూడురోజుల తర్వాత సాల్గడోకి ఉత్తరం రాశాడు. ప్రేమ తన అర్థాంగి కాబోతున్నందుకు ఎగిరి గంతేశాడు సాల్గడో. తోటి టీచర్లందరికీ నోరు తీపి చేశాడు.

1955 మార్చి 18న సాల్గడో, ప్రేమల వివాహం చాలా వైభవంగా జరిగింది. నగరంలో పేరున్న ఆయుర్వేద డాక్టర్ కనుక శ్రీలంక రాజకీయరంగం కూడా కదిలివచ్చింది. ఓ కాబినెట్ మంత్రి, ఓ సీనియర్ సెనెటర్‌తో పాటు అనేక మంది రాజకీయ నాయకులు ఆ పెళ్ళికి హాజరయ్యారు.

పెళ్ళయ్యాక సాల్గడో వేరుగా కాపురం పెట్టడానికి నిశ్చయించుకున్నాడు. పెరేరా కూడా కాదనలేదు. కాలేజీ దగ్గర్లోనే వున్న చిన్న బంగళా అద్దెకు తీసుకున్నాడు. ప్రేమ చదువును ఆపేసింది. టైమంతా తన ఇంటిని చక్కదిద్దటానికే వినియోగిస్తోంది. ప్రేమ కోరినవన్నీ క్షణాల్లో సిద్ధమవుతున్నాయి. వంటసామాన్లు, ఇంటి సామాన్లు అన్నీ చక్కగా అమరాయి. ప్రేమించిన 'ప్రేమ' లభించింది సాల్గడోకి. ప్రాణంలా చూసుకునే భర్త 'ప్రేమ'కి లభించాడు. ఇద్దరికీ ఈడూజోడూ కుదిరాయని, ముచ్చటగా వున్నారని చూసిన వాళ్ళంతా చెప్పుకొన్నారు. ప్రేమకి ఇది ఎంతో సంతోషం కల్గించింది. కానీ ప్రేమకు కావాల్సింది ఒక్కటిమాత్రం సాల్గడో ఇవ్వలేకపోయాడు. ఏమిటి? సంసారసుఖం.

పెరేరాకి మనవణ్ణి ఎత్తుకోవాలనే కోరిక బాగా వుంది. ప్రేమ పెళ్లయిన దగ్గర్నుంచీ ఆ శుభవార్త ఎప్పుడు వింటానా అని మనసులో తొందరపడేవాడు. నెలలు గడిచి, సంవత్సరాలు నిండుతున్నాయి. కానీ, కూతురు మాత్రం నెలతప్పటం లేదు. మూడేళ్ళు గడిచినా ప్రేమ కడుపు పండలేదు.

పెరేరాకు ఆశాభంగం ముదిరి అనుమానంగా మారింది. ఉండబట్టలేక తన చాదస్తం కొద్దీ ఓ జ్యోతిష్యుడ్ని కలిశాడు. తన కూతురికి సంతానయోగం వుందా? అని అడిగాడు. ఆ జ్యోతిష్యుడు గ్రహగతులను ఓ అరగంట లెక్కించి పంచాంగాన్ని అటు తిప్పి ఇటు తిప్పి చివరికి 1959 జులైలోగా ఆడపిల్ల పుడుతుందని చెప్పాడు. 1960 వచ్చింది. అయినా ప్రేమ తల్లికాలేదు.

పెరేరా మనసు ఊరుకోలేదు. ఎవరో ఇచ్చిన సలహాను బట్టి ఓ మంత్రగత్తెను సంప్రదించాడు. ఆమె అంజనం వేసి చూసింది. పెరేరా ఆత్మబంధువొకడు పెరేరా తోటలో మంత్రించిన వస్తువొకటి పూడ్చిపెట్టాడని, ఆ దుష్టశక్తి వల్ల పెరేరా వంశం నాశనం అవుతుందని, అదే ప్రేమ సంతానహీనతకు కారణమని చెప్పింది.

పెరేరాకు నమ్మకం కుదిరింది. డబ్బు ఖర్చుకు వెనుకాడదల్చుకోలేదు. వెంటనే ఆ మంత్రగత్తెను తీసుకువచ్చి దుష్టశక్తిని పారద్రోలవలసిందిగా ప్రార్థించాడు.

మంత్రగత్తె ఇద్దరు మనుషుల్ని తోడు తీసుకుని తోటలో ఓచోట గొయ్యి త్రవ్వింది. చిలుంపట్టిన ఓ రాగిభరిణె గుంటలోంచి బయటకు తీసినట్లు అందరికీ చూపింది. అదే

మంత్రించిన వస్తువనీ, దాని ప్రభావం ఇకమీద పూర్తిగా లేకుండా పోవడానికి పూజలు చేయాలని చెప్పింది. పెరేరా అన్ని ఏర్పాట్లు చేయించాడు. ఆ పూజలో అందరిముందే మంత్రగత్తె ఆ రాగిభరిణెను విప్పి చూపింది. మనుషుల వెంట్రుకలు, ఎముకల ముక్కలు, ఓ చిన్న రాగినాణెం మొదలైనవాటిని బయటికి తీసింది. వాటన్నిటినీ మంటలో వేసి దోషం తొలిగిందని, దుష్టశక్తి నశించిందని చెప్పింది. ఏడాది తిరిగేలోగా ప్రేమ మగబిడ్డను ఎత్తుకొంటుందని నమ్మించింది. కమ్మగా కబుర్లు చెప్పి తన ఫీజుకొంద రూ.350/- పుచ్చుకొని చక్కా వెళ్ళిపోయింది.

ఓ కేలండర్ కాలం గడిచింది. అయినా ప్రేమకు కడుపుకాయలేదు. 1961లో ప్రేమ చిన్నమ్మ చూట్టానికి ప్రేమ ఇంటికి వచ్చింది. మాటల సందర్భంలో గైనకాలజిస్టును సంప్రదించమని కోరింది. అందుకు ప్రేమ ససేమిరా ఇష్టపడలేదు. చిన్నమ్మ కారణమడిగింది. "భర్త సహకారం లేకుంటే ఏ డాక్టరయినా ఏం చేయగలడు పిన్నీ?" అంది ప్రేమ. చిన్నమ్మ అవాక్కయింది. ఆమె సంసారజీవితాన్ని గూర్చి ప్రశ్నించింది. ఆరేళ్ళ జీవితం గడిచినా సాల్గడో ప్రేమల సంసారం సరిగా లేదని తేలింది.

ఈ వార్త మొదట పెరేరాకి తెలిసింది. మొదట్లో నమ్మలేకపోయాడు. ప్రేమించి చేసుకున్న పెళ్ళి. పరస్పర ఇష్టంతో తానీ పెళ్ళిచేశాడు. అయినా ఇలా ఎందుకు జరుగుతోంది? అతనికి అర్థం కాలేదు. ఏం చేయాలో అంతుపట్టలేదు. స్నేహితుల్ని సంప్రదించాడు. వాళ్ళలో ఒకరు 'పాశ్యాల' అనే, పేరుపొందిన ఒక సన్యాసి గురించి చెప్పాడు. అతడొక తైలాన్ని ఇస్తాడని దానితో సమస్య పరిష్కారమవుతుందని నమ్మకంతో చెప్పాడు. పెరేరా పాశ్యాలను వెతుక్కొంటే వెళ్ళాడు. కలిసి తాను వచ్చిన సంగతి వివరించాడు. పాశ్యాల ఒక సీసాలో అప్పటికే తయారు చేసి భద్రపరిచిన తైలాన్ని తెచ్చి చూపించాడు. రూ.50 అవుతుందన్నాడు. మారుమాటాడకుండా చెల్లించాడు పెరేరా.

ఆ సన్యాసి ఓ చిన్న లోహపు భరిణెలో కొన్ని చుక్కల తైలాన్ని వేసి ఇచ్చాడు. తాయెత్తులా మూసివేసి ఇచ్చాడు. దాన్ని కూతురి మెడలో కట్టించమన్నాడు. అయితే ఒక షరతు పెట్టాడు. అది కట్టుకుని ఉన్నంత కాలం ఏ స్త్రీ కూడా పరపురుషుడ్ని తాకరాదన్నాడు. ఆ 'భరిణె' ఎంతటి నపుంసకుడినయినా కామోద్రిక్తుని చేస్తుందని, భార్యను విడిచి క్షణం కూడా వుండలేని విధంగా భర్తను వశీకరింపచేస్తుందని చెప్పాడు పాశ్యాల.

తండ్రి చెప్పిన విధంగా ప్రేమ ఆ 'భరిణె'ను మెడలో ధరించింది. మరో తాయెత్తును కూడా చేతికి ధరించింది. అయినా సాల్గడో పరిస్థితిలో మార్పులేదు.

ప్రేమ చిన్నమ్మ మళ్ళీ వచ్చింది. పరిస్థితి ఎలా వుందని అడిగింది. ఏమీ మార్పులేదన్నది ప్రేమ. ఈసారి మరో సంచలనమైన వార్త చెప్పింది. తమ పెళ్ళి జరిగి ఏడేళ్ళయినా తానింకా కన్నెగానే వున్నదట! పెరేరా మానసికస్థితి ఆందోళనకరంగా

మారింది. తన కూతురి జీవితం అడవిగాచిన వెన్నెల అయిందే అని కృంగిపోయాడు. సాల్గడోకిచ్చి తన కూతురి జీవితాన్ని తానే నాశనం చేశానేమోనని బాధపడసాగాడు. ఓరోజు అతని దగ్గరకి ఓ స్నేహితుడు వచ్చాడు. పెరేరా తన దిగులంతా వెళ్ళగక్కాడు. అతగాడంతా విని మంత్రాల వల్ల తంత్రాల వల్ల అది పరిష్కారం కాదని కోవూర్ ఒక్కరే దీన్ని పరిష్కరించగలరని సలహా ఇచ్చాడు.

అది 1962 ఫిబ్రవరి నెల, కోవూర్ ఏడాదిపాటు జరిగిన తన ఐరోపా పర్యటనను ముగించుకుని కొద్దిరోజుల క్రితమే శ్రీలంక చేరుకున్నాడు.

స్నేహితుని సలహా మేరకు పెరేరా ఒకరోజు కోవూర్‌ని కలిశాడు. తన గోడంతా చెప్పుకుని మిక్కిలి బాధపడ్డాడు. అతని కథ విన్నాక కోవూర్‌కి కూడా జాలేసింది. తానీ సమస్యని పరిష్కరిస్తానని పెరేరాకి హామీ ఇచ్చి పంపించాడు.

వెంటనే వచ్చి తనని కలవవలసిందిగా సిరి సాల్గడోకి ఉత్తరం రాశాడు కోవూర్. 1962 ఫిబ్రవరి 27న సాల్గడో ఇంటికి వచ్చాడు. అతనితో సుదీర్ఘంగా ఇంటర్వ్యూ చేశాడు కోవూర్. అతని గత చరిత్ర అంతా చాలా విచిత్రంగా అన్పించింది.

***

కాండీలో నివసించే సాల్గడో దంపతుల ఏకైక కుమారుడు సిరి సాల్గడో. తండ్రి హెన్రీ ప్రముఖ న్యాయవాది. సిరి సాల్గడో పుట్టిన రెండేళ్ళకే 1932లోనే అతను మరణించాడు. తనకత్యంత ప్రియమైన భర్తను పోగొట్టుకున్న శ్రీమతి హెన్రీ 'సిరి'ని చూసి తన దు:ఖాన్ని దిగమింగుకొనేది. కొడుకుమీద ఎనలేని ప్రేమతో గారాబంగా చూసుకొనేది. ఇంటి పనివాళ్ళ నుంచి, స్నేహితులనుంచి దూరంగా వుంచి, అన్నీ తానే అయి కొడుకుని పెంచసాగింది. 6వ తరగతి వరకు కొడుకుతో కలసి తానూ స్కూలుకి వెళ్ళేది. సాయంత్రం బడి వదిలాక కొడుకు తరగతి గదిలో నుండి బయటకు వచ్చేంత వరకూ గేటు బయటనే కాలక్షేపం చేసేది. కొడుకెదిగినా తానే స్వయంగా అన్నం కలిపి తినిపించేది. అతడు యూనివర్శిటీ డిగ్రీ చదువుతున్నా రాత్రివేళ ఇంటికి వచ్చి తల్లితోనే నిద్రించేవాడు. హాస్టల్‌లో తప్పనిసరిగా వుండాల్సివచ్చినపుడు తల్లికి దూరమవడం వల్ల ఎన్నో రాత్రుళ్ళు నిద్రలేకుండానే గడిపేవాడు. సెలవులకి ఇంటికి వచ్చినపుడు తల్లి కొంగువదలకుండా వెంటనుండేవాడు. తల్లి కూడా తన కొడుకు వయసుతో సంబంధం లేకుండా అతనితోనే పండుకొనేది. ఇలా వారిద్దరి మధ్య ఒకర్ని విడిచి మరొకరు వుండలేనంత ప్రేమానుబంధాలు పెనవేసుకున్నాయి.

డిగ్రీ పూర్తయ్యాక ఉద్యోగప్రయత్నం చేస్తే తల్లి దూరమవుతుందని సాల్గడో చాలా చింతించాడు. అందుకే ఉద్యోగం వద్దనుకొన్నాడు. బంధువుల ప్రయత్నాల వల్ల ఆ వూళ్ళోనే టీచర్ ఉద్యోగం దొరికింది. ప్రతినెలా జీతం తల్లిచేతిలో పెట్టేవాడు.

1953లో తల్లి గుండెపోటుతో మరణించింది. తల్లిలేని బ్రతుకు సిరిసాల్గడోకి భరింపరానిదయింది. జీవితం మీద విరక్తి పుట్టింది. అనేకసార్లు ఆత్మాహుతికి ప్రయత్నించాడు. కానీ విఫలుడయ్యాడు.

సాల్గడో పరిస్థితిని గమనించిన స్కూల్ ప్రిన్సిపాల్‌కి జాలేసింది. స్థలం మారితే మనసు మారవచ్చుననుకొన్నాడు. అధికారులతో సంప్రదించి అక్కడ నుండి కాలేజీ టీచర్‌గా ప్రస్తుతమున్న చోటికి బదిలీ చేయించాడు. కాలేజీలో అడుగుపెట్టగానే ప్రిన్సిపాల్ అతణ్ణి యూనివర్శిటీ ప్రవేశపరీక్షలకు తయారయ్యే విద్యార్థుల తరగతికి టీచర్‌గా నియమించాడు.

కాలేజీలో సాల్గడో జీవితం మళ్ళీ చిగురించింది. మానసికశాంతితో ఉల్లాసంగా వున్నాడు. వెనుకటి నిరాశ, నిస్పృహలు తొలిగిపోయాయి. అంతదాక అంతర్ముఖుడై లోలోన కుమిలిపోయేవాడు. ఇప్పుడు అందరితో హుషారుగా జీవితాన్ని గడుపుతున్నాడు. అతనిలో వచ్చిన ఈ అసాధారణ మార్పుకి కారణం 'ప్రేమ'.

ప్రేమ అతని క్లాసులో చదివే విద్యార్థిని. ఆమె ముఖం చూడగానే తన తల్లి గుర్తుకు వచ్చేది సాల్గడోకి. ఎప్పుడూ ఆమెనే చూడాలనుకొనేవాడు. అందుకే ఎక్కువగా తనే ఆ క్లాసుకి వెళ్ళేవాడు. ప్రత్యేక శిక్షణ ఇవ్వడానికి కారణం ఆమెతో ఎక్కువ కాలం గడపవచ్చునని, తన తల్లితో గడిపిన విధంగా గడపవచ్చునని తలచాడు. జీవించటంలో, నిద్రించటంలో తన తల్లితో వున్న అనుభూతిని పొందగోరాడు.

భార్యపై తల్లి భావనలుండటం వల్లనే ప్రేమనింత వరకు మోహంతో తాకలేదు. ప్రేమంటే అతనికెంతో ఇష్టం. అది కామపూరితం కాదు. తల్లి పట్ల వుండే అనురాగం మాత్రమే.

***

రెండ్రోజులు గడిచాయి. పెరేరా తన కూతురితో కోవూర్ ఇంటికి వచ్చాడు . ఆ సమయంలో సిరిసాల్గడో కాలేజీలో వున్నాడు.

కోవూర్, పెరేరాతో ఏకాంతంగా మాట్లాడాడు. ప్రేమ సంసారజీవితాన్ని గూర్చి అతని ద్వారా కొన్ని విషయాలు తెలుసుకున్నాడు.

తర్వాత ప్రేమను కూడా పిలిపించాడు. తండ్రీకూతుళ్ళను ఎదురుగా వుంచిప్రేమను ఇంటర్వ్యూ చేశాడు. నిర్మొహమాటంగా అన్నీ చెప్పమని ప్రేమకు సూచించాడు. ఆమె అనేక నిజాల్ని వెల్లడించింది.

ప్రేమకు సాల్గడో అంటే చాలా ఇష్టం. అతనికీ ప్రేమంటే ఎంతో ఇష్టం. అమెనడక్కుండా ఏదీ చేయడు. తన జీతమంతా తెచ్చి ఆమె చేతుల్లో పెడతాడు. తన ఖర్చులను చెప్పి ఆమెనడిగి డబ్బు తీసుకుంటాడు. వాళ్ళిద్దరూ ఒకే మంచం మీద

పడుకొంటారు. కానీ తమ తమ కోర్కెలను ఎవ్వరూ వ్యక్తం చేయరు. సాల్గడో ఆమెను 'అమ్మా' అని పిలుస్తాడు. తల్లి కావాలనే కోర్కె ఆమెలో బలంగా వుంది. కాని తన భర్త వల్ల ఆ కోరిక తీరదనీ తెలుసు. అతన్ని వదిలి వేరే నిజమైన సంసారసుఖాన్నిచ్చే భర్తను పొందాలనే ఆలోచన ఆమెకెప్పుడూ రాలేదు. కలల్లో మాత్రమే తన భర్తతో సంసారసౌఖ్యాన్ని పొంది తృప్తి పడుతోంది.

ఇవన్నీ వివరిస్తూ ప్రేమ కంటతడిపెట్టుకుంది. కోవూర్‌కి ఆమె జీవితం పట్ల సానుభూతి పెరిగింది. ప్రేమను చూస్తూ ఇలా అన్నాడు.

"అమ్మాయ్! నేను చెప్పే విషయాలన్నీ నీ జీవితాన్ని చక్కదిద్దాలనే ఉద్దేశంతోనే చెబుతున్నాను. సెక్స్ అనేది ప్రతి జీవికి అవసరమైన క్రియ. అది కేవలం వ్యక్తిగత ఆనందానికే పరిమితం కాదు. సామాజిక అవసరం కూడాను. అన్నం తినడం ద్వారా ఆకలిని తగ్గించినట్లు, నీరు త్రాగడం వల్ల దప్పికను తీర్చుకున్నట్లు, పరస్పర కలయిక ద్వారా స్త్రీపురుషులు తమ మోహాన్ని తీర్చుకొంటారు. అన్ని పనుల్లా కాకుండా సెక్స్ కోరికను తీర్చుకోవడానికి కొన్ని సామాజిక కట్టుబాట్లు ఏర్పర్చబడ్డాయి. అవి చాలా అవసరం కూడా. ఈ కట్టుబాట్లు స్థలాన్ని బట్టి, కాలాన్ని బట్టి, ప్రాంతాన్ని బట్టి మారుతుంటాయి. వీటికి, మతానికి ఏ సంబంధమూ లేదు. జంతువులకైతే ఈ కట్టుబాటు, నీతినియమాలు వుండవు. కానీ మనం నివసించే ఈ సమాజంలో పెళ్ళి ద్వారానే మన జీవితభాగస్వాముల్ని ఎన్నుకొని, సెక్స్ కోర్కెలు తీర్చుకోవడం మనవిధి. ఈ విధిలో స్త్రీపురుషులకు సమానహక్కులున్నాయి.

ఇక నీ విషయానికొస్తే నీ పట్ల నీ భర్తకున్న ఆకర్షణ విరుద్ధమైన అంశం. భార్యను తల్లిలా భావించే మానసికరోగంతో అతడు పీడించబడుతున్నాడు. ఇదంతా అతని తల్లి అజ్ఞానం వల్ల ఏర్పడింది. కొడుకు పట్ల ఆమె చూపిన అపరిమితమైన, మూర్ఖమైన ప్రేమానురాగాలు ఎటువైపు దారితీస్తాయో ఆమె గ్రహించలేదు. అందరి పిల్లల్లా పెరిగినట్లయితే సాల్గడో కూడా ఓ మంచి భర్తేనని నీకు రుజువయ్యేది. వీలయినంత త్వరలో ఈ రోగం నుంచి సాల్గడో బయటపడాలి. లేకుంటే శాశ్వతంగా నువ్వు అతనికి తల్లివవుతావు. ఓ బిడ్డకు తల్లివి కాకుండా పోతావు.

చూడమ్మాయ్! ఇన్నేళ్ళు నీ భర్త సెక్స్ విషయంలో తానే చొరవ తీసుకొంటాడని నీవు ఎదురుచూశావు. కానీ అతడాపని చేయలేదు. ఇపుడు ఆ చొరవ నీవు తీసుకోవాలి. నీవలా చేయటం తప్పుకాదు. అది నీ హక్కు.

పంచేంద్రియాల ప్రేరణవల్లే మనిషిలో ఏ భావాలయినా తలెత్తుతాయి. శృంగారం కూడా అంతే. వేషంలో, మాటల్లో, ప్రవర్తనలో శృంగారభావాల్ని నీవు నీ భర్త విషయంలో రెచ్చగొట్టే ప్రయత్నం చేయాలి. అతనిలోని నిగూఢమైన శృంగార చేష్టలు బహిర్గతం

కావాలి. ఇలాంటివి చేయటం పెద్దగా చేతకాని పనేం కాదు. ఏ తెలివీ లేని జంతువులు కూడా శృంగారచేష్టలు చేస్తాయి. ఏ తల్లీ తన కొడుకు దగ్గర అంగాంగ ప్రదర్శన చేయదు. కానీ భార్య అలా చేయగలదు. భర్త సమక్షంలో భార్య వంటిపై అన్నీ ధరించనవసరం లేదు. కానీ తల్లి ఆ పనిచేయదు. కామపూరితమైన మాటలు భార్యే మాట్లాడగలుగుతుంది. అతని శరీరాన్ని తాకుతూ, ఏ భాగాన్నయినా చలింపచేసే హక్కు భార్యకే వుంది. ఇలా తల్లి చేయదు. నీవి ఇలాంటివి చేయటం వల్ల అతనిలో నీ పట్ల వుండే 'తల్లిప్రేమ' క్రమంగా తగ్గిపోయి నిన్ను భార్యలా చూసే పరిస్థితి వస్తుంది. ఇలా చేస్తేనే అతని అంతశ్చేతనలో ఉండే శృంగార భావాలు విజృంభించి ఇప్పుడున్న బలహీన మనస్తత్వం, నపుంసకత్వం తొలిగిపోతాయి".

కోవూర్ సలహాలు ప్రేమను ప్రభావితం చేశాయి. మౌనంగా అపర్ణ అంగీకరించింది.

తర్వాత కోవూర్ ప్రేమను బాగా హిప్నటైజ్ చేశాడు. అనేక సజెషన్స్ ఇచ్చి ఇంటికి పంపించాడు.

1964జనవరిలో నూతన సంవత్సర శుభాకాంక్షలు చెప్పటానికి ప్రేమ, సొల్లడోలు డాక్టర్ కోవూర్ ఇంటికి వచ్చారు. ముద్దులొలికే పాలబుగ్గల పసివాడు ప్రేమ చంకలో బోసినవ్వులు చిందిస్తున్నాడు. కోవూర్ ముద్దుగా ఆ బాబు బుగ్గలను చిదుముతూ ప్రేమ వైపు చూశాడు. ప్రేమ కళ్ళ నుండి ఆనందం, కృతజ్ఞత జంటగా జాలువారుతున్నాయి.



# ఎత్తుగడ

ఆ భూస్వామి పేరు తికిరసేన. రెండొందలెకరాల కొబ్బరితోట, దాని చుట్టూ పొలాలు అతనికి వారసత్వంగా సంక్రమించాయి. ఆ అందమైన తోటలో రాజభవనం లాంటి ఇల్లు. ఇంటినిండా చాకర్లు. విలాసవంతమైన జీవితం.

అతని పొలాల్లో, తోటల్లో రోజూ చాలామంది కూలీలు పనిచేస్తుంటారు. వారంతా పూర్వం అక్కడికి దగ్గర్లో వున్న పల్లెల్లో నివసిస్తూ వుండేవారు. 1951లో 'నిందగామ' అనే గ్రామం వరదతాకిడికి గురయి. ఆ వరదల్లో తన సేవకులు చాలా కష్టనష్టాలకు గురవటం తికిరిసేనకు బాధ కల్గించింది. అప్పట్నుండి తన సేవకులందర్నీ తన ఎస్టేట్(పరగణా)లోనే, కొబ్బరితోటకు చివర ఇళ్ళు కట్టుకోమన్నాడు. తమ యజమాని ఉదార బుద్ధికి ఆ కూలీలు పొందిన ఆనందం అంతా యింతా కాదు. తికిరిసేన తండ్రి హయాం నుండి ఆ కూలీలంతా ఆ పరగణానే నమ్ముకొని బతుకుతున్నారు.

తికిరిసేన భార్య కూడా దొడ్డ ఇల్లాలు. జాలిగుండె గల మనిషి. పెట్టే బుద్ధే గాని కొట్టే బుద్ధి ఆమెకు లేదు.

తికిరిసేన సహజంగా పిరికి స్వభావం గల మనిషి. జీవితంలో సాధించాలనే కోరికలేవీ లేవు. ఓ రకంగా అతడు సోమరిజీవితం గడుపుతున్నాడు. ఎప్పుడూ భార్యాభర్తలిద్దరూ తమ సేవకులతో ఎంతో ప్రేమగా, వారి సంక్షేమం పట్ల శ్రద్ధగా వుండేవారు. ఇలా వుండడంలో తికిరిసేనకి స్వార్థమూ, రాజకీయమూ లేదు. అసలు రాజకీయాలకే అతడు బహుదూరం.

ప్రతిరోజూ ఇంటికి దినపత్రిక వస్తుంది. మొదటిపేజీలో మొదటి పంక్తి నుండి, చివరి పేజీలో చివరి పంక్తి వరకూ ఏదీ వదలకుండా చదువుతాడు తికిరిసేన. ముఖ్యంగా 'గ్రహబలం' బాగా చూసుకొంటుంటాడు. ఇది అతని దినచర్యలో ముఖ్యభాగం.

అతని కొలువులో వున్న జామిస్, పీటర్ అనే సేవకులు తికిరిసేనకు ఆంతరంగికులు. వారిద్దరూ తమ భార్యలతో సహా ఇంటిపనులు చేస్తుంటారు. ఉదయాన 5గంటలకు వచ్చి రాత్రి 10గంటల వరకు అక్కడే పనిచేసి వెళుతుంటారు. వారి భార్యలు మాత్రం సాయంకాలం 5గంటలకల్లా ఇళ్ళకు వెళ్ళి వాళ్ళ సొంతపనులు చూసుకొంటారు. తమ యజయానిని, యజమానురాలిని నిద్రపుచ్చే వరకు తమ ఇంటికి వెళ్ళరు జామిస్, పీటర్‌లు.



ఓరోజు రాత్రి 11గంటలవుతోంది. అప్పటికే తికిరిసేన, అతని భార్యతో పడకగదిలోకి వెళ్ళిపోయాడు. అంతకు ఓ గంటముందే జామిస్, పీటర్లు వెళ్ళిపోయారు. ఓ పెద్ద ఏడుపుతో కూడిన అరుపు వినిపించింది. లేచి చూద్దామనుకోలేదు తికిరిసేన. భయంతో వణుకు పుట్టింది. మెల్లగా లేచి పడకగది కిటికీలన్నీ మూసి, లైట్లు తీసేశాడు. మేడ కింద గదిలో వున్న తన కొడుకును పిలిచాడు. అతడికి ఇరవై ఏళ్ళుంటాయి. 'కాండీ' నగరంలో చదువుతున్నాడు. సెలవులకి ఇంటికి వచ్చాడు.

తండ్రి పిలుపుతో గదిలో నుంచి బైటకి వచ్చాడు కొడుకు. తలుపులన్నీ గట్టిగా వేసి పడుకోమని చెప్పి తిరిగి తన గదిలోకి వెళ్ళాడు. ఆ రాత్రి తికిరిసేనకు కంటి మీద కునుకు రాలేదు. ఏం జరిగివుంటుందోనని ఆలోచిస్తూ ఆ రాత్రంతా గడిపాడు.

మరునాడు ఎప్పటిలాగే ఉదయం 5గంటలకు జామిస్ అతని భార్యతో వచ్చాడు. పీటర్ తన భార్యతో ఆలస్యంగా వచ్చాడు. పనిచేయటం మాని, వాళ్ళు గతరాత్రి జరిగిందంతా చర్చించుకోసాగారు.

తికిరిసేన, అతని భార్య, కొడుకు లేచేసరికి సూర్యోదయమై బారెడు పొద్దెక్కింది. జామిస్ తికిరిసేనకు, పీటర్ యజమాని గారి అబ్బాయికి, వాళ్ళ భార్యలు తికిరిసేన భార్యకు విషయాలన్నీ తమ తమ భాషలో వర్ణించారు. రాత్రి 11గంటలకు గాలిలో ఓ పెద్దమంట పుట్టిందని అది అటుఇటు పల్లెంతా తిరిగి హఠాత్తుగా మాయమైందని వారు చెప్పిన సారాంశం.

ఆరోజు పల్లె జనం అంతా ఆ విషయమే చర్చించుకున్నారు.

ఆరోజు రాత్రి మళ్ళా అదే దృశ్యం కనబడింది. తికిరిసేన, తన కుటుంబంతో సహా చూశాడు. మూడోరోజు ఈ వార్త ప్రక్కగ్రామాలకు కూడా ప్రాకింది.

అదో వింతగా జనం గుంపులుగా కొబ్బరితోటకు రాసాగారు. మూడోరాత్రి కూడా వచ్చిన ఆ మంటను కూడా అందరూ చూశారు.

ఇక ఆ మంటను గూర్చి కథలు పుట్టాయి. తమ తమ భయాలకు తగినట్లుగా కథలు అల్లారు జనం. తమ పిల్లల్ని 7గంటలకే నిద్ర పుచ్చేవారు. పొరుగూరు వెళ్ళినా, పొలం వెళ్ళినా, ఎక్కడికెళ్ళినా సాయంత్రానికి అంతా ఇళ్ళకు చేరుకోసాగారు. జామిస్, పీటర్‌లు కూడా చీకటి పడగానే యజమానికి చెప్పి ఇళ్ళు చేరుకొంటున్నారు. పల్లెపల్లెంతా భయంతో విలవిల్లాడుతోంది.

జనం చెప్పే కథలు చిలవలుపలువలుగా సాగాయి. అదో కొరివి దయ్యమని, అది 'బలి'కోరుతూ వీధంతా తిరుగుతోందని అన్నారు కొందరు. 'ఎలియా' అనే అగ్నిదేవత అలా వస్తున్నదన్నారు. అదేదీకాదని, భైరవయ్యస్వామి దగ్గరవున్న రత్నం ఇలాగే వుంటుందని, మన పల్లెను కాపాడేందుకే అది వచ్చిందని కొందరన్నారు.

అదలా వుంటే – తికిరిసేనకు ఈ పరిస్థితి వల్ల ఎంతో ఇబ్బందిగా వుంది. ఎంత డబ్బుంటే మాత్రం ఏం? తన ఇంటి పనోళ్ళు తన వద్ద రాత్రి వరకు ఉండకపోవడం అతనికెంతో అసౌకర్యంగా వుంది.జామిస్ సాయం లేకుండా తికిరిసేన స్నానం కూడా చేయడు. అతడు స్టూల్ మీద కూర్చుంటే చాలు జామిస్ నీళ్ళు తోడుతాడు, సబ్బు రుద్దుతాడు, వళ్ళు తోముతాడు, తలమీద నూటొక్క బకెట్ల నీళ్ళు కుమ్మరిస్తాడు. ఆ తర్వాత తువ్వాలుతో వళ్ళాంతా తుడుస్తాడు. ఇప్పుడవన్నీ జరగడం లేదు. అదే అతని బాధంతా.

తికిరిసేన భవంతిలో పగలంతా "ఆ మంటల దయ్యం"పైనే చర్చలు జరుగుతున్నాయి.

మంత్రగాళ్ళను గూర్చి కూడా వాళ్ళు ఆలోచించారు.

ఓరోజు కొలంబో నుండి ఒక యువకుడు తికిరిసేన ఇంటికి వచ్చాడు. తికిరిసేన కొడుక్కి అతడు స్నేహితుడట. 'మంటల దయ్యాన్ని' గూర్చి విన్నాడు. అదంతా 'మోసం' అన్నాడు. అందరూ వింతగా చూశారు అతనివైపు. అతగాడు మాటల సందర్భంలో డాక్టర్ కోవూర్ ఇలాంటి సమస్యలను తనదైన 'సత్యశోధన'తో తేల్చివేస్తాడని, దీని వెనుక జరిగే మోసాన్ని మీ ముందుంచుతాడని నొక్కి చెప్పాడు. తికిరిసేన కొడుకు కూడా స్నేహితునికి వత్తాసిచ్చాడు.

ఎంత ఖర్చైనా ఈ 'మంటల దయ్యం' సంగతి తేల్చాలని తికిరిసేన పట్టుదల.

1951 ఏప్రిల్‌లో ఓ శనివారం కోవూర్ ఇంటికి చేరుకున్నాడు తికిరిసేన. జరిగిన సంగతులన్నీ వరుసగా చెప్పాడు. తికిరిసేనతో వెళ్ళడానికి కోవూర్ నిశ్చయించుకున్నాడు.

మర్నాడు ఉదయం కోవూర్ ఇంటి ముందు తికిరిసేన కారు ఆగింది. కోవూర్ కూడా సిద్ధంగా వున్నాడు. 10గంటల కల్లా అంతా బయల్దేరారు. వెళ్తూండగా దారిలో వాన ప్రారంభమై రోడ్లన్నీ జలమయం అయ్యాయి. నెమ్మదిగా వాటన్నిటినీ దాటుకుంటూ మధ్యాహ్నం 3 గంటలకు ఇంటికి చేరుకున్నారు.

కారు దిగి ఇంటిలోకి అడుగుపెడుతూనే తికిరిసేన వైభవానికి కోవూర్ ఆశ్చర్యపోయాడు. ఇంటి నిండా జనం, చక్కగా అమర్చిన ఖరీదైన వస్తువులు, విశాలమైన అందమైన ఇల్లు, అదో అంతఃపురమేననిపించింది.

కోవూర్ స్నానం ముగించి వెచ్చని టీ త్రాగాడు. తికిరిసేన తన గతాన్ని చెప్తున్నాడు. తన తాతల తండ్రుల వైభవాన్ని మచ్చటిస్తున్నాడు. మధ్యమధ్యలో తన గొప్పనూ ప్రదర్శిస్తున్నాడు.

మసక చీకటవుతుండగానే ఇంటికి వెళ్ళే హడావుడిలో వున్నారు జామిస్, పీటర్‌లు. అందుకే 6గంటలకే కోవూర్‌కి విందు ఏర్పాటయింది. జామిస్ వడ్డించాడు.

సేవకులు పాత్రలను శుభ్రం చేయకుండానే తికిరిసేన వద్ద అనుమతి తీసుకుని ఇంటి దారి పట్టారు. తికిరిసేన కోవూర్‌కి వారి సేవలను గూర్చి ఎంతో మురిపెంగా వివరించాడు.

అందరూ బయట కుర్చీలు వేసుకుని కూర్చున్నారు. ఆకాశం నిర్మలంగా వుంది. అర్థచంద్రుని లేత వెన్నెల ఇంకా కొద్దిసేపటికే ఆరిపోయే దీపంలా వుంది. తికిరిసేన, అతని భార్య పైకి బాగానేవున్నా మనస్సులో భయపడుతున్నారు. 11గంటలవుతున్న కొద్దీ గుండెల్లో గుబులెక్కువవుతోంది.

సరిగ్గా పదకొండయింది. దూరంగా ధ్వనులు విన్పించాయి. గాలిలో మంట లేచింది. తికిరిసేన భార్య లేచి "అదుగో అదే..అదే.. మంటల దయ్యం వచ్చింది...." అంది భయంభయంగా..

కోవూర్ నిబ్బరంగా అటువైపు చూశాడు. భయపడవద్దని ఆమెకు ధైర్యం చెప్పాడు. మంటవైపే పరిశీలనగా చూశాడు.

మంట గాలిలోనే వుంది. పడమర నుండి తూర్పుకు వస్తోంది. సుమారు నూరు అడుగులు వచ్చింది. తర్వాత మరలా పడమరకి తిరిగింది. సుమారు రెండడుగుల ఎత్తు, ఒక అడుగు వెడల్పు వుంటుందని కోవూర్ అంచనా వేశాడు.

కోవూర్ చేతికర్ర అందుకున్నాడు. తికిరిసేనను, వాళ్ళ అబ్బాయిని చూశాడు. ఎవరినైనా ఒకర్ని తోడు రమ్మన్నాడు. ఇద్దరూ భయంతో రాలేమన్నారు. పైగా అందరూ ఇంట్లోకి వెళ్ళడానికి తయారయ్యారు.

కోవూర్ గబగబా అడుగులేసుకుంటూ మంటవైపు నడక సాగించాడు. దగ్గరకి వెళ్ళే కొద్దీ మంట స్పష్టంగా కన్పడసాగింది. నేలనుండి ఆరడుగుల ఎత్తులో వుంది.

కోవూర్ నడక సూటిగా మంటవైపే సాగుతోంది. అతడు దగ్గరయ్యేకొద్దీ మంట వెనక్కి వెళుతున్నట్లు అనిపించింది. అతనికి 50 అడుగుల దూరంలో వుంది ఇపుడు. మంట నడక మార్చింది. కోవూర్ వైపుకి వేగంగా వస్తోంది. కోవూర్ ఒక్కక్షణం ఆగాడు. మంట కింద ఏదో ఆకారం కోవూర్‌కి అస్పష్టంగా కన్పించింది. దాని చేతులు బార్లా చాపి వున్నాయి. అడుగులు వెడల్పుగా వేస్తోంది. తనని భయపెట్టడానికి వస్తోందని గ్రహించాడు. ఆ ఆకారం పదడుగుల దూరంలోకి రాగానే – "ఏయ్! ఆగక్కడ, ఎవరునువ్వు?" అంటూ బిగ్గరగా అరిచాడు. ఆశ్చర్యం! ఆ అరుపుకి గాలిలోని మంట నేలమీద పడింది. ఆకారం వెనక్కి పరిగెత్తుతోంది.

కోవూర్ కూడా ఆ ఆకారం వెళ్తున్న దిశగా వెంబడించాడు. వెన్నెల కూడా లేకపోవడంతో ఆ ఆకారం చాలా అస్పష్టంగా కన్పిస్తోంది. అయినా కోవూర్ పట్టుదలతో మున్ముందుకే దూసుకుపోతున్నాడు. అంతలో "చచ్చాన్రోయ్ దేవుడో!" అనే వెర్రికేక విన్పించింది. కోవూర్ మరలా ఆగాడు. కొద్దిదూరంలో తాను వెంబడించే ఆకారంలోంచి ఆ అరుపు వచ్చిందని గ్రహించాడు. మరలా ముందుకు నడిచాడు. ఆకారం ఒక గొయ్యిలో పడి లేస్తోంది. వెంటనే కోవూర్ వెళ్ళి దాని చెయ్యి పట్టుకొన్నాడు.

"అయ్యగారూ! నన్ను చంపకండి. నేను జామిస్‌ని. మీకు అన్నం పెట్టినవాణ్ని" అన్నదా ఆకారం.

అంతేకాదు ఏడుస్తూ కోవూర్ కాళ్ళ మీద పడ్డాడు జామిస్.

"లే. లే.. జామిస్! నేను నిన్నేం చేయను, లే" అంటూ కోవూర్ పైకి లేవనెత్తాడు. 'ఎందుకిలా చేస్తున్నావు?' అన్నాడు.

"చెప్తాను అయ్యగారూ! అంతా చెప్తాను నా వెంట రండి"జామిస్ తన యింటివైపు దారి తీశాడు. కోవూర్ అనుసరించాడు.

ఇద్దరూ మంట కిందపడ్డ చోటికి వెళ్ళారు. జామిస్ నేలమీద పడి వున్న నూనె కళాయి వంటి పెద్దపాత్రని తీపుకుని తన గుడిసెలోకి ప్రవేశించాడు.

గుడిసెలో ఓ గుడ్డి దీపం వెలుగుతోంది. మూలనున్న ఓ చింకిచాపను నేలమీద పరిచి కోవూర్‌ని కూర్చోబెట్టాడు. నిద్రిస్తున్న తన భార్యను కూడా లేపాడు.

"అయ్యగారూ! ఈమె నా భార్య. నేనూ, ఈవిడా దొరగారి బంగ్లాలోనే పనిచేస్తుంటాము. నా అయ్య, అమ్మ కూడా మా దొరగారి తండ్రిగారికి సేవలు చేశారు. మేంకూడా వారి బాటలోనే నడుస్తున్నాం.దొరగారు కూడా మమ్మల్ని ఎంతో బాగా చూసుకుంటారు.

ఆర్నెల్ల కిందట మా పెళ్ళయింది. అప్పట్నుంచి నా భార్య కూడా నాతో పన్లోకి వస్తోంది. సాయంకాలం 5 గంటలకన్నా ముందే గుడిసెకొస్తది. నేను మాత్రం రాత్రి పదిగంటలయిందాక వచ్చే వీలుండదు. ఇలా సాగుతోంది మా జీవితం.

ఇపుడు స్కూళ్ళకి సెలవిచ్చారు గదండీ! మా చిన్నదొరగారు సెలవులకి ఇంటికి వచ్చారు. ఈయనతో వచ్చిందండి మాకు ఇబ్బంది. రోజూ సాయంత్రం నా భార్య బంగ్లా నుండి రాగానే ఆ బాబు కూడా వస్తాడంట. నా భార్యతో నానా మాటలాడుతూ సరసాలాడతాడంట. ఈ విషయం నాకు తెల్సింది. దొరగారికి తెలిస్తే పన్లోంచి తీసేస్తారని భయం. వద్దన్నా చిన్నదొర రాకమానడనే అనుమానం. నన్నేం చేయమంటారు? అందుకే, ఆ చిన్నదొరను రాకుండా చేయాలంటే ఇదొక్కటే దారనిపించింది. అందుకే ఇలా చేస్తున్నానయ్యగోరూ! మీరు పెద్దవారు, అన్నీ తెలిసినవారు. దయచేసి మా దొరగారికి మాత్రం ఈ విషయం చెప్పకండి. మరెప్పుడూ ఇలాంటి పనులు చేయను" అంటూ దీనంగా ప్రార్థించాడు జామిస్.

జామిస్ దీనగాధ కోవూర్ గుండెను కుదిపింది. కళ్ళలో జాలి కదలాడింది,

"జామిస్! నీ కోరిక ప్రకారం చెప్పను. కానీ ఒకటడుగుతాను చెప్పు. ఈ మంటలనెలా తయారు చేస్తున్నావ్?" అన్నాడు కోవూర్.

"అయ్యగారూ! మీకు తెలియని విద్యేమీకాదండి. ఇలాంటివి మీకెన్నో తెలుసునని చెప్పుకుంటుంటే విన్నాను. నా బోటివాడు డబ్బు ఖర్చు పెట్టలేడు. ఏది చెయ్యటానికైనా, నాకు తోచిన చిన్న ఉపాయంతో ఇదంతా చేశానయ్యా! ఇది చూడండి. ఇది నూనె పోసి పిండివంటలు వండుకునే నూనె కళాయి. దీనిలో కొబ్బరి చిప్పల్ని, పీచుని వుంచి వరిపొట్టు పోసేవాణ్ని. గాలికి మంట మండుతుండేది. అంతా కాలగానే నీళ్ళు పోసి పూర్తిగా ఆర్పి ఆ బూడిదను దూరంగా పొలాల్లో చల్లేవాణ్ని".

జామిస్ చెప్తుంటే కోవూర్‌కి ఆశ్చర్యం వేసింది. అవసరమే ఆవిష్కరణలకు మూలమంటారు, ఇందుకే కాబోలు. జామిస్‌కి అభయమిచ్చి, మరెప్పుడూ ఈ పనిచేయకుండా హామీ తీసుకుని గుడిసెలో నుండి బయటకి వచ్చాడు కోవూర్.

ఇంత జరుగుతున్నా, పల్లెలోంచి ఏ ఒక్కరూ బయటకి రాకపోవడం అతనికి ఆశ్చర్యం కల్గించింది. భయం మానవుణ్ణి ఎంత బలహీనుణ్ణి చేస్తుంది!

తికిరిసేన బంగ్లాకి వచ్చాడు కోవూర్. తలుపులు బిడాయించినా, లోపల మేలుకునే వున్నారు అంతా. తలుపుతట్టి పిలవగానే వచ్చి తలుపులు తీశారు. అందరూ కోవూర్ని ఎగాదిగా చూస్తున్నారు. వాళ్ళ చూపులకి కోవూర్ ఆశ్చర్యపోయాడు.

"ఏమిటి అంతా అలా చూస్తున్నారు?.... మంటలదయ్యం నన్నేమైనా చేసిందే మోననా?" అంటూ నవ్వి "నాకేమీ కాలేదు. ఆ మంటలకి ఏ దయ్యమూ కారణం కాదు.

మీరనుకొంటున్నట్లు దయ్యాలనేవి ఎక్కడా వుండవ్. మనలోని భయం, అజ్ఞానం మనకా నమ్మకాన్ని కల్గిస్తాయి, అంతే. ఈ పరగణాలో వుంటున్న వ్యక్తి తన కుటుంబ రక్షణ కోసం వేసిన ఎత్తుగడ వల్లే ఆ మంటలు వస్తున్నాయి. దయచేసి అతని పేరేమిటని నన్ను అడగొద్దు. కానీ, ఇకనుంచి ఆ వ్యక్తి ఆ పనిచేయడు. మీరంతా నిర్భయంగా ఉండవచ్చు" అని చెప్పి తన గదిలోకి వెళ్ళాడు.

తెల్లవారాక కోవూర్ తన ఇంటికి వెళ్ళిపోయాడు. ఓ వారం గడిచాక.. ఓరోజు ఉదయం కోవూర్ ఇంటిముందు కారాగింది. డ్రైవర్ దిగి, చేతిలో ఒక పెట్టెతో, డ్రాయింగ్‌రూంలోకి వచ్చాడు. పెట్టెనక్కడ పెట్టి మళ్ళీ కారులోంచి రెండు పెద్దబుట్టలను కూడా తెచ్చి వుంచాడు. ఒక బుట్టనిండా పళ్ళు, మరో బుట్ట నిండా కూరగాయలు. పెట్టెలో వెన్న, బిస్కెట్లు, ఇంకా ఏవేవో ఉన్నాయి.

తికిరిసేన, అతని భార్యతో లోపలికి వచ్చాడు. కోవూర్ సాదరంగా ఆహ్వానించాడు. ఆరోజు నుండి మంటలు రావడం లేదని, తమ పల్లె జనం అంతా కోవూర్ గొప్పతనాన్ని పొగుడుతున్నారని తికిరిసేన కృతజ్ఞతతో చెప్పాడు. తమ ఊరికి కుటుంబంతో సహా రమ్మని కోవూర్ దంపతులను ఆహ్వానించాడు. ఎంత వద్దన్నా విన్పించుకోకుండా ఆ కానుకలను వదిలి కృతజ్ఞతలు చెబుతూ తిరిగివెళ్ళారు తికిరిసేన దంపతులు.



# కథలు కాచే మామిడి!

రణవక్కే ఆ కాలేజీలో చేరి మూడురోజులే అయింది. ఆ ప్రాంతమంతా అతనికి కొత్తగా వుంది. ఎన్నడూ కన్నతల్లిని, ఉన్న ఊరిని వదిలినవాడు కాదు. కాలేజీలో అంతా కొత్తకొత్తగా తోస్తోంది. హాస్టల్‌లో జాయిన్ అయ్యాక, తన స్నేహితులకున్నవీ తనకు కావల్సినవీ ఏమిటో గుర్తించాడు. వాటిని కొనాలంటే పట్నం వెళ్ళాలి.

హాస్టల్ ఆఫీసర్ దగ్గరకెళ్ళి అనుమతి తీసుకుని పట్నం వెళ్ళాడు రణవక్కే. కొత్త అయినా ఎలాగో తనక్కావలసినవి కొని ఇంకా పొద్దు బారెడుండనగా కాలేజీ ముఖం పట్టాడు. బాగా చీకటి పడే వేళకి కాలేజ్ గేటు దగ్గరకు చేరుకున్నాడు.

గేటునుంచి మూడు ఫర్లాంగులు నడిస్తేగాని, కాలేజి హాస్టల్ బిల్డింగ్స్ రావు. రణవక్కే గేటు లోపలకి వెళ్ళబోయాడు.

ఇంతలో ఓ యువకుడు గేటు దగ్గరకు వచ్చి గబగబా నడుస్తూ లోపలకి వెళ్తున్నాడు. హాస్టల్‌కే అయివుంటుందనుకున్నాడు రణవక్కే.

"హలో సార్! హాస్టల్‌కేనా? నేనూ వస్తున్నా"

రణవక్కే ఆశించినట్లు అతనినుండి ఏమీ జవాబు లేదు.

"మీరు డిగ్రీస్టూడెంటాండీ?" అయినా జవాబులేదు. అతనితో కొద్ది దూరం నడిచాక ఏదో ఒకటి మాట్లాడకుండా ఉండలేకపోతున్నాడు.

"మీరేవూరు నుంచి వచ్చారు? మీ పేరేంటి సార్?"

మూడోసారి కూడా రణవక్కేకి నిరాశే మిగిలింది. ఇంకేం మాట్లాడకూడదనుకొని అతనితో పాటు గబగబా నడుస్తున్నాడు.

ఆ చీకటిలో మనసంతా భయంతో గుబగుబలాడుతోంది. కాళ్ళు ఎలాగో తన శరీరాన్ని లాక్కెళుతున్నాయి. ఒక పెద్ద చెట్టు కిందకి వచ్చాడు రణవక్కే. ఏదో దభాలున చెట్టు మీంచి దూకిన శబ్దం. గుండెలు గుభేలుమన్నాయి. అయినా గుండె

చిక్కబట్టుకున్నాడు. ఏమీ పట్టించుకోకుండా నడక వేగం పెంచాడు. తన పక్కవాడు తనతో వస్తున్నాడా? అనుమానంగా ప్రక్కకి చూశాడు. ఆశ్చర్యం! ఎవరూ లేరు. వెనక్కి తిరిగి చూశాడు. నల్లటి కుక్కపిల్ల పరిగెత్తుతూ వస్తోంది.

రణవక్కేకి చెమటలు పట్టాయి. కాళ్ళ నుంచి వణుకు మొదలైంది. బలమంతా కూడదీసుకుని పరుగెత్తడం మొదలుపెట్టాడు. కుక్క కూడా పరుగు పెంచింది. గట్టిగా మొరగడం మొదలుపెట్టింది. ధైర్యం కోల్పోయిన గుండెలతో 'కేవ్'మంటూ పెద్దగా అరిచాడు. అయినా పరుగాపలేదు.

ఆయాసంతో, పరుగెత్తుతూ వెళ్ళి హాస్టల్ రూంలో పడిపోయాడు. గదిలో విద్యార్థులంతా చుట్టూ మూగారు. క్షణాల్లో వార్త వార్డెన్ చెవికి చేరింది. హాస్టల్ ఆఫీసర్‌తో సహా అంతా వచ్చారు.

ముఖం మీద నీళ్ళు చల్లారు. టేబిల్ ఫ్యాన్ ఆన్ చేసారు. డాక్టర్‌కి కబురు పెట్టారు.

కొద్దిసేపటికి కళ్ళు తెరిచాడు రణవక్కే. ఏం జరిగిందని డాక్టర్ అడిగినా జవాబు చెప్పలేకపోయాడు. జ్వరం పెరిగింది. ముఖంలో ఆందోళన, భయం. డాక్టర్ సలహాతో తల్లిదండ్రులకు కబురు పంపాడు వార్డెన్.

***

దక్షిణ శ్రీలంకలో 'గల్లే' పేరున్న పట్నం. ఊరి చివరగా 'రిచ్‌మండ్' అనే కొండ వుంది. ఆ కొండ మీద బ్రిటీష్ వారు కట్టించిన కాలేజీయే 'రిచ్‌మండ్ కాలేజ్'

రిచ్‌మండ్ కొండ మీద కాలేజీ బిల్డింగ్స్ వుంటాయి. విద్యార్థుల హాస్టళ్ళు, ప్రిన్సిపాల్ బంగ్లా, వైస్ ప్రిన్సిపాల్ నివాసం, లైబ్రరీ, లాబ్ వగైరాలన్నీ వున్నాయి. కొండ మీద నుంచి కొండ కింద మెయిన్ గేట్ వరకు మూడు ఫర్లాంగుల దూరం. ఏటవాలుగా సన్నగా వున్న దారి. కారు మాత్రమే నడిచే వీలున్న తారురోడ్డు, ఆ రెండువైపుల ఏన్నో ఏళ్ళ నుండి, ఆలనా పాలనా లేకుండా పెరిగిన గుబురైన పొదలు, చెట్లు. పగలు కూడా ఆ దారిలో ఎండ పొడ తగలదు. సాయంకాలమైతే చాలు గుడ్లగూబల అరుపులు, గిలకోళ్ళ కిలకిలలు, కోతుల సకిలింపులు, పక్షుల కలకలలు... కొత్తగా అటుగా వచ్చేవారికి, ఒంటరిగా వచ్చేవారికి మరీ భయాన్ని పెంచే వాతావరణం అక్కడుంది. తెల్లదొరలు ఆ కొండ మీద కాలేజీ కట్టినపుడే ఆ పొదలను, చెట్లను కొట్టాలని ప్రయత్నించారు. అయితే ఆ ప్రాంతం వారెవరూ వాటిని నరికే ధైర్యం చేయలేదు. ఆ 'అడవి'లో రకరకాల దయ్యాలున్నాయని, అవి తమపై పగపడతాయని వాళ్ళ నమ్మిక. అందుకోసం దూరపు ప్రాంతాలనుంచీ కూలీలను రప్పించి అడవిని నరికించారు. వాళ్ళు కూడా కొన్ని రోజుల తర్వాత అక్కడి వారి మాటలు నమ్మి వెళ్ళిపోయారు.

ఆ కాలేజ్ రోడ్డుప్రక్క పెద్ద మామిడి చెట్టు వుంది. వయసు కొన్ని వందల ఏళ్ళు ంటుంది. రకరకాల తీగలన్నీ చెట్టు పైకి పాకి, పైనుండి క్రిందకి ఊడల్లా వ్రేలాడుతుంటాయి.

ఎండాకాలంలో చెట్టు నిండా మామిడి కాయలతో, తీగలతో మరింత భయం గొల్పుతుంది ఆ చెట్టు.



ఆ చెట్టుని కేంద్రంగా చేసుకుని అనేక కథలు పుట్టాయి. అవన్నీ అక్కడి హాస్టల్ విద్యార్థులు చెప్పుకొంటుంటారు. పాతవాళ్ళ నుంచి కొత్తవారికి ఆ కథలు సంక్రమిస్తు ంటాయి. అక్కడి లెక్చరర్స్ కూడా వాటిని కొత్తవారికి విన్పిస్తారు.

కాలేజీలో చేరిన రెండోరోజే రణవక్కే ఇలాంటి కథలు విన్నాడు. అందుకే పట్నం వెళ్ళి చీకటిపడకముందే హాస్టల్‌కి రావాలని ప్రయత్నించాడు. అయినా కొత్తవాడైనందువల్ల దారి తెలుసుకోలేక ఆలస్యమై చీకటి పడిందాకా అక్కడికి రాలేకపోయాడు.

రణవక్కేకి భయంతో పుట్టిన ఆనాటి జ్వరం రెండు నెలల దాకా వదల్లేదు.

***

1943 జనవరిలో డాక్టర్ కోవూర్ రిచ్‌మండ్ కాలేజీకి లెక్చరర్‌గా వచ్చారు. కాలేజీలో ప్రిన్సిపల్ బంగళాలో పై అంతస్తుని అతనికి క్వార్టర్‌గా ఇచ్చారు.

కాలేజీలో చేరినరోజే అక్కడి వాతావరణం కోవూర్‌ని ఆకర్షించింది. అతని తోటి లెక్చరర్ 'కోషే'తో ఎన్నో విషయాలు ముచ్చటించారు. హాస్టల్ ఆఫీసర్ తిరైరత్నం తన హాస్టల్ అనుభవాలతోపాటు, అక్కడి వాతావరణం గురించి, దయ్యాల మామిడి చెట్టు గురించి కళ్ళు పెద్దవి చేస్తూ చెప్పాడు. రణవక్కే కథను కూడా వినిపించాడు. కొద్దిరోజుల క్రితం జరిగిన తన అనుభవాన్ని కూడా ఇలా వివరించాడు.

ఓరోజు తను ఇద్దరు సీనియర్ విద్యార్థులతో సినిమా చూట్టానికి పట్నం వెళ్ళాడట. అర్ధరాత్రి అయింది. ముగ్గురూ హాస్టల్‌కి వస్తున్నారు. మామిడిచెట్టు దగ్గరకు రాగానే చెట్టు మీదనుంచి ఏదో దూకిన శబ్దమయిందట. తల పైకెత్తి చూస్తే ఏదో ఆకారం నల్లగా కన్పించిందట. ఏదో అనుకుని కదిలారట. రెండు అడుగులు వేయగానే ఓ విద్యార్థి మీద పెద్ద మామిడిపండు పడిందట. ఆ దెబ్బతో గబగబా పరుగులాంటి నడకతో హాస్టల్‌కి చేరుకున్నారట.

ఇలాంటివన్నీ చిరునవ్వుతో వింటూ వుంటే కోవూర్‌ని చూసి విస్తుపోయారు కోషే, తిరైరత్నం.

జూన్ నెలలో కాలేజీ పాతవిద్యార్థులంతా గల్లేలోని ఒక ఆడిటోరియంలో తమ సాంస్కృతిక సంఘం తరఫున ఓ సభ ఏర్పాటుచేశారు. దానిలో మాట్లాడవలసిందిగా కోవూర్‌ని ఆహ్వానించారు.

ఆ ఆడిటోరియం కాలేజీ మెయిన్‌గేట్‌కి ఒక ఫర్లాంగు దూరంలోనే వుంది. కోవూర్ తన భార్య అక్కాతో కలసి మీటింగ్‌కి వెళ్ళాడు. "శాస్త్రీయదృష్టి - దాని అవసరం" గురించి ఉపన్యసించాడు. ఎన్నో ప్రశ్నలు వచ్చాయి. అన్నిటికీ తగిన జవాబులిచ్చాడు. అర్ధరాత్రి దాకా మీటింగ్ జరుగుతూనే వుంది.

మీటింగ్ పూర్తవగానే అక్కాతో కలసి కోవూర్ కాలేజీ వైపు నడవసాగాడు. విద్యార్థులు తోడు వస్తామన్నారు. చేతిలో లైటయినా లేకుండా చీకట్లో అలా వెళ్ళడం మంచిది కాదన్నారు. ఏం ఫరవాలేదన్నాడు కోవూర్. ఏ చీకటీ, ఏ దయ్యాలు తననేమీ చేయలేవని ధీమాగా చెప్పాడు. దంపతులిద్దరూ నడవసాగారు.

అక్కాతో మాట్లాడుతూ కాలేజీ గేటులోంచి ఆ సన్నని దారిలో వెళ్తున్నాడు కోవూర్. అక్కా కూడా కోవూర్ చెప్పేవి ఆలకిస్తూ నడుస్తోంది.

ఎన్నోసార్లు కోవూర్ పరిశోధించిన అనేక దయ్యాల కేసుల్లో అక్కా కూడా పాల్గొంది. ఎంతో అనుభవాన్ని కూడా సంపాదించింది.

వారు నడుస్తూ మామిడి చెట్టు వద్దకు చేరుకున్నారు. ఆమె ఏదో చెప్తోంది. ఆ మాటల్లో - "ఇప్పుడెవరైనా హఠాత్తుగా ఇటు వస్తే వాళ్ళు ఖచ్చితంగా..." అని మాట పూర్తిచేయకుండానే పెద్దగా అరుస్తూ ఒక్క గెంతుతో ఎడమవైపున్నదల్లా కోవూర్ కుడివైపుకి వచ్చింది.

హఠాత్తుగా జరిగిన ఈ సంఘటనకి అదిరిపడ్డాడు కోవూర్. అక్కాను తన వైపుకి లాక్కొన్నాడు.

"ఏం జరిగింది అక్కా?" జవాబు చెప్పలేకపోయింది.

"అక్కా! ఏమిటి, ఏం జరిగింది? చెప్పు" మళ్ళీ అడిగాడు కోవూర్. అతని మాటల్లో ఆందోళన, ఆశ్చర్యం ఉబికి వస్తున్నాయి.

భయం వల్లనేమో! అక్కా శరీరంలో వస్తున్న వణుకును గమనించాడు కోవూర్. ఆమె గుండెల్లోని దడదడలు అతనికి తెలుస్తున్నాయి. అక్కా ఏదో చెప్పాలనుకుంటోందని కోవూర్ గ్రహించాడు. ఆ చీకటిలో కూడా మాట్లాడాలని ప్రయత్నించినా పెగల్లేని ఆమె నోటిని చూశాడు కోవూర్.

ఎంతో ప్రయత్నించిన మీదట "అటుచూడు..ఏనుగు?" అంది.

కోవూర్ ఎడమవైపు చూశాడు. పది అంగల దూరంలో ఏదో ఆకారం. అసలే కాటుక అలుముకున్నట్లు కటికచీకటి. అందులో ఆ నల్లని ఏనుగులాంటి ఆకారం. ఎంతకీ కదలిక లేనట్టున్న చిన్న కొండ లాంటి ఆకారం.

చూడగానే కోవూర్ ఒక్కక్షణం చలించాడు.

వెనక్కి "పోదాం పద! గబగబా నడు" అంటూ చెయ్యిపట్టి వెనక్కి లాగింది అక్కా కానీ కోవూర్ కదల్లేదు. ఒక నిమిషం దానివైపే చూశాడు. ఆ ఏనుగు కదల్లేదు. పైగా చిన్న మూలుగులాంటి శబ్దం వినిపిస్తోంది.

'రండీ! ఈ చీకట్లో ఏం చేయగలం?" అక్కాలో వున్న భయం గొంతులో కొట్టుకొంటోంది. అదేమిటో అప్పుడే తెలుసుకోవాలని కోవూర్ నిశ్చయించుకున్నాడు.

కిందకి వంగి చేతిలోకి ఓ రాయి తీసుకున్నాడు.

"ఏమండీ, ఏం చేయబోతున్నారు? దాన్నేమీ చేయకండి, రండి వెళ్దాం" కోవూర్ అక్కా మాటలు విన్పించుకోలేదు.

"ఏ..య్..' అని పెద్దగా అరిచాడు. ఏనుగులోంచి వచ్చే మూలుగు ఆగిపోయింది. దాని కుడి చెవి కదులుతున్నట్లు కనపడింది.

రెండోసారి మళ్ళీ అలాగే అరిచాడు కోవూర్.

ఈసారి మరో విచిత్రం. 'ఏనుగు' ప్రక్కనుంచి ఓ మనిషి కన్పించాడు. తమవైపుగా రాసాగాడు. మావటివాడేమో!

కోవూర్ చేతిని గట్టిగా పట్టుకుంది అక్కా.

"ఎవరండీ మీరు?" అడిగింది ఆకారం.

"నువ్వెవరు? ఇంత రాత్రివేళ ఆ ఏనుగుతో ఏంచేస్తున్నావిక్కడ?" కోవూర్ మాటలు కటువుగా ధ్వనించాయి.

"ఏ ఏనుగు బాబూ?" అమాయకంగా అంది ఆకారం.

"ఇంకేం ఏనుగుందిక్కడ? అదే ఆ నీ ఏనుగు?" చూపించాడు కోవూర్.

"ఓస్ అదా బాబూ!" అంటూ గట్టిగా నవ్వి "అది డాక్టర్ గారి కారండీ. డాక్టర్ విజేరత్నేగారు ప్రిన్సిపాల్‌ని కలవడానికి వచ్చారు. ఇక్కడకు రాగానే కారు కొండ ఎక్కలేనని మొరాయించింది. డాక్టరుగారు కారు దిగి నడకతో బంగళాకి వెళ్ళిపోయారు. వారి కోసమే నేను వేచి చూస్తున్నాను" అన్నది ఆకారం.

"అదా సంగతి! హమ్మయ్య!" అనుకొంటూ కోవూర్ చేయి వదిలింది అక్కా. కోవూర్ మరేమీ అనలేకపోయాడు. తన గురించి ఆ డ్రైవరికి చెప్పి ముందుకు నడిచాడు.

జరిగిందానికి సిగ్గుపడుతూ నవ్వింది అక్కా. ఇంటికి చేరిందాకా ఆ విషయాన్నే చెప్పుకుంటూ నవ్వుకున్నారు ఆ దంపతులు.

మర్నాడు కాలేజ్‌లో తను కలిసిన వారందరికీ ఈ విషయం చెప్పాడు కోవూర్. స్టాఫ్‌రూంలో అదే పెద్ద చర్చగా మారింది.

"దయ్యాలంటే భయపడని నేను, నా భార్య కూడా భయపడ్డాం.. నిజంగానే భయపడ్డాం. అదలా వుంచండి, అసలు దయ్యాలున్నాయని జనం ఎందుకు నమ్ము తున్నారు? ఆత్మలనేవి వున్నాయని, చచ్చిన వారి నుండి అవి బైటకి వచ్చి దయ్యాలవుతాయని

వారు అనుకొంటారు, కానీ ఇవేవీ రుజువులకు నిలబడవు. శాస్త్రీయ పరిశోధనకు అందవు. చిన్నప్పట్నుంచి నేను, నా భార్య కూడా అలాంటి భావాలు గల తల్లిదండ్రుల పెంపకంలోనే పెరగటం వల్ల, ఆ భయం అవశేషాలు మాలో వుండిపోవడం వల్ల మేము భయపడ్డాం. కానీ శాస్త్రీయదృష్టి మాకిచ్చిన బలం వల్ల, ధైర్యం వల్ల మేము పారిపోకుండా నిలబడగల్గాం. దాని అసలు విషయాన్ని కనుగొన్నాం".

"అసలు ఆ మామిడిచెట్టు దగ్గరే ఇలాంటివన్నీ జరుగుతున్నాయ్ సార్!" అన్నారు కోషే.

"అలా జరగడానికి కారణాలున్నాయ్. ఎన్నో తరాల నుండి, ఆ మామిడిచెట్టు చుట్టూ తీగలు అల్లుకుపోయినట్టే. ఇక్కడున్న ప్రజల మెదళ్ళకు అనేక అపోహలు, ఆ చెట్టు గురించిన భయాలు అల్లుకుపోయాయి. వింతగా, విడ్డూరంగా కన్పిస్తే చాలు చెట్టులకీ, పుట్టలకీ, కొండలకీ, గుట్టలకీ, వేటికైనా ఏవో కథలు అల్లటం అజ్ఞానం వల్ల కల్గిన అలవాటు. ఆ కథలు చిలవలు పలవలై దయ్యాలతో నిండిపోయి, ప్రజల్లో వాటి పట్ల భయాలను, భ్రాంతులను శాశ్వతం చేస్తాయి. తిరైరత్నం విద్యార్థులతో వచ్చేటప్పుడు ఆ చెట్టు మీదున్న కోతులను గుర్తించలేకపోయారు. ఆకారం నల్లగా కనపడగానే అది దయ్యమే అనుకొన్నారు. మామిడి పండు క్రింద పడితే భయపడ్డారు. అది ఆ దయ్యం పనే అనుకొన్నారు".

"ఆ రణవక్కేకి కూడా అలాగే జరిగిందంటారా?" అడిగాడు కోషే

"అవును సార్! అతనితో వచ్చిన స్నేహితుడు కుక్కగా మారాడనడం అతని భ్రాంతి. అలాగే అప్పటికే అతడు విన్న దయ్యాల కథల వల్ల, మనసంతా భయంతో వున్నందువల్ల కుక్కను కూడా దయ్యమనుకున్నాడు. నా భార్య అక్కా సంగతే చూడండి. ఆమెకు ఇలాంటివన్నీ అబద్ధమని తెలిసినా, ఆమె అంతశ్చేతనలో(sub-conscious mind) గూడుకట్టుకున్న భయం వల్లనే నల్లకారును ఏనుగనుకొంది. అలాగే, ఆమె చెప్పినదే నాపై ప్రభావం చూపి, నన్నూ ఆ భ్రాంతిలో పడేలా చేసింది. డ్రైవర్ కారు తలుపు తెరవగానే, ఏనుగు చెవి కదులుతుందనుకోవడం ఆ భ్రాంతి వల్లనే. డ్రైవర్ నిద్రపోతూ గురక పెడుతుంటే అది ఏనుగు మూలుగు అనుకోవడం కూడా అందువల్లే. డ్రైవర్ దగ్గరకు వస్తుంటే మావటివాడనుకున్నాం కూడా ".

ఈ మాటలనగానే స్టాఫ్‌రూం అంతా నవ్వులతో నిండిపోయింది.

"ఇంకో విషయం చెప్పనా?"

అందరూ నవ్వుల్ని ఆపి, కోవూర్ వైపే విప్పారిన ముఖాలతో చూశారు.

"అందరిలాగే నేను, నా భార్య కూడా కారుని చూసి ఏనుగని భయపడి పారిపోయి వుంటే, ఆ దయ్యాల మామిడిచెట్టుకు మా కథ కూడా ఒక కాయలా వేలాడుతుండేది".

కోవూర్ ఈ మాట పూర్తిచేశాడో లేదో, మరోసారి పెద్దగా నవ్వులు ఆ స్టాఫ్‌రూం నిండా మార్మోగాయి.

●

# కన్నవారి కోసం

ట్రింగ్....ట్రింగ్......ట్రింగ్......ట్రింగ్.........

ఆగకుండా మోగుతున్నఫోనువైపు కాస్త ఇబ్బందిగా చూశాడు కోవూర్, ఆసక్తికరంగా చదువుతున్న పుస్తకాన్ని టేబుల్ పైన వుంచి ఫోను వైపు చూశాడు.

'హలో! నేను డాక్టర్ ఎ.టి.కోవూర్ని మాట్లాడుతున్నాను'

'నమస్కారమండీ' అవతలి వైపునుంచీ గాబరాగా మాట్లాడే ఒక మగగొంతు.

'ఆ నమస్తే, ఎవరు మీరు?'

'నా పేరు మెహ్రా సార్! బట్టల వ్యాపారిని...!'

'ఓకే.. నాతో ఏం పని?'

'మా ఇంట్లో డబ్బులు కనిపించకుండా పోతున్నాయ్ సార్!'

'అలాగా, పోలీసులకు చెప్పండి, నాకెందుకు?'

'ఎవరో దొంగలు దోచుకుంటే అలాగే చేసేవాణ్ణి'

'మరెవరు తీస్తున్నారు?'

'ఏవో దుష్టశక్తులు, దయ్యాలు చేస్తున్నాయని నా నమ్మకం సార్!' వాటికి డబ్బులతో పనేంటి! కోవూర్ తనలో తాను నవ్వుకున్నాడు. 'నేను దుష్టశక్తుల్ని, దయ్యాల్ని పట్టుకునే పోలీసునని మీకు ఎవరు చెప్పారు?' నవ్వుతూ అడిగాడు కోవూర్.

'మా అంకుల్ చెప్పారు సార్! మీరు అనుమతిస్తే మీ దగ్గరకి వచ్చి అన్నీ చెప్పాలనుకుంటున్నాను'.

కోవూర్ ఒక్క నిమిషం గోడకు వేలాడే క్యాలండర్ చూశాడు. అది 1966వ సంవత్సరం నవంబర్ 26వ తేది. ఆ రోజు తనకేమీ బయటకు వెళ్ళే పనిలేదు.

'సరే వెంటనే రండి' అంటూ ఫోన్ పెట్టేశాడు.

సరిగ్గా 40 నిమిషాలు గడిచాయి.

కోవూర్ ఇంటి ముందు ఆగిన కారు లోంచి ఇద్దరు వ్యక్తులు దిగి లోపలికి వచ్చారు. 'నేను మెహ్రానండీ, ఈయనే మీ గురించి నాకు చెప్పిన మా అంకుల్'. పరిచయాలు అయ్యాయి.

మెహ్రా తన గతంలోకి వెళ్ళాడు.



***

మెహ్రా ఒక పాకిస్తానీ, బట్టల వ్యాపారం కోసం శ్రీలంక వచ్చాడు. వయస్సు 33. ఒకటిన్నర సంవత్సరాల నుంచీ ఇంట్లో దాచుకున్న తన డబ్బు మాయమవుతోంది. 300 నుంచి 3000 దాకా. ఒక్కో రోజు  ఒక్కో మొత్తంలో...

ఎవరో చెబితే ఒక మంత్రగాడిని కలిసాడు. ఆ మంత్రగాడు ఏవేవో పూజలు చేశాడు. మంత్రాలు చదివాడు. మెహ్రాకి వ్యాపారంలో పోటీగా వున్నవారే అతనికి కీడు చేయిస్తున్నారని చెప్పి, ఒక దారాన్ని మంత్రించి అతని చేతికి కట్టాడు. ఇక అంతా బాగుంటుందని చెప్పి మెహ్రా నుంచి 300రూపాయిలు తీసుకున్నాడు.

మూడు నెలలు గడిచాయి. డబ్బు పోవడం లేదని సంతోషించాడు. కానీ అదెంతో కాలం నిలువలేదు. నాల్గోనెల మొదట్లోనే 250/- రూపాయిలు పోయాయి.

కానీ తర్వాత అతని భార్య తన వజ్రాల నగ కన్పించడంలేదంది. దాని వెల అప్పట్లో మూడువేలు.

మెహ్రా తన చేతికికట్టిన దారం వైపు చూశాడు. దీని మహిమిప్పుడేమయింది? దాన్ని కట్టిన మంత్రగాడిపై నమ్మకం చెదిరింది.

తన 'వ్యాపార శత్రువుల' పనే అయివుంటుందన్న నమ్మకం మాత్రం తొలగలేదు. 'అంబలంగోడ' పట్నంలో వున్న మరో మంత్రగాడ్ని సంప్రదించాడు.

మంత్రగాళ్ళ ప్రపంచానికి ఆయన రారాజని మిత్రులు చెపితే వెళ్ళాడు. ఆయన మెహ్రా చెప్పిందంతా విన్నాడు. 'వ్యాపార శత్రువులు' చేసింది కాదని, ఒక దుష్ట ఆత్మ ఆవహించిందని చెప్పాడు. ఆ ఆత్మ బతికివున్న రోజుల్లో తన అప్పుల్ని వసూలు చేసుకోలేకపోయిందని, ఇప్పుడీ విధంగా తన అప్పుల్ని గుంజుకుంటున్నదని చెప్పాడు.

'దాన్ని వదిలించుకోవడం ఎలా?'

మెహ్రా ప్రశ్నకు మంత్రగాడు జవాబును సిద్ధంగా వుంచుకున్నాడు. తాను స్వయంగా ఇంటికి వచ్చి పూజ చేస్తానన్నాడు. ఒకరోజు వచ్చి విడుపుపూజ నిర్వహించాడు. మెహ్రా ఉంటున్న కాలనీలో ఎవరూ ఎప్పుడూ చూడనంత ఖర్చుతో జరిగింది. ఒక గదిలో ప్రతిరోజూ దుష్టాత్మకు ఆహారం వుంచమని మంత్రగాడు సలహా ఇచ్చి వెళ్ళిపోయాడు.

మెహ్రాకు కొంత ధైర్యం వచ్చింది. మనసు కుదుటపడింది. అయితే ఒక అనుమానం మాత్రం వీడలేదు. ఆవహించిన దుష్టాత్మ తనకు దూరపు బంధువని మంత్రగాడు చెప్పాడు. తన వ్యాపార శత్రువులు పంపిన దుష్టాత్మ ఎందుకు కాకూడదు? గదిలో రోజూ తిండి పెడుతూ వుంటే అది తనని విడిచిపెడుతుందా?

ఆయన అనుమానానికి బలమిస్తూ ఒక రోజున ఆయన భార్య హఠాత్తుగా మూర్ఛతో కిందపడిపోయింది. నీళ్ళు కొట్టి, లేపి కూర్చోబెట్టాడు. తనకు ఎప్పుడూ ఇలా జరగలేదని ఆమె బాధపడుతుంటే మెహ్రా ప్రేమతో ఓదార్చాడు.

కానీ అలాంటి మూర్ఛలు అప్పుడప్పుడూ వస్తున్నాయి. వారిద్దరిలో భయంగా మరో అనుమానం మొలకెత్తింది. ఈ పని కూడా దుష్టాత్మ చేస్తుందా? లేదా? కొన్నాళ్ళకు ఇంట్లో మరికొన్ని వింతలు కన్పించసాగాయి. ఇంటి గది మూలల్లో అప్పుడప్పుడూ ఎముకల ముక్కలతో నిండిన సిగిరెట్ డబ్బాలు, వెంట్రుకలు, మంత్రించిన నిమ్మకాయలు, రాగినాణాలు.. ఇలా ఎప్పుడూ ఏదో ఒకటి మెహ్రాలో భయాల్ని పెంచుతూనే వున్నాయి.

ఒకరోజు మెహ్రా కోటు తొడుగుకున్నాడు. జేబులో చేయి పెడితే ఒక కాగితం అందింది. ఏమిటా అని ఆశ్చర్యపడుతూ తీసి చూశాడు. అదో ప్రేమలేఖ.

"ప్రియమైన మెహ్రా! నీవేమీ భయపడవద్దు... నేను నీకోసం ఏమైనా చేస్తాను... జూన్ 14ను మరవద్దు. ప్రతి రాత్రి నువ్వు తప్పక రావాలి.... నీ భార్యకు చెప్పవద్దు..... మనం విమానంలో వెళ్ళిపోదాం.... ప్రియ మెహ్రా! నీకు నా ముద్దులు... నువ్వు రాత్రి వచ్చి వున్నంత వరకు సంతోషంగా వున్నాను... ఉత్తరంలో నాపేరు రాయవద్దు.... నువ్వు పాడడం నాకెంతో ఇష్టం.... రేపు రాత్రికి మళ్ళీ రా... ఇట్లు మెహ్రా, శారీ...

మెహ్రాకు తలతిరిగినంత పనైంది. ఆ ఉత్తరం ఏమిటి? ఎవరు రాశారు? తన జేబులోకి అదెలా వచ్చింది? ఏమీ అర్థంకాలేదు. చింపి పారేశాడు.

కానీమళ్ళీ ఒక రోజు అలాంటిదే కన్పించింది. ఈసారి చింపలేదు, దాచాడు. అలా మొత్తం 11 ఉత్తరాలు వచ్చాయి. 10 ఇంగ్లీష్‌లో వుంటే ఒకటి మాత్రం తమిళంలో వుంది.

ఈ ప్రేమలేఖలు కూడా ఆ దుష్టాత్మ పనేనా? అది మగదని చెప్పాడే మంత్రగాడు? వీటిని రాసింది ఆడదిలా వుందే. దుష్టాత్మకు ఈ 'లింగమార్పిడి' ఎలా జరిగింది? ఒకవేళ తన వ్యాపార శత్రువులు మరో కొత్త ఎత్తుగడకు పాల్పడుతున్నారా?

ఈ అనుమానాలతో మెహ్రా మళ్ళీ ఒక కొత్త మంత్రగాణ్ణి ఆశ్రయించాడు. ఆ మంత్రగాడు ఇంటికి వచ్చి అందరికీ తాయెత్తులు కట్టాడు. మొత్తం పదముగ్గురున్నారు. మెహ్రా, అతని భార్య, అత్త, నల్గురు బావమరుదులు, నల్గురు మరదళ్ళు, కొడుకులు ఇద్దరు.

అయినా పరిస్థితిలో మార్పులేదు. మెహ్రా భార్య ఫిట్స్‌తో మూర్ఛపడుతూనే వుంది. దుష్టాత్మ ఆమెను పూర్తిగా లోబర్చుకున్నట్లు ఎక్కువసార్లు ఆమెకు మూర్ఛలు వస్తున్నాయి. ఆమెను చూస్తే జాలేస్తోంది.

ఎలాగైనా ఆమెను మామూలు మనిషిని చేయాలనుకున్నాడు మెహ్రా. బంధువుల్లో అవమానంగా వుంది.

వెంటనే మళ్ళీ ఒక మంత్రగాడ్ని పిలుచుకు వచ్చాడు. అతనక్కడ చేయవలసినవన్నీ చేసి చివరగా ఒక మాట చెప్పాడు. కుటుంబ సభ్యుల్లో ఒకరికి అద్భుతమైన కల వస్తుందని, ఆ కలలో సమస్యకు పరిష్కారం దొరుకుతుందని, దానిని ముందుగా తాను చెప్పకూడదని అన్నాడు.

నెలలు గడుస్తున్నా, అటువంటి కల ఎవరికీ రాలేదు. డబ్బు మాయమవుతూనే వుంది. ప్రేమలేఖలు వస్తూనే వున్నాయి. ఫిట్స్ ఆగిపోలేదు., ఏవో వింతలు, భయాలు ఇంట్లో కన్పిస్తూనే వున్నాయి.

ఒకరోజు మెహ్రా అత్త తనకి ఒక కల వచ్చిందని చెప్పింది. బలమైన వస్తాదుల్లాంటి వాళ్లు ఇద్దరు పెద్దవాళ్ళు, ఒక బాలుడు కలలో కన్పించారట, వాళ్ళు చాలా వేగంగా ఇంట్లోకి వచ్చారట. మెహ్రా అడ్డుకుని కోట్లాడాడు. అత్త, అల్లుని ప్రక్కకు లాగి వారిని లోనికి పోనిచ్చిందట. వాళ్ళకు కావలసినవి తీసుకుపొమ్మందట!

ఈ కల గురించి విన్న మెహ్రా వెంటనే ఆ మంత్రగాడిని పిలిపించి చెప్పాడు. ఆయన ఆ వ్యక్తుల గురించి ఏవేవో కల్పించి చెప్పాడు. నిమ్మకాయలను మంత్రించి కోసి, ఆ రసాన్ని ఇల్లంతా చల్లాడు. ఇక ఏ బాధలు వుండవని చెప్పి వెళ్ళిపోయాడు.

అయినా పరిస్థితులేవీ మారలేదు.

ఈసారి మెహ్రా అంజనం వేసి చూపించే ఒక 'అంజన్న'ను ఆశ్రయించాడు. ఆ అంజన్న తనకొక గది కావాలన్నాడు. గది మధ్యలో ఒక కొవ్వొత్తిని వెలిగించాడు. పన్నెండేళ్ళ మెహ్రా మరదల్ని దాని ముందు కూర్చోబెట్టి కొవ్వత్తి మంటనే చూస్తూ వుండమన్నాడు. ఆ మంటలు రెండుగా కనిపించాక చెప్పమన్నాడు. కొంతసేపటికి ఆ పాప కనిపిస్తున్నా యంది. అయితే పదిమంటలు కన్పించేదాక అలాగే చూడమన్నాడు. కొంతసేపటికి అలాగే కన్పిస్తున్నాయన్నదామె. చూసే వారికి మంత్రగాడిపై నమ్మకం కుదిరింది. అంతా నిశ్శబ్దంగా వున్నారు. వింతగా చూస్తున్నారు.

'అమ్మాయి! అలాగే చూస్తూవుండు, చనిపోయిన మీ తాత ముఖం ఆ మంటల్లో కన్పిస్తుంది. కొంతసేపటికి నాకు తాత కన్పిస్తున్నాడని చెప్పింది. 'అయితే మీ తాతను అడుగు ఈ ఇంటిలోని పీడలకు ఎవరు కారణమని?' అన్నాడు అంజన్న. తనకు ఇద్దరు బలమైన మనుషులు, ఒక బాలుడు కన్పిస్తున్నాడంది ఆ అమ్మాయి. వాళ్ళు ఇంట్లోకి దూసుకొస్తున్నారని కూడా అంది.

ఆ అమ్మాయి చెప్పింది అత్త చెప్పిందీ ఒకటే కనుక మెహ్రాకు నమ్మకం కుదిరింది. ఇంట్లోకి దూసుకువచ్చే ఆ మనుషులు శత్రువులు పంపిన వారేనని, వారిని తొలిగించుకునే పూజలు చేయాలన్న అంజన్న మాటలకు తలాడించాడు.

ఇలాంటి పూజలకు ఇప్పటికే 15000 తగలేశాడు. నెలకు సుమారు 900 అన్నమాట.

ఆ రోజు నవంబర్ 25వ తేది. మెహ్రా ఉదయాన్నే షాపుకు వెళ్ళాడు. అతని భార్య స్నానం చేద్దామని బాత్‌రూమ్‌కెళ్ళింది. మళ్ళీ బట్టలకోసం బీరువా దగ్గరకొచ్చి తెరిచింది. కనిపించిన దృశ్యాలకి ఆమె భయంతో వణికిపోయింది. కెవ్వున అరిచింది. ఏడ్పుమొదలయ్యింది. ఇంట్లోని తల్లి, సోదరులు, పొరుగువారు పరిగెత్తుకు వచ్చారు. అంతా బీరువాలోకి చూశారు.

లోపలినుండి దట్టంగా పొగ వస్తోంది. బట్టల్ని, వస్తువుల్ని లాగి పడేశారు. ఆమె బట్టలన్నీ కాలిపోయాయి. నైలాను, కాశ్మీరి సిల్కు, పట్టుచీరలన్నీ కాలి నల్లని రబ్బరు ముద్దలయ్యాయి.

ఇదీ ఆ దుష్టశక్తుల పనేనని అంతా తీర్మానించారు. వెంటనే మెహ్రాకి కబురువెళ్ళింది. ఆయన కూడా ఆందోళనతో వెనక్కి తిరిగి వచ్చాడు. అంతా చూసి భారంగా తలపట్టు కున్నాడు. ఈ పీడకు విరుగుడు ఏమిటో అంతు పట్టడం లేదు, ఎన్ని పూజలు చేశాడు. ఎంత ఖర్చు చేశాడు? ఏమయినాయవన్నీ?తన జీవితం తనకే అసహ్యమనిపిస్తోంది.

సరిగ్గా ఈ స్థితిలో మెహ్రా అంకుల్ రంగప్రవేశం చేశాడు. ఒకటిన్నర సంవత్సరాల నుంచి ఆ ఇంట్లో జరుగుతున్నవేవీ అతనికి దృష్టికి రాలేదు. చూసిపోదామని ఇప్పుడు చుట్టంగా వచ్చాడు. విషయమంతా తనకెందుకు చెప్పలేదని మెహ్రాకు చీవాట్లు పెట్టాడు. ఇక నుంచి ఈ వ్యవహారంలో తాను చెప్పినట్లు వినాలని, తేలిగ్గా బాధ తొలుగుతుందని ధైర్యం చెప్పాడు.

మెహ్రాకు నమ్మకం కలుగలేదు. అయినా అంగీకరించాడు. అంకుల్‌కు ఎ.టి.కోవూర్ గురించి, ఆయన సత్యశోధన గురించి బాగా తెలుసు. దుష్టశక్తులు, దయ్యాల పట్ల ఆయనకున్న నమ్మకం కోవూర్ గురించి తెలుసుకున్నాక తొలిగిపోయింది.

కోవూర్ ఫోన్ నెంబర్ చెప్పి మెహ్రాను ఫోన్ చెయ్యమన్నాడు. కోవూర్ అనుమతి దొరికింది. ఇద్దరూ కారులో కోవూర్ ఇంటికి చేరుకున్నారు.

***

మెహ్రా చెప్పిందంతా కోవూర్ శ్రద్ధగా విన్నాడు. ఆయన పరిస్థితికి జాలేసింది. తన సత్యశోధనతో అతని కష్టాలు కడతేర్చాలని నిశ్చయించుకున్నాడు. ముగ్గురూ కలిసి మెహ్రా ఇంటికి చేరారు

అప్పటికి జనం పలుచబడ్డారు. కోవూర్‌ని చూడగానే అందరి దృష్టి అతనిపై పడింది. ఆయన గురించి తెలిసీ తెలియని కథనాలు చెప్పుకోసాగారు.

కోవూర్ తన హేతువాద పరిశోధన ప్రారంభించాడు. కుటుంబ సభ్యుల్ని, సంఘటనలో పాలుపంచుకున్నవారిని వ్యక్తిగతంగా ప్రశ్నించడం, వారి అపోహల్ని తొలిగించడం, వారి చర్యల్ని, అనుభవాల్ని వెలికితీసి వారి ఆలోచనలను గుర్తించి నేరస్థుల్ని పట్టుకోవడం అతని పరిశోధనలో భాగాలు.

అక్కడున్న 15మందిలో నలుగుర్ని ఎంచుకున్నాడు. మెహ్రా అత్త, భార్య, ఆమె నలుగురు సోదరుల్లో ఇద్దరు.

ఆ నలుగుర్ని ఒక గదిలోకి విడిగా పిలిచి, కాగితం ఇచ్చి తను చెప్పిన ఇంగ్లీష్ మాటల్ని రాయమన్నాడు. ప్రాథమిక పాఠశాలల్లో పిల్లలకు డిక్టేషన్ చెప్పినట్లు చెప్పాడు. తాను అప్పటికే చదివిన ప్రేమలేఖలోని విషయాలే ఆ డిక్టేషన్‌లో వున్నాయి.

అదయ్యాక కాగితాలను పరిశీలించి వాటిలో మూడింటిని పక్కన పడేశాడు. మిగిలిన ఒక్క కాగితంలో ఒక ముఖ్యమైన ఆధారం దొరికినట్లయ్యింది. ఆ ఆధారం కూడా ఒకే ఒక్క పదంలో వుంది. ఆ పదం ప్రేమలేఖలో వుంది. ఆ పదాన్ని అలాగే రాసిన కాగితం కోవూర్ చేతిలో వుంది. ముద్దాయిని పసిగట్టే ఆధారం అది.

అయితే ఆ ఒక్క ఆధారం చాలదు కదా! కోవూర్ మళ్ళీ ప్రేమలేఖలోని అంశాలను ఫైల్లోంచి తీసి చదివాడు. వచ్చిన ఊహలతో ముద్దాయిని గుర్తించే ప్రయత్నం చేశాడు. లాభం లేకపోయింది.

తాను మళ్ళీ వస్తానని చెప్పి ఇంటికి వెళ్ళాడు. రాత్రి గం.9.15ని.లకు తిరిగి మెహ్రా ఇంటికి వచ్చాడు. మామ, అల్లుళ్ళను మాత్రం ఒకగదిలోకి పిలిచి తలుపులు వేశాడు.

'మిస్టర్ మెహ్రా! మీఇంట్లో జరిగే వింతలకు, పీడలకు కారకులైన వారిని గుర్తించాను' అన్నాడు కోవూర్. ఆసక్తితో వారిద్దరూ కోవూర్ ముఖంలోకి చూశారు. వారి మనసుల్లో చెప్పలేనంత ఆరాటం... టెన్షన్... ఆ ఆర్భాత...

'మీ ఇంట్లోనే వున్న ఆ వ్యక్తి మిసెస్ మెహ్రా!' కోవూర్ నోటి నుంచి వచ్చిన ఈ మాటలను మెహ్రా నమ్మలేకపోయాడు.

"నో సార్! నో...నేను నమ్మలేకపోతున్నాను. నా భార్యకు ఇదంతా చేయాల్సిన పనిలేదు. మీ అంచనా తప్పు" అని గట్టిగా వాదించాడు. అవును, ఏ భర్త అయినా ఇలాంటి స్థితిలో అలాగే అంటాడు.

ఇంటికి దీపంగా వుంటూ, అన్ని పనులనూ చక్కదిద్దుతూ, తనను ఎంతగానో ప్రేమిస్తూ, వినయంతో అణుకువతో వుంటూ, తన కంటికి నచ్చే అందంతో, యవ్వనంతో తనను మైమరపించే తన భార్య తన ఇంట్లో ఇలా చేస్తుందంటే, తనకింత ఆందోళనను, దు:ఖాన్ని కలిగిస్తుందంటే ఏ భర్త అయినా ఎలా నమ్ముతాడు?

మెహ్రా చాలా అసహనంగా మాట్లాడినా కోవూర్ మొహంపై చిరునవ్వు చెదరలేదు. ఇలా జరుగుతుందని ఆయనకు ముందే తెలుసు.

"ఒరేయ్ మూర్ఖుడా! ఏం మాట్లాడుతున్నావ్? డాక్టర్ కోవూర్‌తోనేనా నువ్వు మాట్లాడేది? ఆయన అంచనా తప్పనటానికి నీకేం ఆధారం వుంది? నీ భార్య ఇవన్నీ చేస్తుందని ఆయన అనడానికి తగిన ఆధారాలు వుండే వుంటాయి. వాటిని అడగాలి గానీ, ఈ మూర్ఖత్వమేమిటి?" అని అల్లుణ్ణి మందలించాడు. "సారీ సార్! వాడు మూర్ఖుడు, వాడు ఇప్పటికే విసిగిపోయి వున్నాడు. ఏదేదో అంటున్నాడు. వాటిని దయచేసి పట్టించుకోకండి" అన్నాడు.

"ఓకే.. ఓకే... నాకు తెలుసు అతని బాధ" అన్నాడు కోవూర్.

'చెప్పండి సార్! ఇప్పుడు మేమేం చేయాలి?" అడిగాడు మెహ్రా అంకుల్.

"రెండు రోజుల్లో మెహ్రా, మీరు, అతని భార్య ముగ్గురూ మా ఇంటికి రండి. హిప్నాటిజం ద్వారా మరిన్ని విషయాలు తెలుసుకోవాలి. అప్పుడే మీకు అన్ని వివరాలు చెబుతాను" అని కుర్చీలోంచి లేచాడు కోవూర్.

అనుకున్న సమయానికి ముగ్గురూ కోవూర్ ఇంట్లో ప్రవేశించారు. మెహ్రాను అతని అంకుల్‌ని హాల్లోనే వుంచి మెహ్రా భార్యను మేడపై గదిలోకి తీసుకెళ్ళాడు కోవూర్.

కోవూర్ భార్య 'అక్కా' కూడా ఆమెను అనుసరించింది.

మిసెస్ మెహ్రాను హిప్నాటిక్ నిద్రలోకి పంపించాడు. గాఢనిద్రలోకి వెళ్ళిన తర్వాత ప్రశ్నించసాగాడు. వరద వచ్చినప్పుడు గేట్లు తెరిస్తే నీళ్ళు ఎలా దూకుతాయో అలా కోవూర్ ప్రశ్నలన్నింటికీ వెనువెంటనే జవాబులు వస్తున్నాయి. ఇంటి గది మూలలో ఎముకల ముక్కలను వేసిందీ, తాయెత్తులను తెంపి వేసింది ఆమేనట! బీరువాలోని బట్టలకు నిప్పు పెట్టింది కూడా ఆమేనట! ఆ ఇంట్లో జరిగిన ప్రతిదానికి ఆమే కారణమని తెలిసింది.

అన్నింటిని రాబట్టాక, కోవూర్ ఆమెకు కొన్ని సూచనలు, సలహాలు ఇచ్చాడు. ఇంట్లో ఇక ముందు అలాంటివి ఎందుకు చేయరాదో చెప్పాడు. సంసారంలో భర్తతో ఎలా వుండాలో సూచించాడు.

ఆమెను నిద్రనుంచి లేపడానికి కోవూర్ ఇచ్చే సూచనలు పనిచేయలేదు. 'అక్కా' ఆందోళన పడింది. కోవూర్ ఆమెకు భయంలేదని చెప్పాడు. మిసెస్ మెహ్రా ఇప్పుడు సుఖమైన నిద్రలో వుందని, తన ఆందోళనలను తొలిగించుకుని, మనసును తేలికపరుచుకుందని, మరో రెండుగంటలు ఆమెనలా నిద్రపోనిస్తే ఆమె లేచి వస్తుందని కోవూర్ వివరించాడు. ఇద్దరూ మెట్లుదిగి మామా అల్లుళ్ళ దగ్గరకు వచ్చారు.

"మిస్టర్ మెహ్రా! 'శారీ' అనే మహిళ మీకు తెలుసా?" అడిగాడు కోవూర్. మెహ్రా మొహంలో ఆందోళన కదలాడింది. అయినా 'తెలుసు సార్' అన్నాడు.

'ఆమెను గురించి మీకేం తెలుసో అంతా చెప్పండి, ఏదీ దాచవద్దు' అన్నాడు కోవూర్.

చెప్పడానికి కొంత తటపటాయించాడు మెహ్రా!

"శారీ ఒక పాకిస్తానీ డాన్సర్ సార్! ప్రదర్శన కోసం ఒకసారి శ్రీలంక వచ్చింది. ఆమె చేసిన నాట్యానికి ప్రేక్షకులు ముగ్ధులయ్యారు. అప్పుడే ఆమె అంటే నాకిష్టం ఏర్పడింది. మా ఇంటికి డిన్నర్‌కి కూడా పిలిచాను. అప్పుడు ఆమె పట్ల చాలా చనువుగా ప్రవర్తించాను".

మెహ్రాకు ఇతర స్త్రీలపట్ల వ్యామోహం వుండే వుంటుందన్న కోవూర్ అనుమానానికి ఒకింత ఆధారం దొరికింది.

"ఆమె శ్రీలంక నుంచి ఎప్పుడు ఊరెళ్ళింది" అడిగాడు కోవూర్.

"జూన్ 14న విమానంలో" అన్నాడు మెహ్రా.

కోవూర్‌కు ప్రేమలేఖల్లోని వివరాలు అర్థం అయ్యాయి. ఆ లేఖలు రాసింది కూడా మెహ్రా భార్యేనని నిర్ధారించుకున్నాడు. ఆమె కూడా శారీ అందాన్ని మెచ్చుకుంది. కాని

తన భర్తతో చనువుగా వుండడాన్ని మాత్రం అసహ్యించుకుంది. ఆ అందం తనకు లేదని బాధపడింది. ఒకే క్షణంలో శారీ పట్ల అభిమానాన్ని, అసహనాన్ని లేఖల్లో ప్రదర్శించడానికి కారణం ఇదే.

కోవూర్ మౌనాన్ని భగ్నపరుస్తూ మెహ్రా అడిగాడు.

"సార్! నా భార్య ఇదంతా ఎందుకు చేసింది? నాకింకా అర్థం కావడం లేదు. చెప్పండి, ప్లీజ్".

కోవూర్ వివరంగా చెప్పారు. 'మిస్టర్ మెహ్రా! మీరు నాకు మీ అంకుల్ ముందు ఒక మాట ఇవ్వాలి. మీ భార్య గురించి నేనేం చెప్పినా, అది విన్న తర్వాత కూడా ఆమె పట్ల మీకున్న ప్రేమ, బాధ్యత చెదిరిపోకుండా వుండాలి, సరేనా?'

'సరే సార్! మీ ఇద్దరికీ మాటిస్తున్నాను' చేయి ముందుకు చాచాడు మెహ్రా.

"మెహ్రా! మీ భార్యకు మీరంటే చాలా ప్రేమ, గౌరవం ఉన్నాయి. అలాగే కొంత భయం వుంది. తన తల్లి, సోదరీసోదరులు మీమీద ఆధారపడి బతుకుతున్నారు. ఏదో ఒకరోజు మీరు వాళ్ళను బయటకు పంపితే వాళ్ళెలా బతకాలి? ఇది తలచుకుని ఆమె ఆందోళన పడుతోంది. వారంటే ఆమెకు ఇష్టం. వారిపై జాలి కూడా. వాళ్ళకి అవసరమైన బట్టలు, తిండి, చదువులు – వీటి ఖర్చులకు మిమ్మల్ని నేరుగా డబ్బు అడగలేకపోతోంది. అడిగితే ఆమెపై మీకు ఇష్టం తగ్గిపోయి గొడవపడతారని భయపడుతోంది. మీరు ఆమెను పెళ్ళాడేటప్పుడు ఆమె బాధ్యతను తీసుకుంటానని వుంటారు. ఇంట్లో అప్పుడప్పుడూ వాళ్ళపై చిరాకు, చిరుకోపాన్ని ప్రదర్శించడం మీభార్యకు ఆందోళన పెంచింది. వారి భవిష్యత్తును తలచుకుని భయపడింది. దాంతో ఆమెలో ఘర్షణ మొదలైంది. అటు భర్త... ఇటు తన తల్లి, సోదరీ సోదరులు.

వారి అవసరాల కోసం తెలియకుండా డబ్బులు తీయసాగింది. తను తప్పు చేస్తున్నానని మరో ప్రక్క బాధపడేది. అటు అవసరాలు, ఇటు తప్పుచేస్తున్న భావాలు... ఈ రెండింటిపై తీవ్రంగా ఆలోచిస్తూ అపస్మారక స్థితిలోకి వెళ్ళసాగింది. అవే మూర్ఛలని మీరనుకున్నారు.

కాలం గడుస్తున్న కొద్దీ తాను చేసే తప్పులకు అలవాటు పడింది. ఫిట్స్, ముఖంలో నవ్వులేని వెల్లదనం అలవాటైపోయాయి. మరో బలమైన పరిష్కారం కోసం ఆమె మనస్సు వెతికింది. మీపై అపనమ్మకం పెరిగింది. ఆమె మనసులోని అచేతనం పై చేతనం ఎదురు తిరిగింది. దాని ఫలితంగా తనను 'శారీ'గా ఊహించుకుని ప్రేమలేఖలు రాసింది. అచేతనంలో 'శారీ'గా ఊహించుకుంటే, చేతనం దాన్ని వ్యతిరేకించింది. ఫలితంగా, ఆమె రాసిన లేఖల్లో పొగడ్తలు, తెగడ్తలు కూడా చోటుచేసుకున్నాయి. దీనిని ఇతర విషయాల్లో కూడా ప్రదర్శించింది. 'శారీ'పట్ల ద్వేషం కలిగినప్పుడు తాయెత్తులను గది మూలలో

విసిరేది. ఎముకల్ని ముక్కలు ముక్కలు చేసి డబ్బాలలో దాచేది. చీరలు తగలబెట్టింది కూడా అందుకే"

మెహ్రా, అతని అంకుల్ కోవూర్ మాటల్ని శ్రద్ధగా వింటున్నారు. కోవూర్ మాటలకి అడ్డుతగులుతూ 'మరి అప్పుడప్పుడూ ఇంట్లో ఏమీ జరగకుండా వుండడానికి మంత్రగాళ్ళ ప్రభావం లేదంటారా?' అన్నాడు ఆసక్తిగా మెహ్రా.

"మంత్రాలు, మంత్రగాళ్ళ తంతులు అవన్నీ వట్టివే. పొట్టకూటి కోసం చేసే పనులు అవన్నీ. అయితే మీ భార్యకు కూడా అవంటే నమ్మకం. అందువల్లనే మంత్రగాళ్ళు వచ్చి పూజలు చేసి వెళ్ళాక వాటి ప్రభావం తనపై వుంటుందేమోనని భయపడి వేచిచూసేది. తర్వాత, తనవారి అవసరాలు తరుముకొస్తుంటే మళ్ళీ డబ్బులు తీయడం వంటివి చేసేది. మీ భార్య చేసే అనేక పనులు ఆమెకు తెలిసి చేసినవి కావు. ఆమె అచేతనలో కలిగే వత్తిడి వల్ల చేసినవే".

మెహ్రాకు జ్ఞానోదయం కలిగినట్లయ్యింది. "ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు సార్!" అని అడిగాడు.

మరికొద్దిసేపట్లో మీ భార్య కిందకి దిగి వస్తుంది. ఆమెకు ఇవన్నీ చెప్పవద్దు. నేను కొన్ని సూచనలిచ్చాను. వాటితో ఆమె ప్రవర్తన మారుతుంది. మీకు ఇక ఇబ్బందులు కలిగించదు. అయితే మీరు కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. ఒకటి– మీకు పరస్త్రీల పట్ల ఇంకా వ్యామోహం వుంటే వెంటనే విడిచిపెట్టండి. భార్య పట్ల ఇంతకు ముందు కంటే ఎక్కువ చనువుగా, ఆదరంగా వుండండి. రెండవది – వ్యాపారంలో తలమునకలైనా, అప్పుడప్పుడూ ఆమెతో కలసి విహారాలకు వెళుతూ వుండండి. మీ పట్ల నమ్మకం, గౌరవం పెరుగుతాయి. మూడవది – మీ అత్త, వారి పిల్లల పట్ల చిరాకు, కోపం ప్రదర్శించకండి. నెమ్మదిగా వారికొక దారిచూపే ప్రయత్నం చేయండి. మీ అత్తగారికి ఆమె చేయగలిగే పనిని చూపించండి., మీ బావమరుదులకు పని కల్పించడం వంటివి చేస్తే వారి పోషణ వారే చూసుకుంటారు. మీ మరదళ్ళ పెళ్ళి విషయంలో మీ వంతు సాయం మీరు చేయడానికి ముందే వారికి మాటివ్వండి. మీ వైఖరిలోని మార్పును చూస్తే మీ భార్య ఎప్పటికీ మళ్ళీ ఇలాంటి వాటికి పాల్పడదు. మీ సుఖసంసారానికి, ప్రశాంతతలకు ఇదే సరైన మార్గం"

మెహ్రా ముఖంలో ఇప్పుడు పట్టలేనంత సంతోషం, వర్ణించలేనంత తృప్తి వెలుగుతున్నాయి. అంకుల్ కూడా కోవూర్ పట్ల ఆరాధనగా చూస్తున్నాడు.

పైన తలుపు తెరిచిన చప్పుడైంది. అక్కా లేచి పైకి వెళ్ళింది. మిసెస్ మెహ్రా వచ్చి భర్త ప్రక్కన నిలబడింది. మెహ్రా చిరునవ్వుతో ఆహ్వానిస్తూ లేచి ఆప్యాయంగా ఆమె చేతిని అందుకున్నాడు.

# కఫన్

పన్నెండేళ్ళ నూనియా అంటే తల్లిదండ్రులకు ఎంతో ముద్దు. ఆమె అందం, తెలివి, ఆరోగ్యం చూసేవారికి ముచ్చటగొలుపుతాయి. తన హాస్యప్రవృత్తితో, చనువుతో స్కూల్లో స్నేహితుల్ని, టీచర్లనీ కూడా ఆకట్టుకొంది. ఆటపాటల్లో, చదువులో ఆమె ఎప్పుడూ వెనుకబడివుండదు. కనుక నూనియా అంటే అందరికీ ఓ ఆకర్షణ. వక్తృత్వంలో, గణితంలో ఆమె ఎప్పుడూ ఫస్టే.

కొలంబోలోని మెసెంజర్ వీధిలో వున్న నూనియా ఉండే ఇల్లు ఒక 'స్వీట్‌హోం'. 1964 జులై 31 తర్వాత మాత్రం ఆ పరిస్థితి మారింది. నూనియాలో వున్న ఆకర్షణ పూర్తిగా మారింది. గలగల నవ్వే ఆమె ముఖంలో ఎప్పుడూ బెదురు. చురుకుగా వుండే ఆమె కళ్ళల్లో దైన్యం చోటుచేసుకున్నాయి.

ప్రతిరోజూ చీకటి పడీపడగానే నూనియా మారిపోతుంది. చీకటిని చూస్తే పెద్దగా అరుస్తుంది - తనను తనే హింసించుకుంటూ అందరితో పోట్లాటకు దిగుతుంది. ఆమెను కంట్రోల్ చేయటం తల్లిదండ్రులకు కష్టమైపోతుంది. ఏదీ ఆమెను శాంతపరచలేదు. ఏమిటి, ఎందుకు అని ఎవరైనా అడిగితే - ఎవరో తనను గొంతు పిసికి చంపుతున్నారంటుంది. ఏవేవో అర్థంలేని మాటలు అంటుంది. ఒక్కోసారి మగతగా నిద్రలోకి జారుకొని, కొద్దినెలల క్రితమే మరణించిన తన చుట్టం వలె మాట్లాడుతుంది. ఎంతో సేపటికి గాని, మామూలు స్థితిలోకి రాదు.

ఇంట్లో అందరికీ నూనియాను చూస్తే చెప్పలేనంత వేదన. ఇది తెలిసిన కొందరు బంధువులు సానుభూతి చూపించటానికి వస్తున్నారు. కొందరు ఆ వింతను చూట్టానికి వస్తున్నారు. వచ్చిన వాళ్ళంతా తమకు తోచిన సలహాలిస్తున్నారు. మంత్రగాళ్ళ అడ్రసులు, నాటుమందుల అనుభవాలు చెబుతున్నారు. ముందుగా ఓ నాటువైద్యుడు నూనియా 'జబ్బు'ను తగ్గిస్తానని రంగప్రవేశం చేశాడు. అతడు మంత్రగాడు కూడా కావటం వల్ల,

ముందుగా ఏవేవో మంత్రాలు చదివి, నూనియా తలలో జుట్టును అయిదుచోట్ల ముడులు వేశాడు. ఒక తాయెత్తు తీసి నూనియా భుజానికి కట్టాడు. 'గాలి' వదిలిందని, మరేం ఫర్వాలేదని, తనకు రావాల్సింది పుచ్చుకొని వెళ్ళిపోయాడు.



రెండురోజుల తర్వాత నూనియా పరిస్థితి మళ్ళీ మొదటికొచ్చింది. ఇరుగూ పొరుగూ మాటలు విని ఓ మళయాళ ముస్లిం మాంత్రికుణ్ణి రప్పించారు నూనియా తల్లిదండ్రులు. అతగాడు ఖురాన్‌లోని అక్షరాలు కొన్నింటిని ఒక కాగితంపై వ్రాసి దాన్ని చుట్టి, ఓ తాయెత్తులో పెట్టి, నూనియా మెడలో కట్టాడు. దానిలో నీరుచేరకుండా చుట్టూ మైనంతో అతికాడు. తన 'ఫీజు'పుచ్చుకొని వెళ్ళిపోయాడు. కానీ నూనియాలో మార్పేమీ లేదు.

మూడోసారి కొలంబో నుంచి ఓ మాంత్రికుడు వచ్చాడు. ఇతడిదో విచిత్రవైద్యం. ఎండిన గాడిదపేడ తెప్పించాడు. ఓ పాత్రలో దానిని మండించి నూనియా చుట్టూ క్రిందనుంచి పైకి, పైనుంచి క్రిందకి త్రిప్పుతూ కొన్ని అరబిక్ మంత్రాలు చదివాడు. 'దయ్యం' వదిలిందని చెప్పి తన 'మామూలు' పుచ్చుకొని వెళ్ళిపోయాడు.

నూనియా పరిస్థితి మరింత ముదిరింది. చీకట్లోదేన్ని చూసినా విపరీతంగా వణికేది. బాత్‌రూంకి వెళ్ళాలంటే మరీ భయపడేది. ఊరు మారితే తీరుమారుతుందేమోనని నూనియాను మేనత్తవాళ్ళింటికి పంపారు. కొన్నాళ్ళ తర్వాత ఆమె కోరికతో మళ్ళీ కొలంబో తీసుకొచ్చారు.

అప్పట్నుంచి నూనియా ధోరణిలో విపరీత మార్పులు వచ్చాయి. చనిపోయిన తన చిన్నాన్న కూతురు తనను పిలుస్తోందని, తానూ ఆమె దగ్గరికి వెళ్తానని గోలపెడుతోంది. మరింత 'శక్తిగల' మాంత్రికుల కోసం వేట మొదలుపెట్టారు.

కొలంబో నుంచే వచ్చిన మాంత్రికుడు ఒక దారాన్ని మంత్రించి ఆమె మెడకి, చేతికి కట్టి వెళ్ళాడు. అయినా ఫలితం శూన్యం. మరో సింహళ మాంత్రికుడు నూనియాకు చేతబడి జరిగిందన్నాడు. నిమ్మకాయలు తెప్పించి వాటిని కోసి, అందులో నెత్తురు సృష్టించి, చేతబడి తగ్గిపోతుందని చెప్పాడు. చాలా ఖరీదైనతంతు జరిపించి తన 'దక్షిణ'పుచ్చుకొని ఉడాయించాడు.

ఇంకో ముస్లిం మాంత్రికుడు వచ్చి రెండ్రోజులు పూజలు చేసి తాయెత్తు ఒకటి ఇచ్చి రోజూ నూనియా తల దిండుకింద పెట్టాలని చెప్పి వెళ్ళిపోయాడు.

నూనియా తల్లిదండ్రులకు మానసిక వేదన భరింపరానిదయింది. ఆర్థిక నష్టమే కాదు, ఇరుగు పొరుగు సమాజంలో తమ పరపతి కూడా తగ్గిందని వారు వాపోయారు. ఓరోజు వారింటికి ఓ యువకుడు వచ్చి వారి పరిస్థితి విని డా॥కోవూర్‌ని గూర్చి చెప్పాడు. అతని సలహాతో నూనియాను తీసుకొని కోవూర్ ఇంటికి వెళ్ళారు.

కోవూర్ నూనియా కథంతా విన్నాడు. ముందు ఆమె వంటి నిండా వున్న తాయెత్తులను తొలిగింపచేశాడు. నూనియాను ఓ గదిలోకి తీసుకెళ్ళి హిప్నాటిజం ద్వారా నిద్రలోకి పంపాడు.

కోవూర్ అడిగిన వాటికి నూనియా చెప్పిన వివరాలు ఇలా వున్నాయి.

***

జరీనా అంటే నూనియాకి చాలా ఇష్టం. జరీనా తనకి చిన్నాన్న కూతురు. 1964 మే 14న వాళ్ళిద్దరూ ఎంతో ఉల్లాసంగా, ఉత్సాహంగా గడిపారు. ఆ రోజు సాయంకాలం తలలో ఏదో బాధగా వుందని జరీనా చెప్పటందో ఆమెను డాక్టర్ వద్దకు తీసుకెళ్ళారు. పరీక్షలో ఆమెకు మెదడుగడ్డ (బ్రెయిన్ ట్యూమర్) అని తెలిసింది. వెంటనే ఆపరేషన్ చేయకపోతే ప్రమాదమన్నాడు డాక్టర్.

ప్రభుత్వ ఆసుపత్రిలో ఆపరేషన్ విజయవంతమైంది. కానీ మే 18న జరీనా కోమాలోకి వెళ్ళిపోయి, ఆ తర్వాత చనిపోయింది. జరీనా మరణం అందర్నీ విషాదంలో ముంచింది. ముఖ్యంగా నూనియాలో దు:ఖం కట్టలు త్రెంచుకుంది. పిల్లలెవర్నీ ఎవర్నీ శవం దగ్గరకు రానివ్వలేదు. చివరిసారిగా జరీనాను చూడాలని నూనియా కోరిక. ఎవ్వరూ ఒప్పుకోలేదు. చుట్టూ మూగివున్న జనంలోంచి తోసుకొని వెళ్ళి జరీనాను చూడగల్గింది. ముఖం తప్ప మిగిలిన శరీరమంతా తెల్లని గుడ్డ (కఫన్)తో కప్పివేయబడింది.

జరీనా మృతి నూనియా మనసులో చెరగని ముద్రవేసింది. జరీనా స్మృతులే పదే పదే ఆమెను బాధపెట్టసాగాయి. తన అన్మదమ్ములతో ఆడుతున్నప్పుడు జరీనా గుర్తుకు వచ్చేది. ఆటలు ఆపేసి ఒక పక్కకు వెళ్ళి కూర్చొనేది.

1964 జులై 15వ తేదీ అందరూ నిద్రలో ఉన్నారు. కెవ్వున కేక విన్పించి నూనియా తల్లి భయంగా లేచిచూసింది. నూనియా తమ్ముడు నైనా ఒక్కసారిగా పక్క మీదనుంచి లేచి తల్లి దగ్గరకు వచ్చాడు. ఏం జరిగిందని అడిగింది తల్లి. "అదుగో ఆ మూలన చూడు" అన్నాడు. చూసింది. "జరీనా దయ్యమై వచ్చింది. నా వైపే చూస్తోంది" అంటూ భయంభయంగా చెప్పాడు నైనా. తల్లి పక్కనుంచి దిగి లైటువేసింది. "ఇప్పుడు చూడు"

అంది. దండెం మీద నుంచి క్రిందకి వ్రేలాడే తెల్లటి కోటు. తల్లి నైనాను ఊరడించి దగ్గరే పడుకోబెట్టుకుంది.

మర్నాడు కుటుంబంలో అంతా ఈ విషయాన్నే చెప్పుకొని పగలబడి నవ్వుకున్నారు. కానీ నూనియా ఒక్కతే నవ్వలేదు. ఆమెలో ముద్రపడిన 'జరీనా శవం' నవ్వనీయలేదు.

జులై 31రాత్రి నూనియా వంటగది నుంచి నడుస్తూ చీకటిలో బాత్‌రూంకి వెళ్ళింది. లోపల తెల్లనిగుడ్డ ఒకటి వేళ్ళాడుతూండడం చూసింది. ఇంకేముంది, జరీనా శవం గుర్తుకు వచ్చి, పెద్దగా కేకలు పెడుతూ పరిగెత్తుకొని ఇంట్లోకి వచ్చింది. ఆ రాత్రి తల్లి దగ్గరే పడుకొంది. అడిగితే – జరీనా దయ్యంగా వచ్చిందని, తనను రమ్మంటోందని, రాకపోతే తనను చంపుతానంటోందని చెప్పి మళ్ళీ కేకలు వేయసాగింది.

అది మొదలు చీకట్లో ఏ మూలకు చూసినా 'జరీనా దయ్యమే' నూనియాకు కన్పించేది.

***

కోవూర్ తగిన సూచనలిచ్చి నూనియాను హిప్నాసిస్‌లోనుంచి మేల్కొల్పాడు. నూనియా ముఖంలో చిరునవ్వు వెలిగింది. ఎంతో ఆనందంతో గదిలోంచి పరిగెత్తుతూ తల్లిదండ్రులను చేరింది. నూనియాలో నవ్వు మెహం చూసి తల్లిదండ్రుల ముఖం విప్పారింది. అలాంటి నూనియాను చూసి ఎన్నాళ్ళయిందో! వాళ్ళ ఆనందం అర్ణవమయింది.

వారు కోవూర్‌కి కృతజ్ఞతలు చెప్పుకొన్నారు. ఇంటికి వెళ్తూ నూనియా, కోవూర్ దంపతులను విందుకు ఆహ్వానించింది. నెలరోజుల తర్వాత విందుకు వెళ్ళిన కోవూర్ దంపతులకు నూనియా చేసిన హడావుడి అంతా ఇంతా కాదు. భోజనాలయ్యాక నూనియా తండ్రి కోవూర్‌ను గెస్ట్‌హౌస్‌లో కూర్చోబెట్టారు.

"సార్! ఒక్క విషయం మిమ్మల్ని అడగాలనుకుంటున్నాను" అన్నాడు.

"అడగండి, ఫరవాలేదు" అన్నాడు కోవూర్.

"ఎందరో మంత్రగాళ్ళు తగ్గించలేనిది, మీరు ఎలా తగ్గించగలిగారు?" తన సందేహాన్ని వినయంగా అడిగాడు నూనియా తండ్రి.

కోవూర్ చిన్నగా నవ్వి ఇలా చెప్పసాగాడు.

"నూనియాలాంటి పిల్లలు మనదేశంలోనే కాదు, ప్రపంచమంతటా వున్నారు. చిన్నప్పట్నుంచీ పెద్దలు చెప్పే దయ్యాలు, రాక్షసుల కథలు వినీ వినీ భ్రమలతో, భ్రాంతులతో తమ మెదళ్ళను ఆలోచనారహితంగా చేసుకొంటారు. 24రోజుల పాటు నూనియా అలా భయపడి వుండడానికి అలాంటి నమ్మకాలతో, కథలతో ఆమె మెదడు నిండివుండడమే కారణం. నైనా చీకట్లో తెల్లకోటును జరీనా అని భ్రాంతిపడి భయపడితే

అందరూ నవ్వుకొన్నారు. కానీ నూనియా మనసులో 'జరీనా శవం' గానే అది వుండిపోయింది. తెల్లగుడ్డ కప్పబడిన జరీనా శవం, ఆమె ముఖం చీకట్లో అంతటా నూనియాకు కన్పించేవి. దయ్యాలు వుండవని, చచ్చిపోయినవాళ్ళు మళ్ళీ కన్పించరని నూనియాకు ఎవ్వరూ బోధించలేదు. పైగా చచ్చినపోయినవారు దయ్యాలై వస్తారనే అన్నారు. అందుకే నూనియా జరీనాను దయ్యంగా ఊహించుకొంది. చిన్నప్పుడే పిల్లల్ని తల్లిదండ్రులు, పెద్దలు పిచ్చి పిచ్చి కథలతో బ్రెయిన్‌వాష్ చేస్తారు. భయపెడితే పిల్లలు అల్లరిమానతారని అనుకొంటారే గాని, ముమ్ముందు వారి మనసులెలా ఎదుగుతాయో ఊహించరు. అదే ఊహించగల్గితే పిచ్చాసుపత్రుల్లో సగం మంది రోగులు తగ్గిపోగలరు. నాకు తెలిసినంతవరకు నూటికి యాభై మంది మానసికరోగులు ఇలాంటి మూఢనమ్మకాల వల్ల, భయాల వల్లనే తయారవుతున్నారు. అలా తయారు కావడానికి వారి వారి తల్లిదండ్రులు, పూజారులు, మంత్రగాళ్ళు మాత్రమే కాదు, బడిలో చదువు నేర్పే టీచర్లు కూడా కారకులే. విజ్ఞానవంతులు, హేతువాదులైనవారు టీచర్లు కాగల్గితే ఇలాంటి పిచ్చినమ్మకాల బారి నుంచి పిల్లల మెదళ్ళు విముక్తమవుతాయి...' చెప్పుకుపోతున్నాడు కోవూర్.

"ఏమండీ! మనం వెళ్ళాలి కదా!" వేరే ప్రోగ్రాం ఉందన్న విషయం అక్కా జ్ఞాపకం చేయగానే, అక్కడ్నుంచి లేచాడు కోవూర్.



# చెంబు జోస్యం

మోహన్ రిటైరయిన ఓ గవర్నమెంట్ ఆఫీసర్. అసిస్టెంట్ కమీషనర్‌గా పనిచేస్తూ 1962లో తన 60వ ఏట పదవీ విరమణ పొందాడు. కీర్తిసంపదలకు కొదవలేదు. సాంఘికంగా, రాజకీయంగా తగిన పలుకుబడి కూడా వుంది. ఎన్ని వున్నా ప్రతివారికి ఏదో సమస్య వుండనే వుంటుంది. మోహన్‌కీ ఓ సమస్య వచ్చి పడింది. దాని పరిష్కారం డాక్టర్ కోవూర్ వల్లనే సాధ్యం అనుకొన్నాడు.

1967 నవంబర్ 26న తన భార్యతో మోహన్ కోవూర్ ఇంటికి వచ్చాడు. మోహన్‌కి, అతని భార్యకీ వయసులో ఎంతో వ్యత్యాసం వుంది. ఆమెలో యౌవనదశలోని లావణ్య విలాసాలు చెక్కుచెదరలేదు. కాని మోహన్ అరవై దాటినవాడు. ఆమెను తన డ్రాయింగ్ రూంలోనే వుంచి మోహన్‌తో వేరే గదిలో సంభాషించాడు కోవూర్. మోహన్ తన చరిత్రనంతా కోవూర్ ముందు వెల్లడించాడు.

***

మోహన్‌కి జరీనా రెండో భార్య. ఆమె జన్మస్థలం 'మటారా'. మోహన్ మొదటి భార్య ఒక బిడ్డను అతని చేతిలో పెట్టి గతించింది. తన రిటైర్‌మెంట్ తర్వాతనే అతడు జరీనాను పెళ్ళాడాడు. ఒక ఆడపిల్ల, మరో 11నెలల వయసున్న మగపిల్లాడు – వీరిద్దరూ వీరి సంతానం.

ఓరోజు బాగా వర్షం పడుతోంది. ఇంట్లో ఏమీ తోచడం లేదు. ఇద్దరికీ ఓ అయిడియా వచ్చింది. చెంబుజోస్యం ఆడితే ఎలా వుంటుంది?

ఈ ఆలోచన రాగానే టేబిల్ మీద ఓ గుండ్రని వృత్తం గీసారు. దాని చుట్టూ ఇంగ్లీష్ అక్షరాలు 'ఎ'నుండి జడ్ వరకూ అన్నింటినీ ఆ వృత్తంలో గుర్తించారు. వృత్తకేంద్రంలో ఓ చెంబును తెచ్చి పెట్టారు. ఆడేవారు తమ చేతుల్ని చెంబు మీద వుంచి చనిపోయినవారి ఆత్మలను ఆహ్వానించాలి. అప్పుడు, ఆత్మలు వస్తాయట. చెంబులో ప్రవేశించి దాన్ని కదిలించడం ద్వారా ఆడేవారి సందేహాలకు జవాబులిస్తాయట.

ఆడేవారు తమ చేతులను చెంబు మీద వుంచినప్పుడూ చెంబు ఏఏ అక్షరాల వద్దకు కదులుతుందో ఆ అక్షరాలన్నిటినీ ఓ చోట రాసి కలిపి చదివితే ఆత్మ పేరు తెలుస్తుందట. ఆ తర్వాతనే తమ సందేహాలను అడగడం, దానికి ఆ ఆత్మ జవాబులివ్వడం- ఇదీ చెంబుజోస్యం.

మోహన్, జరీనా చాలా ఉత్సాహంగా ఆట మొదలుపెట్టారు. మొదటిగా వారి ఆటలో శ్రీలంక మాజీ ప్రధాని బండారు నాయకే ఆత్మ వచ్చిందట. బండారు నాయకే మోహన్‌కి స్నేహితుడు. వారడిగిన అనేక ప్రశ్నలకు జవాబులు కూడా వచ్చాయట. మళ్ళీ ఆడారు. ఈసారి తమకు పరిచయం లేని థామస్ సెల్వా అనే ఆత్మ వచ్చిందట. మూడోసారి అడిగినపుడు మేడమ్ బూన్‌వాట్ అనే స్త్రీ ఆత్మ వచ్చి తన కథంతా చెప్పిందట. తన భర్త వల్లే తాను మరణించినట్లు చెప్పుకొని బాధపడిందట.

ఇలా మధ్యాహ్నం వరకు చెంబుజోస్యం ఆడుకొన్నారు మోహన్,జరీనాలు. ఆ తర్వాత భోజన విరామం.

జరీనాకు చెంబుజోస్యం మీద ఆసక్తి ఎక్కువగా వుంది. మళ్ళీ మొదలుపెట్టారు. తమకు తెలీని ఆత్మలు విష్ణు, దేవియోలు వచ్చి మాట్లాడాయట. మూడోసారి వచ్చిన ఆత్మ 'సెయింటు జుడే'.

సెయింట్ జుడే ఓ క్రిస్టియన్ చర్చిలో పూజారిగా పనిచేసి చనిపోయినవాడు. అతని గురించి జరీనా మోహన్‌లకు తెలుసు.

సెయింట్ జుడే ఆత్మ మోహన్‌నుద్దేశించి, తన పేర ఓ బంగారపు ఉంగరం జరీనాకిమ్మని ఆదేశించిందట. అంతేకాక సెయింట్ ఆన్స్ చర్చి దగ్గర తన విగ్రహం వుందని, ఆ విగ్రహం దగ్గరికి వస్తే జరీనా కోసం తానొక బంగారపు ఉంగరం అక్కడ వుంచుతానని కూడా చెప్పిందట.

రెండోరోజు మోహన్ తన భార్యతో కలసి చర్చికి వెళ్ళారు. జుడేవిగ్రహం వద్ద ఆత్మ కోరిన విధంగా క్రొవ్వత్తులు వెలిగించి చాలాసేపు ప్రార్థించింది. అయినా ఫలితం శూన్యం. ఉంగరం అభించలేదు. నిరాశ, కోపం ఆమెలో అతిశయించాయి. ఉంగరం లేనిదే ఇంటికి వెళ్ళనని మొండికేసింది. ఆమె తమ్ముడు, డ్రయివర్ ఆమెను బలవంతంగా పట్టుకొని కారులో కూర్చోబెట్టి ఇంటికి తీసుకువచ్చారు.

ఇంటికి వచ్చాక జరీనా పిచ్చిదానిలా తయారయింది. ఎప్పుడూ జుడే గురించే మాట్లాడుతోంది. మోహన్ ఈ విషయాన్ని సీరియస్‌గా తీసుకోలేదు. మూణ్ణెల్లు గడిచాయి. ఆమె పరిస్థితి మరో రకంగా మారింది.

జరీనా ఎప్పుడూ ఏడుస్తూ వుంటోంది. తాను తొమ్మిది నెలల గర్భవతినని, త్వరలో బిడ్డ జన్మించబోతోందని చెబుతోంది. కానీ చూసేవారికి ఆమెకి గర్భం వచ్చిన సూచనలేవీ కన్పించవు.



మోహన్‌కి జరీనా పరిస్థితి ఆందోళన కల్గించింది. ఆమెను అనేకచోట్లకు తిప్పాడు. ఎందరో వ్యక్తుల్ని సంప్రదించాడు. అనేక చర్చీల్లో పూజలు చేసాడు. అయినా జరీనా పరిస్థితిలో మార్పులేదు.

మోహన్ ఓ మంత్రగాణ్ణి కలిశాడు. అతడు జరీనాకి దిష్టి తగిలిందన్నాడు. ఓ ఆడదయ్యం ఆమెను పీడిస్తోందన్నాడు. దాన్ని వదిలిస్తామని మోహన్‌ని ఒప్పించి పూజలు నిర్వహించాడు. అయినా జరీనా స్థితిలో మార్పులేదు. కొన్నాళ్ళకి మరో మంత్రగాణ్ణి ఆశ్రయించాడు మోహన్. అతడూ పరిశీలించి మోహన్ మొదటి భార్య ఆత్మ పూనిందని, మంత్రించిన నూనె గల తాయెత్తు తయారుచేసి, ఒక దారంతో దాన్ని జరీనా చేతికి కట్టాడు. అయినా జరీనా మామూలు స్థితికి రాలేదు.

ఈసారి మోహన్ ఓ అంజనకత్తెని ఆశ్రయించాడు. ఆమె ముందుగా మోహన్‌ని నమ్మించాలని వారి బంగ్లా ఎలా వుంటుందో వర్ణించింది. కుడి ఎడంగా ఆమె చెప్పినవన్నీ మోహన్‌కి యదార్థమనిపించాయి. జరీనా విషయమై ఆమె అంజనం వేసింది. వాళ్ళ శత్రువొకడు ఆమెకు ఓ రకమైన విషం పెట్టాడని చెప్పింది. ఆ విషాన్ని కక్కించకపోతే తీవ్ర ప్రమాదమని హెచ్చరించింది. తన ఫీజు రేటు చెప్పింది. రేటు కుదిరాక ఓ ద్రవాన్ని త్రాగించింది. జరీనాకి వాంతులయ్యాయి. కాని ఆమె స్థితి మారలేదు.

మోహన్ మరో ప్రయత్నం చేశాడు. జరీనాను మరో చర్చి పూజారికి చూపించాడు. పూజారి అది సైతాన్ పని అన్నాడు. మంత్రించిన నీటిని ఆమె మీద చల్లాడు. ఆమె నుదుటి మీద శిలువను తాకించాడు. స్వస్థత ప్రార్థన చేశాడు. అయినా ప్రయోజనం లేకపోయింది.

మోహన్‌కి విసుగొచ్చింది. ఇంటికొచ్చాక మరలా చెంబుజోస్యం మీదకి మనసు పోయింది. మళ్ళీ ఆడటం మొదలుపెట్టాడు. కటరిగామా అనే ఊరికి చెందిన దేవత వచ్చిందట. జరీనా సమస్య పరిష్కారం కావాలంటే తన గుడికి చేర్చమన్నదట. మోహన్ అలాగే తీసుకెళ్ళాడు.

జరీనా అక్కడ ఏడ్పులు, పెడబొబ్బలు మాని నిశ్చింతగా ధ్యానముద్ర పూనింది. దాంతో జరీనాను పీడించే దుష్టశక్తి నశించిందని మోహన్‌కి నమ్మకం ఏర్పడింది. జరీనాతో ఇంటికి వచ్చాడు. అతని సంతోషానికి అవధుల్లేకుండా ఉంది. అయితే ఆ సంతోషం ఆరోజు వరకే నిలిచింది. మర్నాటినుండి మళ్ళీ జరీనా ఎప్పటిలాగే ఏడ్వడం, గర్భవతినని బాధపడడం తన పిల్లల్ని సైతం తిట్టటం, కొట్టటం మొదలయింది.

మోహన్‌లో ఓర్పు నశిస్తోంది.డబ్బు ఖర్చు అవుతున్నా శ్రమే మిగులుతోంది. చివరిసారిగా ఎవరో చెప్పారని కొందరు మాంత్రికుల్ని పిలిపించాడు. ఆ బృందం ఆ రాత్రి అంతా తమతమ పద్ధతుల్లో పూజలు చేశారు. ఓ దశలో నృత్యం చేయసాగారు. జరీనా కూడా వారితో కాలు కలిపింది. ఆ నృత్యంలోనే ఓ మాంత్రికుడు జరీనాను సమీపించి 'ఎవరునువ్వు?' అన్నాడు. మోహన్ మొదటిభార్యగా చెప్పింది. వెళతావా? లేదా? అని బెదిరించాడు. వెళతానంది. ఎదురుగా బలి ఇవ్వడానికి తెచ్చి వుంచిన కోడిపుంజులోకి ప్రవేశిస్తానని చెప్పింది. కొద్దిసేపట్లోనే జరీనా నేలపై పడింది. కోడిపుంజు కూడా మంత్రగాడి కత్తికి తన ప్రాణాలర్పించి నేలపై పడింది. ఓగంట తర్వాత జరీనా లేచింది. మాంత్రికులు సుష్టుగా భోంచేసి తమ తమ కానుకలతో వెళ్ళిపోయారు. కాని మర్నాటినుండి జరీనా యథాప్రకారంగానే గొడవపెట్టసాగింది. మోహన్ స్థితికి జాలిపడ్డ ఓ మిత్రుడు కోవూర్ గూర్చి చెప్పి పంపాడు.

***

మోహన్‌తో ఇంటర్వ్యూ అయ్యాక కోవూర్ జరీనాను లోనికి రమ్మన్నాడు. జరీనాను తన వెంటతీసుకొచ్చి వాలుకుర్చీలో కూర్చుండబెట్టింది అక్కా. జరీనా లోనికి వస్తూనే తనలో తాను గొణుక్కుంటూండడం గమనించాడు కోవూర్.

కోవూర్ పరిశీలనగా జరీనా వైపు చూశాడు.

జరీనా ఆధునిక యువతిలా అలంకరించుకొంది. వయసు నలభై నాలుగేళ్ళు అంటే ఎవ్వరూ నమ్మరు. ఆమె శరీరపుష్టి, సౌష్టవం, లావణ్యం ఆమె వయస్సును కన్పించనీయవు. అలంకరణ పట్ల ఆమెకున్న శ్రద్ధను బట్టి ప్రదర్శనాసక్తి కూడా వున్నట్లు తెలుస్తోంది.

కోవూర్ జరీనాను హిప్నటైజ్ చేశారు. ఆమె నిద్రలోకి వెళ్ళాక అనేక ప్రశ్నలు వేశారు. ఆమె జవాబులన్నీ శ్రద్ధగా విన్నారు.

"మాది మటారా గ్రామం. నేనక్కడే కాన్వేంట్‌లో చదివాను. నేను క్రైస్తవ మతస్తురాలిని కాకపోయినా తోటి స్నేహితురాళ్ళ కోసం ప్రార్థనలకీ, సువార్తకూటములకూ వెళ్ళేదాన్ని. నేనూ నా భర్తా ఇప్పటికీ బౌద్ధులమే. నా భర్తకు నేను రెండోభార్యను. కానీ, నాకు

మోహనే మొదటి భర్త. మేం ఇద్దరం ఒకరంటే ఒకరం చాలా ఇష్టపడతాం. రెండో సంతానం కలిగాక ఇక పిల్లలు వద్దన్నాడు నా భర్త. పెద్దవయసులో వున్న తన భర్తకేదైనా జరిగితే పిల్లలను పెంచడం కష్టమనుకొని మూడోసంతానం వద్దని ఇద్దరికీ తోచింది. రాత్రివేళ నా భర్త, నేనూ ఒకే గదిలో పడుకోము. నా భర్త పూజామందిరంలో పడుకొంటాడు".

జరీనా ఈ విషయాలన్నీ చెప్పి మౌనం వహించింది. జుడే గురించి అడిగాడు కోవూర్. మళ్ళీ చెప్పసాగింది.

"చెంబుజోస్యం ఆడేటప్పుడు జుడే నాకెన్నో విషయాలు చెప్పేవాడు. ఏదీ తన భర్తకు చెప్పవద్దనేవాడు. తాను నన్ను ప్రేమిస్తున్నాడట. గతజన్మలో నేను అతని భార్యనట. అప్పుడు నాపేరు 'రోజ్' అని, అతని పేరు 'రోలీ ది రెమూస్' అని చెప్పాడు. వచ్చే జన్మలో అతడే మళ్ళీ తన భర్త అవుతాడట. చెంబుజోస్యం అయ్యాక జుడే ప్రతిరాత్రీ నాతో నిద్రించేవాడు. నా భర్త ఇంట్లో లేనపుడు జుడే వంటింట్లోకి కూడా వచ్చి నా చీర పట్టి లాగేవాడు. అక్కడ నన్ను కౌగిలించుకుని ముద్దాడేవాడు. ఒక్కోసారి నా బట్టలు వూడదీసి నా వంటి మీద శిలువగుర్తులు వేసేవాడు. అలాగే నాకేమీ బాధ కలుగకుండానే ఒక్కోసారి తన పళ్ళతో కొరికేవాడు కూడా"

ఇలా చెబుతూనే జరీనా తన జాకెట్టు వూడదీసింది. కోవూర్ దంపతులు ఆశ్చర్యంతో ఒకరినొకరు చూసుకున్నారు. జరీనా తన రొమ్ముల మీద రక్కుల్ని చూపించింది. మళ్ళీ ఇలా చెప్పసాగింది.

"నేనంటే అతనికెంత మోహమో నాకూ అతడంటే అంత ఇష్టం. అతడు చాలా అందగాడు. అతని విగ్రహం నేను సెయింట్ ఆన్స్ చర్చి వద్ద చూశాను. కానీ అతని నిజరూపం ఇంకా అందంగా వుంటుంది. అతని ముఖం కూడా ఆకర్షణీయంగా వుంటుంది. ఓరోజు నా గురించి అతడు పేపరు మీద రాశాడు. ఆ విషయాలను తన భర్తకు చెబితే నన్ను చంపేస్తానన్నాడు. ఓసారి నా పెళ్ళి ఉంగరాన్ని, చెవిదిద్దుల్ని లాగేసుకున్నాడు. మూడుసార్లు నా దిండు క్రింద డబ్బులు పెట్టి వెళ్ళాడు. ఓసారి వెయ్యి, రెండోసారి ఎనిమిది వందలు, మూడోసారి పదహారు వేలు.

ఇలా చెబుతూ బిగ్గరగా ఏడ్చింది జరీనా.

కోవూర్ ఓదార్చాడు. ఎందుకేడుస్తున్నావని అడిగాడు. నెమ్మదిగా ఊరడిల్లి జరీనా చెప్పిందేమిటంటే తనకి తొమ్మిదోనెల, తనకో బేబీ పుట్టబోతోంది. అందరికీ తన మీద అనుమానం వస్తుందని తను అనుమానిస్తోంది. అక్రమంగా పిల్లల్ని కనడం కన్నా చావడం మేలని తోస్తోంది జరీనాకి.

కోవూర్‌కి విషయం పూర్తిగా అవగాహన అయింది. ఇక జరీనాను అడగాల్సిందేమీ లేదు. హిప్నాటిక్ స్థితి నుంచి సాధారణ స్థితికి తెచ్చాడు. జరీనాను బయటకి పంపి, మళ్ళీ మోహన్‌ని లోపలికి పిల్చాడు.

మోహన్ చేతిలో ఒక న్యూస్‌పేపర్ వుంచాడు కోవూర్. 1964 జనవరి 12వ తేదీ నాటి సిలోన్ అబ్జర్వర్ అది. అందులో కోవూర్ పరిశోధించిన ఓ కేసు (ఈ పుస్తకంలో 'ప్రేమికుడు' అనే కథ) వివరాలున్నాయి.

మోహన్ నింపాదిగా చదివాడు. పేపరు మడిచి ప్రక్కన టీపాయ్ మీద పడేశాడు.

జరీనాది అలాంటి కేసేనని, ఆ కేసులో లతలాగే (ఈ పుస్తకంలో 'ప్రేమికుడు' అనే కథ) జరీనాకు కూడా భ్రాంతులున్నాయని కోవూర్ చెప్పాడు. మోహన్‌కి ఆశ్చర్యమేసింది. వివరంగా చెప్పమని కోరిన మీదట కోవూరిలా అన్నాడు.

''మిస్టర్ మోహన్! మీ ఇద్దరి మనసుల్లోను మూర్ఖమైన, మూఢమైన ఆలోచనలున్నాయి. ఎంతో చదువుకున్న మీరే ఆత్మలు, దయ్యాల పట్ల నమ్మకం కల్గివుండడం నిజంగా విచారకరం. అవి వున్నాయనుకోవడం, మీ ప్రశ్నలకు జవాబులిస్తాయని భావించడం నిజంకాదు. చెంబుజోస్యం శుద్ధ అబద్ధం. ఆ చెంబుజోస్యమే జరీనాను ఈ దుస్థితికి తెచ్చింది.

జరీనాకి చిన్నప్పటినుంచీ అందరిలాగే దయ్యాలు, మంత్రాలు, ఆత్మలు, దేవుళ్ళు, పూజలు, ప్రార్థనలు, చేతబడులు ఇలాంటి వాటి పట్ల నమ్మకం కుదిరింది. చెంబుజోస్యం అనేది మీరు సృష్టించుకున్న ఒక అందమైన వంచన. టేబుల్ మీద వృత్తాకారంగా గీసి, మధ్యలో చెంబు వుంచి, దానిపై చేతులుంచితే అది తనకు తాను ఎలా కదులుతుంది? ఏ యాంత్రికశక్తి వల్ల కదులుతుంది?

చెంబు కదలడానికి కారణం జరీనా చేతి కండరాలలో వున్న సైకోమోటార్ కదలిక. ఆమె రాత్రుళ్ళు వంటరిగా, మీకు తెలియకుండా అనేకసార్లు ఈ ఆట ఆడింది. అలా జరపడం ఆమెకు ఓ అలవాటు అయింది. ఆ ఆటలో ఆత్మలు రావడం, మీప్రశ్నలకు జవాబులు ఇవ్వడం మీరు పొందిన భ్రమలకు నిదర్శనం. జరీనా చెంబు జరుపుతూ జవాబులు చెప్పేది. ఇలా చేసేటప్పుడు ఆమెకు ఇహలోక స్పృహ వుండదు. ఇలాంటివి నిత్యమూ చేస్తుండడం వల్ల ఆమె మనస్సు మరీ బలహీనపడింది. జుడేకి తనతో సెక్స్ సంబంధం వుందని చెప్తోంది. అదంతా అబద్ధం. ఆమె భ్రమ. ఆమెలో అంతర్గతంగా చెలరేగే కామవాంఛలు ఈ భ్రమలకి కారణాలు. ఈ వయసులో వున్న ప్రతి స్త్రీకి ఈ కోరికలు వుంటాయి. వీటిని బయటపెట్టుకోలేక ఆమె లోలోపల వీటిని అణచిపెట్టింది. చెంబుజోస్యం, ఆమె అంతశ్చేతనలలో వున్న కోరికల వెల్లడికి అవకాశం కల్పించింది. తనకేర్పడిన భ్రమలన్నీ నిజమేనని జరీనా ఉద్దేశం. జుడేతో జరిపిన ప్రేమకలాపం,

గర్భం వచ్చిందనుకోవడం, దిండు కింద డబ్బు పెట్టటం, ఉంగరాన్ని ఇస్తాననడం, వచ్చే జన్మలో పెళ్ళాడతాననడం ఇవన్నీ ఆమె కల్పించుకొన్న భ్రమలు. పెళ్ళినాటి ఉంగరం, దుద్దులను జుడే లాగేసుకోవడం, తనను జుడే కొరికాడని, రక్కాడని ఆమె అంటోంది. ఆమె గుర్తులను కూడా చూపించింది. కానీ అవన్నీ ఆమె చేసుకున్నవే. విద్యావేత్తలైన మీరు ఇలాంటప్పుడు మానసిక వైద్యుల్ని కలవకుండా మాంత్రికుల్ని ఆశ్రయించడం విచారకరం".

కోవూర్ చెప్పేది వింటుంటే మోహన్ ముఖంలో తెలీని వేదన నిండింది. చెంబుజోస్యం, ఆత్మలు, జుడే.... ఇలాంటివి జీవితాన్ని ఎంత అధోగతిపాలు చేశాయి! జరీనాకు ఎంత దారుణస్థితి కల్పించాయి! తనను తానే అసహ్యించుకున్నాడు. అందులో తన పాత్ర కూడా వుంది కదా! కోవూరన్నట్లు అతీతశక్తులున్నాయని నమ్మడం, వాటి పట్ల భయాన్ని కల్గివుండడం వల్లే ఇవన్నీ జరుగుతున్నాయి. తన చదువుని, హెూదాని, తెలివిని - అల్పులైన భూతవైద్యుల ముందు, అజ్ఞానులైన అంజనగత్తెల ముందు సాష్టాంగపరిచినపుడు తానెంత చదువుకొన్నవాడైతే ఏం లాభం?

మోహన్‌లోని మౌనరోదనను విన్నాడు కోవూర్.

"మిస్టర్ మోహన్! జరీనాకేర్పడ్డ భ్రమలన్నీ ఆత్మలవల్ల, దయ్యాల వల్ల ఏర్పడ్డవి కావని ఇప్పటికే మీరు అర్థమైవుంటుంది. మీరేమీ బాధపడకండి, మీరు సహకరిస్తే ఈరోజే మీ జరీనాని మామూలు మనిషిగా చేస్తాను. అయితే మీరు కొన్ని విషయాలు తెలుసుకోవాలి".

"చెప్పండి కోవూర్! నా జరీనా మామూలు మనిషి కావాలి. అందుకు నేనేం చేయాలో చెప్పండి" మోహన్ ఆశగా ఆత్రంగా అడిగాడు.

"మీరు మొదటగా చేయాల్సింది మీ దైవధ్యానాన్ని ఆపడం. మీరు ఎక్కువ సమయాన్ని అలా గడపడం వల్ల మీ భార్యకి కల్గే అసంతృప్తి మీరూహించలేదు. జరీనాతో మీరు భర్తగా బాధ్యతగా మెలగడం అవసరం. మీ భార్య వయసులో వుంది. ఆమెలోని సహజకోరికలను పట్టించుకోకుండా వాటిని విస్మరించి భావాతీతధ్యానమనో, దైవధ్యానమనో చెప్పి ఆమెకి దూరంగా గడపడంలో అర్థం లేదు. అలాంటప్పుడు మీరు మీ వయసుకి తగిన స్త్రీనే భార్యగా పొంది వుంటే ఈ సమస్యలు వుండేవి కావు".

మోహన్ విచారంతో తలదించుకున్నాడు. తను చేసింది ఎంత తెలివితక్కువ పనో ఇప్పుడు తెలుసుకున్నాడు.

ఈ వయసులో పిల్లలు వద్దని నిజంగా మీరనుకుంటే కుటుంబ నియంత్రణ పద్ధతులు వుండనే వున్నాయి. పిల్లలు కలగకూడదనే ఆంక్ష పెట్టి మీ భార్యను అలా దూరంగా

వుంచడం మీరు చేసిన మహాపరాధం. అలా చేయడం వల్ల ఒకవేళ ఆమె తన కోర్కెలు తీర్చుకోవడానికి అడ్డదారులు తొక్కితే అది ఆమె తప్పు కాదు. జరీనాలో కలిగిన భ్రమలన్నిటికీ ఈ కోరికలే కారణం. తీరని కోర్కెలను తీర్చుకొంటున్నట్లు ఆమె భ్రమలలో బ్రతుకుతోంది. జుడే ఆమెకు స్వప్నసుందరుడు".

మోహన్ లేచి కోవూర్ చేతులు పట్టుకున్నాడు.

"కోవూర్‌గారూ! నా తప్పు తెలుసుకున్నాను. మీరు చెప్పింది అక్షరాలా నిజం. ఇకనుండి మీ సూచనలు పాటిస్తాను. దైవధ్యానం వదిలేస్తాను. నాభార్యతోనే శేషజీవితం గడుపుతాను. ఈ భ్రమలనుండి నా జరీనాని రక్షించండి, ప్లీజ్!"

మోహన్‌లో కలిగిన జ్ఞానోదయానికి కోవూర్ సంతోషపడ్డాడు.

"అలాగే, తప్పకుండా చేయాల్సింది చేస్తాను. మీరు వెళ్ళి బయటనే కూర్చోండి. జరీనాను లోనికి పంపండి".

మోహన్ బయటకు నడిచాడు. కోవూర్ తన భార్య వైపు నవ్వుతూ సాభిప్రాయంగా చూసాడు. జరీనా లోనికి వచ్చింది. అక్కా చూపించిన కుర్చీలో కూర్చుంది.

కోవూర్ తిరిగి జరీనాను హిప్నటైజ్ చేసాడు. ఇపుడు జరీనా పూర్తిగా ట్రాన్స్‌లో వుంది.

"జరీనా! అదుగో, నీ ప్రియుడైన జుడే నీకోసం గబగబా వస్తున్నాడు. వచ్చేస్తున్నాడు. ఇంకా దగ్గరకు వచ్చేస్తున్నాడు. వచ్చేశాడు. నిన్ను తన చేతుల్లోకి తీసుకుంటున్నాడు. చివరిసారిగా నిన్ను ముద్దాడుతున్నాడు.

ఇలా అంటూనే కోవూర్ జరీనాకు కలుగుతున్న పరవశత్వాన్ని గమనిస్తున్నాడు. అపుడు ఆమె పొందిన ఆనందానికి హద్దులేదు. ఆమె కళ్ళు మూతపడివున్నా ఆనందంతో కదులుతున్నాయి. పెదాలు సన్నగా వణుకుతున్నాయి. వళ్ళంతా పులకరిస్తోంది. చేతివేళ్ళ కుర్చీని గట్టిగా పట్టుకున్నాయి. కాళ్ళలో కూడా కామం కదలికలు పుట్టించింది. అప్పటి జరీనా స్థితిని వీడియో కెమేరాలు మాత్రమే వర్ణించగలవు.

కోవూర్ సజెషన్స్ ఇస్తూనే వున్నాడు.

"జుడే చివరిగా నిన్ను కౌగిలించుకుంటున్నాడు. అతడు మరెన్నటికీ మీ వద్దకు రాడు. తాను రాలేనని నీతో చాలా ప్రేమగా చెబుతున్నాడు. తనను మరిచిపొమ్మని నిన్ను కోరుతున్నాడు. తన కోరికను అంగీకరించమని నిన్ను అర్థిస్తున్నాడు. నీవు అతని కోరికను కాదనలేకపోతున్నావు. అతని చేతిలో చేయి వేసి అంగీకరిస్తున్నావు. అతనిని మర్చిపోవడానికి మాటిస్తున్నావు. తప్పకుండా మరిచిపోతానంటున్నావు. జుడేకి నీ మాటలు

ఎంతో ఆనందాన్నిచ్చాయి. మీకడుపులో వున్న బిడ్డని జుడే తీసేసుకుంటున్నాడు. తన చేతిలోకి తీసేసుకున్నాడు. చేతితో వీడ్కోలు చెబుతూ జుడే తన బిడ్డతో నీకు దూరమవుతున్నాడు. నీకు ఇపుడు ఎంతో ఆనందంగా వుంది. అదుగో, నీ భర్త నీ దగ్గరకు వస్తున్నాడు. జుడేకి బదులు నిన్ను ఎంతో ప్రేమగా చూడడానికి నీకు దగ్గరవుతున్నాడు. నిన్ను ఎంతో ప్రేమిస్తున్నాడు. జుడే కంటే ఇంకా ఇంకా చాలా ఎక్కువగా ప్రేమిస్తున్నాడు. నీ అందం అతనికి ఎంతో ఇష్టం. నీకు కూడా అతనంటే చాలా ఇష్టంగా వుంది. మీ ఇద్దరూ పిల్లలతో హాయిగా బ్రతకాలనుకొంటున్నారు. ఇకనుంచి హాయిగా జీవిస్తారు. కలసిమెలిసి ఆనందంగా జీవిస్తారు".

కోవూర్ క్రమంగా సూచనలిచ్చి జరీనాని మేల్కొల్పాడు. జరీనా ముఖంలో ఇపుడు ఏ ఆందోళనా లేదు. ప్రశాంతంగా నవ్వుతూ వచ్చి భర్త ప్రక్కనే కూర్చుంది.

కోవూర్ సూచనలు విన్నాక మోహన్ జరీనాతో ఇంటికి వెళ్ళాడు.

నెలరోజులు గడిచాక దంపతులిద్దరూ కోవూర్ ఇంటికి వచ్చిరు. తాముతెచ్చిన కానుకలను టీపాయ్ మీదుంచారు. కోవూర్ వాటిని మర్యాదగా కాదన్నాడు. తామిప్పుడు కొత్తజీవితం గడుపుతున్నామని చాలా ఆనందంగా ఉన్నామని జరీనా చెబుతున్నపుడు ఆమె కళ్ళల్లో కదలాడే ఆనందబాష్పాలు కోవూర్‌కి కృతజ్ఞతలు చెప్పాయి.



# దగాకోరు

సరస్వతిని అందరూ వింతగా చూస్తున్నారు. మొన్నటిదాకా తలనొప్పి అంటూ గింజుకునేది. ఎలాగో అది ఇప్పుడు తగ్గిపోయింది. అందరూ కాస్త ఊపిరి పీల్చారో లేదో, మరో వింత జబ్బుతో సరస్వతి మరీ వింతగా కనపడుతోంది.

సరస్వతి తండ్రి రామనాథన్. ఒక గవర్నమెంట్ ఆఫీస్‌లో హెడ్‌గుమాస్తా. అతనికిద్దరు పిల్లలు. అబ్బాయి కందసామి, అమ్మాయి సరస్వతి. జాఫ్నాలోనే పిల్లలిద్దరూ చదువుతున్నారు. సరస్వతి ఎంతో తెలివితేటలు గల బాలికగా స్కూల్లో పేరుపొందింది.

అన్ని కుటుంబాల్లోలాగే పెంపకంలో సరస్వతికి కందసామికి తేడా చూపించాడు రామనాథన్. సరస్వతి ఆడపిల్ల కదా! పై చదువులెందుకులే అనుకొన్నాడు. స్కూల్ ఫైనల్ కాగానే చదువు మాన్పించాడు. కందసామి మాత్రం కాలేజీలో చదువుతున్నాడు.

ఇప్పుడు సరస్వతికి వచ్చిన వింతజబ్బు అందర్నీ అయోమయంలో పడేసింది. వార్తాపత్రికల పిచ్చి పట్టుకొంది. చేతిలో నుంచి పత్రిక వదలదు. నడిచినా, కూర్చున్నా, నిలబడినా, పడుకొన్నా, ఆఖరికి తింటున్నా చదవటం ఆపదు. ఉదయం పత్రిక ఇంట్లో పడినదగ్గర్నుండీ సాయంత్రం వరకూ కూర్చున్న కుర్చీనే అంటిపెట్టుకుంటుంది. ఎంతసేపు చదివినా అదే పేజీ, అదే పేరా, అదే లైను. ఇంకా చెప్పాలంటే ఒకే చోట సరస్వతి దృష్టంతా కేంద్రీకృతమై వుంటుంది. పత్రికను ఎవ్వరికీ ఇవ్వదు. తాను పూర్తిగా చదవదు.

తల్లిదండ్రులకే కాదు, ఇరుగుపొరుగు వారు, బంధువులు కూడా, ఇదేమి వింతజబ్బో అని ముక్కు మీద వేలేసుకున్నారు. అయితే మొదట్లో సీరియస్‌గా పట్టించుకోలేదు. రోజులు గడుస్తున్న కొద్దీ సరస్వతిలో మార్పు లేకపోగా, పరిస్థితి మరింత విషమించింది. ఏ పనీ చేయదు, ఏం చెప్పినా వినదు. భోజనానికి, టిఫిన్లకీ రమ్మంటే రాదు. తల్లి వెళ్ళి లాక్కొనిరావాల్సి వస్తోంది. అంత కష్టపడి భోజనం ముందు కూర్చోబెట్టినా తినదు.

తిండి మీద శ్రద్ధ ఎప్పుడైతే తగ్గిపోయిందో ఆమె బలహీనపడసాగింది. జీర్ణశక్తి తగ్గిపోవడం, నీరసం ఎక్కువ కావడం వల్ల అందంగా, ఆరోగ్యంగా, పుష్టిగా యవ్వనంలో వుండి అందరినీ ఆకర్షించే సరస్వతి రోజురోజుకీ కృశించి రక్తహీనతకు గురయింది.



నెలలు గడిచిపోతున్నాయ్. రామనాథన్ కొలంబోలో వున్న స్థలంలో కొత్తగా ఇల్లు కట్టుకున్నాడు. ఓ మంచిరోజు చూసుకుని వారి కుటుంబం కొత్త ఇంటికి మారింది. కొలంబోలో ఓ మంచి సంబంధం చూసి సరస్వతికి పెళ్ళి చేయాలనుకున్నాడు.

కందసామి యూనివర్శిటీ నుండి సైన్సు డిగ్రీ పుచ్చుకున్నాడు. ఒక విదేశీ కంపెనీలో ఉద్యోగం కూడా సంపాదించాడు.

సరస్వతిలో మార్పు వచ్చింది. ఇపుడు నిరంతరం పేపరు చదవడం పోయి తనలో తాను గొణుక్కోవడం, మూర్ఛలతో అప్పుడప్పుడూ పడిపోవడం జరుగుతోంది.

తన చెల్లెలు ఇలా అయినందుకు కందసామి ఎంతో కుమిలిపోయేవాడు. కాలేజీ రోజుల్లోనే హిప్నోథెరపిస్టు, హేతువాది అయిన కోవూర్ పరిచయం కందసామికుండేది. అయినా తన చెల్లెలి అవస్థను ఆయనతో చెప్పడానికి సిగ్గుపడేవాడు. చెల్లెలి దీనస్థితిని భరించలేక చివరికి ఒక రోజు కోవూర్ దగ్గరకెళ్ళి అంతా చెప్పాడు.

సరస్వతి గురించి రామనాథన్ ఆఫీస్‌లో కూడా తెల్సింది. రఘుపతి, రామనాథన్‌తో పనిచేసే ఒక అసిస్టెంట్ గుమాస్తా. చొరవ తీసుకుని, ఓ రోజు సరస్వతి విషయంలో ఓ సలహా ఊదాడు రఘుపతి. తనకు తెలిసిన సాధువొకడు ఉన్నాడని, అతనికి అతీతశక్తులున్నాయని చెప్పాడు. ఆ సాధువు నిరంతర దైవధ్యాన తత్పరుడట. క్షుద్రశక్తులను పిలకపట్టుకుని ఆడించడంలో నేర్పరియట. ఎంతో పేరుపొందిన వైద్యులు కూడా కుదర్చలేని రోగాలను అతగాడు నయం చేశాడట.

తనవద్ద పనిచేసే రఘుపతి తనకెందుకు అబద్ధం చెప్తాడు? పోనీ రఘుపతి సలహాను పాటిద్దాం అనుకొన్నాడు రామనాథన్. వెంటనే ఆ సాధువుతో అన్ని విషయాలు మాట్లాడమని చెప్పాడు రఘుపతితో.

సాధువుతో బేరం కుదిరింది. రామనాథన్ ఇంట్లో జరగాల్సిన తంతుకు తేదీ కూడా ఖరారైంది.

ఆ రోజు రఘుపతి సాధువుతో రామనాథన్ ఇంటి ముందు ప్రత్యక్షమయ్యాడు. ఎంతో భక్తిశ్రద్ధలతో సాధువుని లోనికి ఆహ్వానించారు రామనాథన్ దంపతులు. డ్రాయింగ్‌రూంలోకి తీసుకెళ్ళారు. కుర్చీ మీద తెల్లని, కొత్తగుడ్డ పరిచి కూర్చుండబెట్టారు.

రామనాథన్ తన భార్యతో సాధువు దగ్గరే నిలబడ్డాడు. ఆమె సాధువుని పరిశీలనగా చూసింది. పచ్చని పట్టుబట్ట చుట్టుకున్నాడు. బవిరిగడ్డం, గుబురు మీసాలు, తలపై చుట్టిన వెంట్రుకల ముడి, మెడలో రుద్రాక్షమాల, నుదుట విభూతి రేఖలు - అచ్చం పురాణాల్లో రుషిలా వున్నాడు. ఆకారం చూస్తే 'మహానుభావుడు' అనిపిస్తున్నాడు.

అతిథి మర్యాదలయ్యాయి. తన కూతురి గతచరిత్రను వివరించాడు రామనాథన్. చేతులు జోడించి వినయవిధేయతలతో నిలబడ్డారు. తన ఆఫీసర్ ముందు కూడా అలా మాట్లాడి ఎరుగడేమో!

సరస్వతిని తెచ్చి సాధువు ముందు నిలిపారు. తలనుండి కాళ్ళవరకు సరస్వతిని పరిశీలించాడు సాధువు. కొన్ని క్షణాల పాటు కనులు మూసుకొని ధ్యానముద్ర వహించినట్లు నటించాడు. "చూశావా! సాధువు దివ్యదృష్టితో అంతా తెలుసుకుంటున్నాడు" అన్నాడు రామనాథన్‌తో రఘుపతి.కళ్ళార్పకుండా అందరూ సాధువునే చూస్తున్నారు.

కొంతసేపటికి సాధువు కళ్ళు తెరిచాడు. సర్ప పూజ చేస్తేగాని సరస్వతికి నయం కాదన్నాడు. సర్పపూజ ఎలా చేయాలో రామనాథన్‌కి వివరించాడు. కావలసిన వస్తువులన్నింటినీ చెప్పాడు.

"సరస్వతికి అసలేమయింది స్వామీ!" అంటూ అభ్యర్థనగా అడిగింది రామనాథన్ భార్య.

సాధువు ఆమె వైపు చూశాడు. "తల్లి వైపు చుట్టమైన ఒక స్త్రీ సరస్వతికి మందు పెట్టిందమ్మా! అది బయటకు వస్తే ఆమె రోగం పోతుంది. అందుకే ఈ సర్పపూజ" అన్నాడు.

సరస్వతిని అక్కడ నుండి వేరే గదిలోకి తీసుకెళ్ళారు. సర్పపూజ మరోరోజు చేస్తానని ఆరోజు అన్నీ సిద్ధంచేసి వుంచమని చెప్పి రఘుపతితో బయల్దేరాడు సాధువు. అలాగేనని రామనాథం వారిద్దరినీ తీసుకుని బస్టాండు వరకూ వెళ్ళి వచ్చాడు. దారిలో కందసామి ఎదురయ్యాడు.

ఇంటికి రాగానే కందసామికి విషయమంతా తెలిసింది. సర్పపూజ గురించి తండ్రి వివరించాడు. కందసామి ఈ పూజలు, మంత్రాల వల్ల సరస్వతికి నయంకాదనీ, మానసిక

వైద్యునికి చూపించాలని చెప్పాడు. తండ్రి దానికి వ్యతిరేకించాడు. ఇద్దరికీ వాగ్యుద్ధం పెరిగింది. చివరికి తల్లి జోక్యంతో వారి గొడవ సద్దుమణిగింది.

ఎలాగైతేనేం రామనాథన్ తన పంతమే నెగ్గించుకొన్నాడు.

ఆ రాత్రి పడకగదిలో రామనాథన్‌కీ, అతని భార్యకీ ఒకటే ఆలోచన. సరస్వతికి మందు ఎవరు తిన్పించి వుంటారు? బంధువులందర్నీ చుట్టబెట్టి ఆలోచించారు. వెతగ్గా వెతగ్గా ఓ అమాయకురాలు వారి గురికి తగిలింది. కొన్ని నెలల క్రితం, సరస్వతి తన తల్లికి సోదరి వరసైన ఒకరి ఇంటికి విందుకు వెళ్ళింది. అక్కడే ఆ మందు తినిపించి వుంటారనే నిర్ణయానికి వచ్చారు ఇద్దరూ. ఆ కుటుంబంతో ఇక నుంచి ఎటువంటి సంబంధాలు వుంచకూడదనుకొన్నారు.

సర్పపూజ జరిగే రోజు వచ్చింది. సాధువు రామనాథన్ ఇంటికి చేరాడు. అతని భుజాన ఓ గుడ్డ సంచి వ్రేలాడుతోంది. అందకుముందే పూజకోసం గది సిద్ధం చేయబడింది. ఆ గదిలోకి సాధువుని సాదరంగా తీసుకెళ్ళాడు రామనాథన్. రెండు అరటాకులు పరిచాడు. వాటి మీద పద్మాసనంతో కూర్చున్నాడు సాధువు. తనకెదురుగా చతురస్రాకారాపు ముగ్గు వేసుకున్నాడు. దాని మధ్యలో ఓ రాగి కలశం, దాని మీద ఓ కొబ్బరి బోండాం వుంచాడు. దానికి ఇంకా కొద్ది వెనుకగా కొబ్బరినూనెతో వెలిగే ప్రమిదను ఉంచాడు. సాధువు పక్కగా పరిచిన అరటాకుల్లో అన్నం, పూలు, అరటిపళ్ళు వగైరా వున్నాయి. ఓ మట్టిముంత నిండా పాలు కూడా వున్నాయి.

సాధువు తన సంచిలోంచి పాములా మెలికలు తిరిగిన ఒక కర్రను బైటకి తీశాడు. దాన్ని మట్టిముంత ప్రక్కగా వుంచాడు. బహుశా, అది అతని మంత్రదండం అయివుంటుంది.

ఇంతలో సరస్వతి వచ్చింది. సాధువు కెదురుగా పీట మీద కూర్చుంది. పూజ మొదలయింది. సాధువు మంత్రాలు స్పష్టంగా చదువుతున్నాడు. ఏకబిగిని ఇరవై నిమిషాలపాటు వివిధ శ్లోకాలు, మంత్రాలు చదివాడు. పూజలో మొదటిభాగం పూర్తయింది.

రెండోభాగంలో మొదటి అంశం సాధువు తన ఉపాసనాదేవితో మాట్లాడటం. సంచిలోంచి కలమూ, కాగితాలు తీశాడు. గాలిలోకి చూస్తూ, చెవితో ఏదో వింటున్నట్లుగా నటిస్తున్నాడు. మధ్యమధ్యలో రాస్తున్నాడు. అర్థమయినట్లు తలూపుతున్నాడు. చివరికి కలాన్ని మడచి, కాగితంపైన వున్నదాన్ని తనలో చదువుకొని, సంచిలో పెట్టేశాడు. రామనాథన్‌ని దగ్గరకి రమ్మని చేయి ఊపాడు. తాను 'దేవి'తో మాట్లాడానని, సరస్వతి కడుపులో 'మందు' వున్నట్లు తెలుసుకొన్నానని, దేవి ఆజ్ఞాపించిన విధంగా తాను ఆ 'మందు'ను వెలికి తీస్తున్నానని చెప్పాడు.

ఒక పళ్ళెం నిండా నిప్పులు తెప్పించాడు. సాంబ్రాణి చల్లి, ధూపం వేయసాగాడు. గదినిండా సాంబ్రాణి పొగ అలుముకొంది. సాదువు మంత్రాలు తప్ప గదిలో మరో శబ్దం లేదు. మంత్రోచ్చారణ స్థాయి పెరుగుతోంది. పూజపట్ల సాధువుకున్న నిష్టకు అందరూ కళ్ళప్పగించి చూస్తున్నారు. సాధువు సంచిలోంచి గుప్పెడు మల్లెలు తీశాడు. ఎడమచేతిలోకి మార్చాడు. కుడిచేత్తో ఒక్కొక్కటీ సరస్వతి మీద వేస్తున్నాడు. అప్పుడప్పుడూ ఒక్కో పువ్వును అరిటాకుల మీదున్న అన్నం మీద, పాలముంత మీద వేస్తున్నాడు. పూలు చల్లటం పూర్తయ్యాక, మంత్రదండం చేతిలోకి తీసుకున్నాడు. సరస్వతి చుట్టూ మూడుసార్లు తిప్పాడు. తలనుండి పాలముంతకి, పాలముంత నుండి తలకీ, కిందకి మీదకి చాలాసార్లు మంత్రదండాన్ని కదిలించాడు.

సరిగ్గా ఇదే సమయంలో ముంతలోని పాలు ఊదారంగులోకి మారసాగాయి. క్రమక్రమంగా నీలిరంగులోకి మారుతున్నాయి. అందరి కళ్ళూ మంతలోని పాల మీదున్నాయి. కందసామికి అదంతా ఆశ్చర్యంగానే వుంది.

సాధువు మంత్రదండాన్ని సంచిలో పెట్టాడు. సరస్వతి కడుపులోని విషమంతా దిగిపోయిందని, పాలల్లో అది కలిసిపోవడం వల్ల పాలు నీలంగా మారాయని చెప్పాడు. సరస్వతికి మరేం భయం లేదన్నాడు.

తల్లి మాట పాటిస్తూ సరస్వతి సాధువు కాళ్ళకు మొక్కింది. ఏ భయమూ బాధా లేకుండా కలకాలం జీవించమని దీవించాడు.

తల్లిముఖం సంతోషంతో విప్పారింది. సరస్వతిని తీసుకుని వెళ్ళిపోయింది. సాధువు దగ్గర్లో వున్న ఆ ఇంటి సేవకుడ్ని పిలిచాడు. పాలముంతను అతని చేతిలో పెట్టాడు. “చూడు నాయనా! దీన్ని జాగ్రత్తగా పట్టుకో. నేను చెప్పినట్లు చేయాలి. దీన్ని తీసుకెళ్ళి దొడ్డిలో నీ కుడిచేతి మూడువేళ్ళకి వచ్చినంత ఆవుపేడను తీసి ఈ ముంతలో కలుపు. తరువాత దొడ్డిలో ఒక గొయ్యి త్రవ్వు. పడమటికి తిరిగి ఆకాశం వైపు చూస్తూ ఆ గోతిలోకి ఈ ముంతను గట్టిగా జారవిడు. వెంటనే ఆ గోతిని మట్టితో కప్పెట్టు. ఇందులో ఏ మాత్రం అశ్రద్ధ జరిగినా ప్రమాదమే!” అని పనివాడిని హెచ్చరించాడు. పనివాడు అలాగేనని తలూపి బైటకి నడిచాడు. కందసామి కూడా అనుసరించాడు.

కందసామిలో మెరుపులాంటి ఆలోచన తట్టింది. పనివాడి దగ్గర ముంతను తీసేసుకున్నాడు. ఎవరికీ చెప్పవద్దని సేవకుడ్ని హెచ్చరించి ఆ ముంతను తన గదిలోని అలమరలో పెట్టాడు.

సాధువు తన దక్షిణలు, తాంబూలాలు పుచ్చుకొని తిరిగి ప్రయాణమయ్యాడు. తమ కృతజ్ఞతలు చెప్పుకొన్నారు రామనాథన్ దంపతులు. తమరికి ఇష్టమైన కానుకలేమిటో చెపితే సమర్పించుకొంటామన్నారు. సాధువు తనకు దేని మీదా ఆశలేదన్నాడు. తమ

తృప్తి కోసం తప్పక అడగమన్నారు దంపతులు. తానేమీ తీసుకోనని, డబ్బును ముట్టుకుంటే తన శక్తి, పవిత్రత తగ్గిపోతాయని, మీరంతగా పట్టుబడుతున్నారు గాబట్టి ఓ పాతికరూపాయిలు తన సంచిలో వేయమన్నాడు. అలా వుండాలి జాణతనమంటే!

రామనాథన్ దంపతులు గుసగుసలాడుకున్నారు. సాధువు మహత్తు అతని నిరాడంబర నిస్వార్థబుద్ధి వారిని మెప్పించాయి. ముష్టి పాతికే ఇస్తే తమ గొప్పతనమేముందనుకున్నారు. యాభై రూపాయిల నోటు తీసి ఆయన సంచిలో వేసారు.

కందసామి సాధువును అనుసరించాడు. సాధువును బస్సెక్కించి, తాను కోవూర్ ఇంటికి దారి తీశాడు. కోవూర్‌ని కలిసి జరిగినదంతా చెప్పాడు.

పదిహేను నిమిషాల్లో కోవూర్ కందసామితో కలసి రామనాథన్ ఇంటికి వచ్చారు. కందసామి చూపిన పాలముంతను పరిశీలనగా చూశాడు. మరోపాత్ర తెప్పించాడు. నెమ్మదిగా ఆ నీలిరంగు పాలను ఆ పాత్రలోకి వంచాడు. అపుడు బైటపడింది సాధువు చేసిన మహత్తులోని గమ్మత్తు. ముంత అడుగున ఇంకా కరగకుండా సిరాబిళ్ళ కొంత మిగిలేవుంది. కోవూర్ దాన్ని చేతిలోకి తీసుకుని నిలబడి చూస్తున్న రామనాథన్ చేతిలో పెట్టాడు. అంతేకాదు, సాధువు వారిని ఎలా మోసగించిందీ వివరించాడు.

రామనాథన్ దంపతులు ఒకరిముఖం ఒకరు చూసుకొన్నారు. "ఎంత మోసం! మంత్రాలని తంత్రాలని, దేవితో మాట్లాడానని ఇంత మోసం చేశాడా? ఈసారి కనపడనీ నిలదీస్తాను" ఆగ్రహంతో ఊగిపోయాడు రామనాథన్.

"రామనాథన్‌గారూ! మీ కోపం, ఉడుకుతనం చూస్తే ఆ సాధువుని చంపేసేటట్లున్నారు. ఇందులో అతని తప్పుతో పాటు మీ తప్పూ వుంది. అలాంటి వారిని ఆశ్రయించడం మీ బుద్ధి పొరపాటుగాదూ!" అన్నాడు.

"అదిగాదు సార్! అతీతశక్తులున్నాయని అతగాడు ఎంత నమ్మించాడు? నేను నిజమేననుకున్నాను. ఇలాంటి మోసాలు చేస్తాడని ముందుగా ఎవరు ఊహించగలరు? అనవసరంగా 50 రూపాయిలు ఇచ్చాను".

"అవును మీరు ఇచ్చారు. అతీతశక్తులున్నాయని మీరు నమ్మారు గానీ, అసలు అలాంటివి వున్నాయా? అని మీరు ఎప్పుడైనా ఆలోచించారా? సాధువుకే కాదు ఎవ్వరికీ అతీతశక్తులుండవ్. ఒకవేళ వున్నాయని ఎవరన్నా అంటుంటే వాళ్ళు తప్పక మోసగాళ్ళే అయివుంటారు. నమ్మే అమాయకులున్నంత కాలం వాళ్ళ పబ్బం గడుస్తుంది. ఒకనైనా ఇలాంటి పనులకు ప్రయత్నించకండి" అన్నాడు కోవూర్.

కందసామికిప్పుడు సంతోషంగా వుంది, అసలు సిరాబిళ్ళ ఆ ముంతలోకి ఎలా వెళ్ళింది? తామంతా జాగ్రత్తగా చూస్తూనే వున్నాంగదా. అదే అన్నాడు కోవూర్‌తో.

"కందసామీ! ఇలాంటివి చూసేటప్పుడు మన జ్ఞానేంద్రియాల్ని మన స్వాధీనంలో ఉంచుకోవాలి. ముఖ్యంగా కన్నుని. సాధువులాంటి వారు తమ ట్రిక్కులతో అందరి కళ్ళు కప్పడంలో ముందే తర్ఫీదు పొంది వుంటారు. వేషభాషలతో ప్రక్కదారి పట్టిస్తారు. మీ పనివాడికి ముంతలో ఆవుపేడ కలపమని ఎందుకు చెప్పాడు? పడమటికి తిరిగి ఆకాశం వైపు చూస్తూ ముంతను గొయ్యిలో దబ్బున ఎందుకు పడేయమని శాసించాడు? ఇదిగో ఈ సిరాబిళ్ళ వాడి కంట కూడా పడకూడదనే గదా!

పిచ్చి నమ్మకాలున్నందుకు మనం ఎంతో సిగ్గుపడాలి. కడుపులో 'మందు' వుందని, దాన్ని ఆహారం ద్వారా ఎవరో పగతో తినిపించారని నమ్మడం ఎంత అవివేకమో ఆలోచించండి. ఏమందైనా, లేదా విషమైనా ఆహారంతో పాటు మన కడుపులోకి ఒక వేళ వెళ్ళిందే అనుకోండి, దాని ప్రభావం వెంటనే కనబడుతుంది. లేదా కనీసం మూడు నాలుగుగంటలు పడుతుంది. ఆహారం జీర్ణమైనాక కూడా మనకేమీ కాలేదంటే మనలో ఏ మందూ లేనట్లే. అంతేగానీ, నెలలు, సంవత్సరాల పాటు 'మందు' కడుపులోనే అరగకుండా వుందనుకోవడం మన అజ్ఞానం. అలా ఎవరో మందు పెడతారని నమ్మడం, దాన్ని మంత్రగాళ్ళు, సాధువులే తొలగించగలరని నమ్మి వారినాశ్రయించడం మరింత అమాయకత్వం. ముందు ఈ మత్తులో నుంచి మనం బయటపడాలి.

కోవూర్ వివరణతో రామనాథన్‌కి జ్ఞానోదయమయింది. తాను చేసిన పనికి పశ్చాత్తాపడ్డాడు. సమయానికి సాధువు మోసాన్ని బైటపెట్టినందుకు కోవూర్‌కి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. కోవూర్ సలహా మేరకు సరస్వతికి వెంటనే పెళ్ళి ప్రయత్నం చేస్తానన్నాడు.

మర్నాడు రామనాథన్ ఆఫీస్‌కెళ్ళాడు. రఘుపతిని పిలిచి సాధువు చేసిన మోసాన్ని వివరించాడు. ఇద్దరూ కలిసి సాధువుని వెతికిపట్టుకొన్నారు. పోలీస్‌కి ఫిర్యాదు చేస్తామన్నారు. సాధువు భయపడ్డాడు. తాను చేసిందంతా మోసమేనని ఒప్పుకున్నాడు. 50రూపాయిలు రామనాథం చేతిలో పెట్టి క్షమాపణ కోరుకున్నాడు.

ఇలాంటి దగాకోర్లంతా ఇంతే. అందితే జుట్టూ, అందకుంటే కాళ్ళూ పడతారు.



# దయ్యంతో వియ్యం

ఎడిటర్ గారికి,

మీ(మా) 'సిలుమినా' పత్రిక పాఠకుడు అభయవర్ధనే నమస్కరించి వ్రాయునది. ఈ లేఖ ద్వారా ఒక విషయాన్ని మీ దృష్టికి తేవాలని నా ప్రయత్నం.

'దేహియో విటా' నియోజకవర్గ పరిధిలో 'గోర్క్ గహాయిన్నే' అనే ఒక కాలనీ వుంది. అందులో మిత్రసామీ అనే ఒక పేద రైతున్నాడు. అతని ఇంట్లో చాలా రోజుల్నుంచీ దయ్యాలు తిరుగుతున్నాయి. ఎన్నో వింతలు జరుగుతున్నాయి. అక్కడ అందరూ భయపడుతున్నారు. ఇంట్లో నీళ్ళ కుండలు పగిలిపోతున్నాయి. వంటపాత్రలు విరిగిపోతున్నాయి. గదుల్లోకి రాళ్ళు పడుతున్నాయి. ఉడికే అన్నంలో ఇసుక పడుతోంది. బట్టలు తుంపులవుతున్నాయి. ఇంకా పళ్ళాలు, కప్పులు, సాసర్లు, స్పూన్లు వాటంతటవే బైటకి ఎగిరిపోతున్నాయి. చుట్టుప్రక్కల వారు కూడా ఇది తెలిసి ఎంతో భయపడుతున్నారు. ఇక ఇంట్లోని మిత్రసామీ పెళ్ళాం పిల్లలైతే చావుభయంతో వున్నారు.

మిత్రసామి తన సంపాదనంతా దయ్యాల్ని వదిలించడానికి మంత్రగాళ్ళకు ఖర్చుపెడుతున్నాడు. అతని భయం అతనిది. పస్తులుండడానికైనా సిద్ధపడతాం గాని, ఆ దయ్యం బాధను మాత్రం భరించలేమని వారంతా వాపోతున్నారు.

అయ్యా! ఎడిటర్ గారూ! మీరీ విషయాన్ని పత్రికలో ప్రకటించండి. డాక్టర్ కోవూర్‌గారి గురించి గతంలో విన్నాం. ఇలాంటి వాటినెన్నింటినో వారు పరిష్కరించారని తెలుసుకున్నాం. మీ హోదానుపయోగించైనా, వారిని ఒప్పించి అక్కడికి పంపించి, మిత్రసామి కుటుంబాన్ని ఆదుకోవాల్సిందిగా వారి తరఫున, మానవతా దృష్టితో మిమ్మల్ని కోరుతున్నాను.

తేదీ : 17-11-1963

ఇట్లు
అలియాస్ అభయవర్ధనే

'సిలుమినా' అనే సింహళీయ వార్తాపత్రిక ప్రచురించిన ఆ లేఖను చదివి చిరునవ్వుతో భార్య వంక చూసాడు కోవూర్. అందులో ఏముందో తనూ తెలుసుకోవాలని దాన్ని అందుకుంది అక్కా.

"అయితే ఏమంటారు మీ ఎడిటర్ గారూ?" ప్రక్కనే వున్న సిలుమినా పత్రిక విలేకరినుద్దేశించి అన్నాడు కోవూర్.

"ఎలాగైనా వీలు చేసుకుని, వెళ్ళి, దీన్ని పరిశోధించమని తన వ్యక్తిగత అభ్యర్థనగా మా ఎడిటర్‌గారు మీకు చెప్పమన్నారు సార్!"

"ఇలాంటివి గతంలో చాలా బయటపెట్టాను. అది వారికీ తెలుసు గదా! మళ్ళీ... సరే... వారితో చెప్పండి. తప్పనిసరిగా వెళ్ళి పరిశోధించి అంతా చక్కబరిచివస్తాను".

"సార్, ఏ తేదీ మీరు బయలుదేరుతారో చెపితే మేమూ ఫాలో అవుతాము" విలేకరి ముఖంలో కన్పిస్తున్న ఆసక్తిని కోవూర్ గమనించాడు.

డైరీ తీసాడు. ఒక్క నిమిషం తన ఎంగేజ్‌మెంట్స్‌ను చూసాడు. "డిసెంబర్ 1న బయలుదేరుతాం, సరేనా!"

"ఓ.కే.సార్, మా ఎడిటర్‌గారికి కూడా ఇదే చెప్తాను. మరి నేను వెళ్ళొస్తాను సార్" అంటూ కుర్చీలోంచి లేచాడు విలేకరి.

***

నున్నటి తారు రోడ్డుపై కారు జోరుగా పరుగెడుతోంది. ఆ కారును చూస్తేనే తెలుస్తోంది. అందులో ప్రయాణించే వారి ఉత్సాహం ఎంతో. డ్రైవర్ తన అనుభవాన్ని ఆ రకంగా అందరికీ తెలియచేస్తున్నాడు.

ఉన్నట్టుండి కారు సడెన్‌గా ఆగింది. ఎదురుగా కొండలు. కారు ఆగిన చోట ఎడమ ప్రక్కనే వున్న పెద్ద రావిచెట్టు. ఆ కారు ఎందుకు ఆగిందో!

"ఏమిటీ? డ్రైవర్ టీ త్రాగటానికా?" అడిగాడు కోవూర్. "అందుకోసం కాదులెండి, అదుగో! ఆ డ్రైవర్ ఏంచేస్తున్నాడో చూడండి" అంటూ కొబ్బరికాయను బేరమాడుతున్న డ్రైవర్ని చూపించాడు విలేకరి.

"ఇకముందు అంతా ఘాట్‌రోడ్ కదండీ! దాన్ని ఎక్కబోయేముందు ఇలా దేవుడికి ముడుపులు చెల్లించడం డ్రైవర్లందరికీ రివాజు" అన్నాడు మరో విలేకరి.

"దీనిపై మీ అభిప్రాయం ఏమిటి సార్?" అడిగాడు ఫోటోగ్రాఫర్. డాక్టర్ కోవూర్ అతనివైపు ప్రేమగా చూసాడు. "ఏముందీ? డ్రైవర్ కూడా ఆస్తికులలో ఒకడు. కొబ్బరికాయ

కొడితే దేవుడు మెచ్చి సుఖంగా గమ్యానికి చేరుస్తాడని నమ్ముతున్నాడు. తన మీద తనకు నమ్మకం, పనిలో ఏకాగ్రత వుంటే ఇవన్నీ ఎందుకు? అవేవీ లేనపుడు ఇలాంటి పూజలు కూడా ఆదుకోవు."



"అయితే, మీరు అతనికీ విషయం చెప్పి మాన్పించవచ్చు గదా!"

"ఇది సమయం కాదు, ఇప్పుడు మనం అతన్ని ఆపితే, డ్రైవింగ్‌పై దాని ప్రభావం వుండవచ్చు. ప్రమాదానికీ దారితీయవచ్చు. ప్రస్తుతానికి అతని పూజలు కానివ్వండి. తద్వారా అతనిలో కలిగే విశ్వాసం ఓ మత్తుమందులా అతనికి ఉత్సాహాన్ని ఇవ్వగలుగుతుంది".

కోవూర్ ఇలా అంటుండగానే డ్రైవర్ వచ్చి తన సీట్లో కూర్చున్నాడు. కారు మళ్ళీ పరుగులంకించుకొంది. అయితే కొండరోడ్డు కావడంతో దాని జోరు తగ్గింది.

కొద్దిసేపటికి వర్షం మొదలైంది. ముందున్న రోడ్డు కూడా సరిగా కన్పించడం లేదు. హెడ్‌లైట్లు వేసి, నెమ్మదిగా నడుపుతున్నాడు డ్రైవర్.

"చూసారా! డ్రైవర్ దగ్గర కొబ్బరికాయను లంచంపుచ్చుకుని కూడా దేవుడు అతనికెంత ఇబ్బంది కల్గిస్తున్నాడో!" కోవూర్ ఈ మాట అనీ అనకముందే విలేకర్లు, ఫోటోగ్రాఫర్లు ఒక్కసారిగా పగలబడినవ్వారు. అక్కాకు కూడా తన జోకు నవ్వు తెప్పించినందుకు మురిసిపోయాడు కోవూర్.

***

"అదిగో! గుంపుగా జనం వున్నారు చూడండీ. అదే మిత్రసామి ఇల్లు, మరి నేను వస్తానండీ..."

"మంచిది బాబూ! కృతజ్ఞతలు" అంటూ కోవూర్ తలెత్తి గుంపు వైపు చూసాడు. 'పదండి' అంటూ ముందుకు దారితీసాడు.

కొత్తగా పట్నం నుంచి వచ్చిన ఈ పరిశోధక బృందాన్ని వింతగా చూస్తున్నారు జనం. వారు దగ్గరకు రాగానే తప్పుకుంటూ ఇంటిలోకి దారిచ్చారు.

"రండి బాబుగోరు.. రండి... లోనికి రండి...." అంటూ పోడిసామీ అందర్నీ లోనికి తీసుకెళ్ళింది. కోవూర్ దంపతులిద్దరికీ రెండు కుర్చీలు చూపించింది.

మిగిలిన వారు అటూ ఇటూ చూసారు. ప్రక్కనే ట్రంకుపెట్టె తప్ప మరేమీ ఎత్తుపీటలు లేవు. విలేకర్లు, ఫోటోగ్రాఫర్ దానిమీదే సర్దుకున్నాడు.

పొడిహామీ అందరికీ మంచినీళ్ళు తెచ్చింది.

"బాగా అలసిపోయినారండీ, ఈడికి రావడానికి మీరు చాలా ఇబ్బందిపడుంటారు" నవ్వుతూ గ్లాసులందిస్తూ అక్కా వైపు చూసింది పొడిసామీ.

"అవునండీ! దేహియోవిటా వరకూ బాగానే కారులో వచ్చాం. అక్కడి నుంచి ఇక్కడికి రావడానికి దారి తెలియలేదు. ఈ వూరతను ఎవరో వస్తుంటే కలసివచ్చాం. ఇరుకు ఇరుకుగా వున్న ఈ కొండ దారుల్లోంచి, తుప్పల్లోంచి, పొదల్లోంచి నడవటం కొత్తవడం వల్ల కొద్దిగా ఇబ్బందనిపించింది. కానీ, ఇదొక మంచి అనుభవంలే...."

పక్కనున్న భర్తవైపు చూస్తూ నవ్వింది అక్కా.

"మీ ఆయన లేడమ్మా?" అన్నాడు కోవూర్.

"సిన్న పనుండి పక్కూరుకి పోయాడు బాబుగోరు, పిలవమంటారా?... అరేయ్, పుంచీ! నాన్నని పిల్సకరా పోరా...."

ఆ పన్నెండేళ్ళ కుర్రాడు తల్లి మాటకు హుషారుగా తలూపి బైటికి పరుగుతీసాడు. కోవూర్ కుర్చీలోంచి లేచాడు. ఇల్లును పరిశీలనగా చూడసాగాడు.

ఆ ఇంటిలో రెండు గదులున్నాయి. ముందుగదిలో వారంతా వున్నారు.

"ఇంట్లో ఎవరెవరుంటారమ్మా?" ఫోటోగ్రాఫర్ వాలీపెరేరా ఆమెకు అర్థమయ్యేట్లు చెప్పాడు.

"నేనూ, మా ఆయన, ఎనిమిది మంది పిల్లలూ బాబుగారూ!"

"పిల్లలందరినీ ఒకసారి పిలుస్తారా?" అన్నాడు కోవూర్. వాలీపెరేరా 'దుబాసీ'గా మారిపోయి మళ్ళీ పొడిసామీతో కోవూర్ మాటల్ని వివరించాడు.

"వెంటనే పిల్లల్ని పిలిచింది పొడిసామీ. బృందానికి పరిచయం చేసింది. వాళ్ళందరిలో కుసుమావతి పెద్దది. ఇంట్లోనే వుంటూ మగ్గంపై బట్టలు నేస్తూ వుంటుంది. రెండో అమ్మాయి కరుణావతి, పద్దెనిమిదేళ్ళ వయసు. ఇంట్లో తల్లికి చేదోడు వాదోడుగా వుంటుంది. చదువులో తక్కువైనా అందానికీ ఆరోగ్యానికీ తక్కువేం కాదు. వీళ్ళిద్దరి తర్వాత మగపిల్లవాడు. ఆ వూర్లోనే ఒక బట్టల కొట్టులో వుంటున్నాడు. నాల్గోసంతానం

సిరియావతి, పద్నాలుగేళ్ళుంటాయి. స్కూల్లో చదువుతోంది. అయిదోవాడు పుంజీసేవ. అక్కతో స్కూలుకు వెళుతుంటాడు. మిగిలిన ముగ్గురు చిన్నపిల్లల్లో ఇద్దరు మగ, ఒక ఆడపిల్ల.

ప్రభుత్వం ఇచ్చిన ఎకరం స్థలంలో ఇల్లు కట్టుకొని, వ్యవసాయం చేసుకొంటోంది. మిత్రసామి కుటుంబం. పొడిసామీ అతనికి రెండో భార్య. పైన చెప్పిన ఎనిమిది మందీ ఆమె సంతానమే. మొదటి భార్యకు పుట్టిన ఇద్దరు మగపిల్లలు, ఒక ఆడపిల్ల-పెళ్ళిళ్ళు చేసుకుని వేరుగా ఎవరి బ్రతుకు వారు వెళ్ళదీస్తున్నారు.

కోవూర్ ఆ ఇంట్లో జరిగే 'దయ్యాల తంతు' గురించి అడిగాడు. అతని ప్రశ్నలన్నిటికీ పెరేరా సాయంతో పొడిసామీ జవాబులిచ్చింది.

***

అది రాత్రి 8 గంటల సమయం. సిరియావతి దీపం ముందు కూర్చొని చదువుకొంటోంది. హఠాత్తుగా ఒక రాయి వచ్చి ఆమె పుస్తకంపై పడింది. సిరియావతి వణికిపోయింది. లేచి ఒక్క ఉదుటున తల్లి దగ్గరకు పరుగెత్తింది. పొడిసామీ గదిలోకి వచ్చి చుట్టూచూసింది. బహుశా కిటికీలోంచి ఆ రాయి పడి వుండాలి. అంతా ఇంటి వెనక్కి వెళ్ళి కిటికీ ప్రక్కన ఎవరైనా వున్నారేమోనని చూసారు.... ఎవ్వరూ లేరు. అందరికీ ఆ రాత్రంతా దాన్ని గురించే చర్చ.

రెండో రోజు కుసుమావతి మీద కూడా అదే సమయానికి మరో రాయి పడింది. ఆమె వెంటనే పరుగెత్తి కిటికీలోంచి చూసింది. చీకట్లో ఎవరో పరుగెత్తడం మసగ్గా కనిపించింది. పెద్దగా కేకలేసి ఇంట్లో అందరికీ చెప్పింది. ఎవరై వుంటారు? తమ ఇంటి హద్దుల విషయంలో గొడవపడ్డ ప్రక్క స్థలం కుర్రాడేమో!

ఈ అనుమానంతో మర్నాడు ఆ కుర్రాణ్ణి పిలిపించి పంచాయితీ పెట్టించారు. తను కానేకాదన్నాడు. మిత్రసామి సాక్ష్యం చూపలేకపోయాడు. ఫిర్యాదుని కొట్టివేశాడు పంచాయితీ పెద్ద.

ఆ రాత్రి అంతా కూర్చోని ఆలోచించారు. ఆ కుర్రాడు అలాంటివాడు కాదని, అదేదో దయ్యమే అలా చేస్తున్నదనే నిర్ణయానికి వచ్చారు.

మర్నాడు మంత్రగాణ్ణి పిలిపించారు. నిమ్మకాయలోంచి రక్తం తెప్పించి, "అవును, ఇదంతా దయ్యం పనే" అని నొక్కిచెప్పి పదిరూపాయలు జేబులో వేసుకున్నాడు.

రోజురోజుకీ 'దయ్యపు చేష్టలు' పెరుగుతున్నాయ్. పగలు కూడా ఏవో కొన్ని పీడలు కనబడుతున్నాయి. కుసుమావతి మగ్గం మీద 'పడుగు'ను కత్తితో కోసిన గుర్తులు కన్పించాయి. మగ్గం తాలూకు కొన్ని భాగాలు తొలిగిపోయి వున్నాయి. కొన్ని అక్కడ

నుంచి మాయమై ఇంటి అటకపైకెక్కాయి. దాంతో కుసుమావతి భయపడి ప్రక్క ఊళ్ళో ఉన్న పిన్ని ఇంటికి వెళ్ళిపోయింది.

ఇంట్లో అందరూ భయంభయంగా గంటల్ని లెక్కబెడుతూ గడపడం మిత్రసామికి ఎంతో వేదన కలిగించింది. మూడొందల యాభై రూపాయలు ఖర్చు పెట్టి మంత్రగాళ్ళను రప్పించి 'విడుపు పూజ' చేయించాడు. కానీ ఆ రోజు నుంచీ దయ్యపు చేష్టలు మరీ ఎక్కువయ్యాయి.

ఓసారి అన్నం వండుతుంటే కుండ అడుగున రంధ్రం పడి బియ్యం నేలపాలయ్యాయి. అనేకసార్లు పడ్డ ఇసుక వల్ల అందరూ పస్తులుండాల్సి వచ్చింది. రాత్రి ఇంట్లో పడుకున్నప్పటికీ, ఎవరో ఇంటి చుట్టూ తిరగడం, తలుపులు కొట్టడం అందరూ విన్నారు.

కొన్ని రోజుల పాటు ఇవేవీ జరగలేదు. అంతా ఊపిరి పీల్చుకున్నారు. ఓరోజు నుంచీ మళ్ళీ మొదలయ్యాయి.

పళ్ళాలు, కప్పులు, సాసర్లు ఒక గదిలోనివి మరో గదిలోకి పడిపోతున్నాయి. పెట్టెలోని బట్టలు మాయమయ్యాయి. తర్వాత అటక మీద దొరికాయి. ఇంట్లో ఉన్న ఒకే ఒక లాంతరు పగిలి ముక్కలయింది. గోడకి వ్రేలాడే ఫోటోల అద్దాలు బద్దలయ్యాయి.

మిత్రసామి మూడో ప్రయత్నంగా మంత్రగాళ్ళను రప్పించి మళ్ళీ అయిదువందలు ధారపోసాడు. కానీ ఫలితం సున్న.

ఓరోజు ఇంట్లో అందరికీ విరేచనాలయ్యాయి. ఇరుగుపొరుగు వారు భయపడ్డారు. కుటుంబమంతా వల్లకాటికి పోతుందేమోనని ఆందోళనపడ్డారు. కాలనీలో వున్న అందరూ చందాలేసుకుని అయిదొందల రూపాయిలతో గ్రామదేవతకు 'బలులు' అర్పించారు. విరేచనాల వ్యాధి వేరెవరికీ వ్యాపించలేదు.

మిత్రసామి నాల్గోసారి మంత్రగాళ్ళను రప్పించి 'విడుపు' జరిపించాడు. అయినా ప్రయోజనం శూన్యం.

ఎవరో చెపితే 'సింగరసేన' అనే ఊరి నుంచి మంత్రగాళ్ళ బృందాన్ని రప్పించాడు. 1963 నవంబర్ 3న వచ్చిన ఆ బృందం ఆ ఇంటికి వచ్చిన ఐదవది. ఆ బృందమే 'దయ్యపు పీడ'ను తొలగించగల్గింది!

అందరిలాగే. ఈ మంత్రగాళ్ళు కూడా రాత్రి రెండున్నర గంటల వరకు విడుపుపూజ చేసారు. అలసిపోయి అంతా ముందుగదిలో నిద్రపోతున్నారు. మంత్రగాళ్ళలో పెళ్ళికాని యువకునికి మాత్రం నిద్రరాలేదు. అతని కన్నుల నిండా కరుణావతి అందమే. లేచి కూర్చున్నాడు. లోపలిగదిలో నిద్రపోతున్న కరుణావతి దీపం వెలుగులో మరింత ఆకర్షణీయంగా తోచింది. మొండిధైర్యంతో లేచాడు. నెమ్మదిగా నడుస్తూ వెళ్ళి ఆమె

ప్రక్కన పడుకున్నాడు. కరుణావతి చూసి కూడా ఏమీ అనకపోవడంతో అతని కోరిక ఫలించింది.

తెల్లవారాక మంత్రగాళ్ళంతా బయల్దేరబోతుండగా ఆ యువకుడు మిత్రసామితో కరుణావతిపై తన ప్రేమను తెలియచేసాడు. మిత్రసామి అన్నీ ఆలోచించి, పొడిసామిని సంప్రదించాడు. అందంగా, ఆరోగ్యంగా వున్న ఆ యువ 'మాంత్రికుని' చూసి వారూ తృప్తిగా అతని కోరికను అంగీకరించారు. నవంబర్ 11న పెళ్ళి జరిగింది.

***

కోవూర్ సిరియావతిని పిలిచి 'దయ్యం' గురించి ఆమెనడిగాడు. తన పుస్తకాల్లో దయ్యపు గీతల్ని చూపింది. కాగితాన్ని చింపిందని కూడా చెప్పింది.

కోవూర్, తన భార్యతో కలసి ఇంటిని, బయటి పరిసరాల్ని పరిశీలించాడు. దయ్యం తెరిచిన పెట్టెను పొడిసామి చూపింది. అందులో ఖాళీ సీసాలు, డబ్బాలు ఉన్నాయి.

"ఇంట్లో ఏవైనా మందులున్నాయా?" అడిగాడు కోవూర్.

సిరియావతికి ఏదో గుర్తుకొచ్చింది. వెంటనే లోనికి వెళ్ళి ఓ డబ్బా తెచ్చి చూపింది. అది ఎప్సంసాల్ట్ డబ్బా.

ఓ పదినిమిషాలు కోవూర్, అక్కాతో ఏకాంతంగా మాట్లాడాడు. తిరిగి వచ్చి పొడిసామితో "మీ ఇంట్లో ఇకనుండి ఏ దయ్యమూ వుండదు. మీరు భయం లేకుండా హాయిగా వుండండి. మమ్మల్ని చూడకుండానే ఆ 'దయ్యం' వెళ్ళిపోయింది". అని నవ్వుతూ అన్నాడు.

విలేకర్లు, ఫోటోగ్రాఫర్ పెరేరా కోవూర్ వైపు ఆశ్చర్యంగా చూశారు. మిగిలినవారి పరిస్థితీ అంతే. "అవును, మీ ఇల్లు ఇకనుంచి ప్రశాంతంగా వుంటుంది. ఏ పీడా ఉండదు. మిమ్మల్ని బాధలకు గురిచేసినది దయ్యం కాదు. ఒక వ్యక్తి. ఆ వ్యక్తి ఇపుడు ఈ ఇంటిలో లేరులే.." అన్నాడు కోవూర్. అందరికీ వీడ్కోలు చెప్పి పరిశోధన బృందం ఇంటిముఖం పట్టింది.

కారు జోరుగా ఘాట్‌రోడ్డు మీద పరుగెడుతోంది. డ్రైవర్ ఇంటికి వెళ్ళే హుషారుతో నడుపుతున్నాడు.

విలేకర్లు, ఫోటోగ్రాఫర్ తాము పరిశోధించిన విషయాన్ని గూర్చి ముచ్చటిస్తున్నారు. కానీ ఆ 'దయ్యం' గురించి వారికి ఇంకా సస్పెన్స్ వీడలేదు. అదే అడిగారు కోవూర్ని.

"దయ్యం అంటూ ఏదీ లేదండీ! ఇలాంటివి నేను ఎన్నో కేసులు పరిశోధించాను. అన్నిటిలోను ముద్దాయిలు మనుషులే తప్ప దయ్యాలు కావు. కొంతమంది మానసిక

అనారోగ్యం వల్ల అలా చేస్తారు. వారిలో రెండు వ్యక్తిత్వాలుంటాయి. ఒక వ్యక్తిత్వం చేసేది మరోటి గుర్తించలేదు. అలాంటి మానసిక రోగులు ఇతరులు తేలిగ్గా గుర్తించే వీల్లేకుండానే ఎన్నో చిలిపి పనులు చేస్తారు. యువతీ యువకుల్లో ఇలాంటి వారు ఎక్కువగా కన్పిస్తారు. వయసుతో పాటు పెరిగిన నిరాశ, అలజడి, తీరని కోరికలు వారిచే ఇలాంటి పనులు చేయిస్తాయి. అయితే పెద్దవాళ్ళు ఇలా చేయరనడానికి వీల్లేదు. నాకు తెలిసిన ఓ కేసులో ఒక తల్లి తన బిడ్డల నగలను దాచి, వాళ్ళ బట్టలను తగలబెట్టింది.

ఇకపోతే మనమిపుడు చూసిన ఇంట్లో 'దయ్యం' – కరుణావతి. వయసు, అందం, ఆరోగ్యం వున్న ఆమె, తన అక్కలాగా ఏదో వ్యాపకం పెట్టుకోలేకపోయింది. తన అక్కపై అసూయ పెంచుకుంది. అందుకే ఆమె మగ్గాన్ని నడవకుండా చేసింది. చదువులో తనకన్నా సిరియావతి ఎక్కువ మెప్పుపొందడం నచ్చక పుస్తకాల్ని చించడం, పిచ్చిగీతలు గీయడం చేసింది. తల్లిదండ్రులు పనిలేనిదానిగా తిడుతూ వుండడం కూడా కరుణావతిలో న్యూనత, అభద్రతా భావనలు పెరగడానికి కారణం"

కోవూర్ చెప్పడం ఆపారు. పెరేరాలో మరో అనుమానం మిగిలిపోయింది.

"సార్! మరి అందరికీ ఒకేసారి విరేచన వ్యాధి ఎలా వచ్చింది?"

"అదా! ఏముంది? అన్నంలో ఎప్సంసాల్ట్ కలవడం వల్ల. అదీ ఆమె పనే. ఆమె కూడా ఆ బాధలో ఇరుక్కుంది. ఇకపోతే 'బలులు' ఇవ్వడం వల్ల అది తగ్గలేదు. వాళ్ళ కడుపులో నుండి ఎప్సంసాల్ట్ విసర్జించబడగానే మామూలు మనుషులయ్యారు. కరుణావతికి మంత్రగాడితో పెళ్ళికాగానే ఆమెలోని అభద్రత, న్యూనతలు తొలిగిపోయాయి. అందుకే అప్పటి నుంచి ఆ ఇంట్లో దయ్యపు చేష్టలు తొలిగాయి. దయ్యంతో వియ్యమందిన ఆ మంత్రగాడే ఆ ఇంటిలో సుఖశాంతులు కలిగించాడు".

తన హెడ్‌లైట్ కాంతితో చిమ్మచీకటిని చీల్చుకుంటూ వెళ్తున్న కారు, కోవూర్ సత్యశోధన వలె ముందుకు పరుగెడుతోంది.



# దయ్యం బ్రతికింది!

అవి రెండో ప్రపంచయుద్ధం జరిగే రోజులు. ప్రతి దేశమూ కొత్తగా యువకుల్ని సైన్యంలో ముమ్మరంగా చేర్చుకొంటోంది.

శ్రీలంకలో 'గల్లే'జిల్లాలో అక్మిమానా అనే వూరుంది. ఆ వూరిలో ఉన్న అప్పుసామి మధ్య తరగతి కుటుంబీకుడు. అతని మొదటి భార్యకు 'లీలావతి' అనే కూతురు జన్మించింది. కొంతకాలానికి మొదటి భార్య చనిపోయాక రెండో పెళ్ళి చేసుకున్నాడు. రెండో భార్య కూడా సిరియావతి అనే పాపను అందించి మరణించింది. గల్లేలోని ఒక పచారీకొట్లో గుమాస్తాగా పనిచేస్తూ ఇద్దరు కూతుళ్ళతో జీవితాన్ని నెట్టుకొస్తున్నాడు అప్పుసామి.

లీలావతికి ఇప్పుడు 24ఏళ్ళు. తన చెల్లెలు సిరియావతిని ఎంతో ప్రేమగా పెంచుతూ చదువు చెప్పిస్తూండేది. 10 ఏళ్ళ వయసున్న సిరియావతిని ఇంటి విషయాల్లో తల దూర్చనివ్వక చదువే పరమార్థంగా చూసుకోమని చెపుతూండేది లీలావతి. తండ్రి ఉదయం వెళ్ళి రాత్రి 10గంటలకు చేరుకునేవాడు. పగలంతా అన్ని పనులు లీలావతే చక్కబెట్టుకునేది.

లీలావతి చేతిలో ఎప్పుడూ డబ్బులు గలగల్లాడుతుంటాయి.దాంతో ఇరుగుపొరుగు ఇల్లాళ్ళందరికీ ఆమె అంటే కాస్తంత అసూయ కూడా వుండేది.

'మీరాలిబ్బే' ఆ వూరిలో ఓ చిన్న వ్యాపారి. తోపుడు బండి మీద ఏవో చిన్న చిన్న వస్తువుల్నీ బట్టల్నీ అమ్ముతుంటాడు. ప్రతి బుధవారం లీలావతి ఇంటి ముందుకొచ్చి బండాపుతాడు. లీలావతి తన దగ్గర ఏదో ఒకటి తప్పక కొంటుందనే అతని ఆశ. మీరా ప్రతివారం అలా బండిని ఆమె ఇంటి వద్ద ఆపడం, అమ్మలక్కలకి చర్చనీయాంశం అయింది. అదో వేడుకగా కూడా మార్చుకున్నారు. వారు కూడా ఆ బండి చుట్టూ చేరసాగారు. అయితే వాళ్ళు రావడం వల్ల మీరాకు వచ్చిన లాభం లేదు. వాళ్ళలో ఒక్కరూ ఏ ఒక్కటీ కొనేవాళ్ళు కాదు. వస్తువుల బాగోగులు ముచ్చటించడం, లీలావతికి వస్తువుల ఎంపికలో ఉచిత సలహాలివ్వటం – ఇదీ వారిపని.

మీరా వ్యాపారం మొత్తంగా లాభసాటిగానే వుండేది. ఒక్కోసారి బండి బరువుగా వున్నప్పుడు శరత్ అనే యువకుడు కూడా మీరా వెంట బండిని తోయడానికి వస్తుంటాడు.

***

ఆ వూర్లో సోమపాల్ అనే యువకుడున్నాడు. అతడి తండ్రి ఒక రైతు. పదో తరగతి తప్పాక ఏ పనీ దొరక్క అప్పుసామి పనిచేసే పచారీ కొట్టులోనే గుమస్తాగా కుదిరాడు. ఆ తర్వాత కొందరు మిత్రుల సహకారంతో సైన్యంలో చేరేందుకు ఇంటర్వ్యూకి కూడా వెళ్ళివచ్చాడు. సోమపాల్‌కీ అప్పుసామికీ బాగా పరిచయమయింది. అప్పుడప్పుడు ఇంటికి రాకపోకలు కూడా పెరిగాయి. లీలావతి, సోమపాల్ కంటిలో పడింది. పరస్పరం ఆకర్షించుకున్నారు. ఓ రోజు తన అభిప్రాయం చెప్పాడు సోమపాల్. అప్పుసామికి కూడా నచ్చింది. సోమపాలెంత యోగ్యుడో అతనికి తెలుసు. ఇద్దరికీ పెళ్ళి చేశాడు. పెళ్ళయ్యాక అల్లుణ్ని, కూతుర్ని ఇంట్లోనే వుంచుకున్నాడు.

పెళ్ళయి సరిగ్గా నలభై రోజులయింది. కొలంబోలోని సైన్యం హెడ్‌క్వార్టర్స్ నుంచి హఠాత్తుగా ఓ ఉత్తరం వచ్చింది. సోమపాల్ సైన్యంలో ఎంపికయ్యాడని, వెంటనే బయలుదేరిరరమ్మని దాని సారాంశం. సోమపాల్ అన్నీ సర్దుకున్నాడు. లీలావతికి ఈ ఉత్తరం వచ్చిన దగ్గర్నుండీ కన్నీళ్ళాగటం లేదు. అంత త్వరగా ఇద్దరి మధ్య ఎడబాటు వస్తున్నందుకు ఆమె భరింపరాని వేదనకు గురయింది.

అందరూ స్టేషన్ దాకా వెళ్ళి వీడ్కోలు ఇచ్చారు సోమపాల్‌కి. అక్కడ నాలుగునెలల ప్రాధమిక శిక్షణ పూర్తయ్యాక 50 మంది తోటి సైనికులతో యుద్ధరంగానికి పంపబడ్డాడు సోమపాల్.

భర్త వెళ్ళిన దగ్గర్నుంచీ లీలావతి పొందుతున్న దు:ఖం వర్ణనాతీతం. మొదట్లో ఎంతో దిగులుగా వుండేది. ఇంటి మీద వంటి మీద కూడా శ్రద్ధ చూపేది కాదు. భర్త దగ్గర్నుండి ఉత్తరాలు రావడం మొదలయ్యాక ఆ వియోగబాధ కొంత ఉపశమించింది. ప్రతినెలా రెండో మూడో ఉత్తరాలు, జీతంలో కొంతభాగం మనియార్డరుగా లీలావతికి అందేవి. 'యూనిఫాం'లో తాను దిగిన ఫోటోలు పంపాడు సోమపాల్. వాటిని చూసి ఎంతో మురిసిపోయింది. అమ్మలక్కలకి వాటిని చూపి మిలట్రీలో తన భర్త రాసిన కబుర్లన్నీ చెప్పేది. మీరాకి, శరత్‌కి కనీసం అయిదారుసార్లయినా అవి చూపించి పొంగిపోయింది.

లీలావతికి అమ్మలక్కల కబుర్లంటే ఇష్టం వుండవు. చెల్లిని స్కూలుకి పంపి, ఇంట్లో పనులన్నీ చేసుకుని దిండు గలీబులు కుట్టేది. వాటిని మీరాకి అమ్మి డబ్బు కూడబెట్టేది. అప్పుసామి పనిలోకి వెళ్ళాక, మీరా, శరత్‌లు తప్ప లీలావతి దగ్గరకు మరే మగవాడు వచ్చేవాడు కాదు.

భర్త దగ్గర్నుండి వచ్చే ఉత్తరాలు చదవడం లీలావతికి కష్టంగా ఉండేది. అయినా స్వయంగా చదువుకోవడంలో ఎంతో తృప్తి కనిపించేది. అయితే తాను ఏదైనా రాయాలనుకుంటే సాధ్యమయ్యేది కాదు. అందుకోసం శరత్ సాయం అవసరమయింది. క్రమంగా సోమపాల్ నుంచి ఉత్తరాలు తగ్గిపోయాయి. తర్వాతర్వాత పూర్తిగా ఆగిపోయాయి. నెలవారీ పంపే డబ్బు మాత్రం అందుతూనేవుంది.



భర్తవియోగాన్ని కొంతయినా తగ్గించే ఉత్తరాలు కూడా ఆగిపోవడం లీలావతికి చాలా బాధనిపించింది. ముఖంలో ఏ సంతోషమూ కన్పించదు. జీవితం పట్ల నిరాశ ఆమె ముఖంలో బాగా కన్పించేది. మీరా కూడా రావడం లేదు. లీలావతి వద్ద అతనికి కొనుగోలు తగ్గడమే కారణం. ఏరోజైనా వస్తే లీలావతి గోడు భరించలేకపోయేవాడు. కనీసం ఒక్క ఉత్తరమైనా రాయమని భర్తను ప్రార్థిస్తూ ఎన్నో ఉత్తరాలు రాయించింది. కానీ ఆమె ఆశ నిరాశగానే మిగిలింది. మీరా రాకపోకలు కూడా ఆగిపోయాయి. బదులుగా శరత్ రాసాగాడు. ప్రతిరోజూ లీలావతిని చూడడానికి వచ్చేవాడు. మీరా దగ్గర రోజుకూలీకి ఉదయం 8గంటల నుండి సాయంత్రం 5 గంటల వరకు పనిచేస్తాడు. తర్వాత లీలావతి ఇంటికి వస్తాడు. రాత్రి ఎనిమిదయిందాకా వుండి వెళతాడు. ఇదీ అతని దినచర్య.

లీలావతి తన ఆవేదనంతా శరత్‌ముందు వెళ్ళగక్కేది. ఆమెను ఓదారుస్తూ అవీ ఇవీ చెప్పేవాడు. అప్పుడప్పుడూ కొన్ని కల్పనలు జోడించేవాడు. ఎంత మంచివాళ్ళయినా మగవాళ్ళు మిలట్రీలో చేరితే చెడిపోతారనీ, వ్యభిచారానికి అలవాటుపడతారని చెప్పేవాడు. ఇతర దేశాల ఆడోళ్ళ పరిచయం పెరుగుతుందని, వాళ్ళ మోజులో పడి ఇంటి ఇల్లాళ్ళను కూడా మరచిపోతారని, కొందరైతే వాళ్ళనే పెళ్ళాడతారని చెప్పేవాడు. ఈ మాటలతో లీలావతికి గుండె చెరువయ్యేది. కన్నీళ్ళు కాలువలయ్యేవి.

సోమపాల్ సైన్యంలో చేరకుండా పచారి షాపులోనే వుంటే ఎంత బాగుండేది అన్పించేది లీలావతికి.

తన నిరాశమయ జీవితంలో శరత్ రాక ఒక ఆశాకిరణంగా వుండేది లీలావతికి. అతని కోసం సాయంత్రాలు ఎదురుచూసేది. ఆమె కడుపులో పెరిగే పిండం కూడా సోమపాల్‌పై ఆమెకున్న వియోగ దుఃఖాన్ని ఉపశమింపచేసింది. అయితే మరోప్రక్క

లీలావతి, శరత్‌ల స్నేహం అందరి నోళ్ళలో కథలు కథలుగా నానుతోంది. అమ్మలక్కలకు రోజూ ఆ కథలతో కడుపునిండిపోతోంది.

ఉన్నట్టుండి శరత్ లీలావతి ఇంటికి రావడం మానేశాడు. లీలావతి కొన్ని రోజులు అతని కోసం ఎదురుచూసి చెల్లి ద్వారా విచారించింది. శరత్ ఆ వూరినే వదిలి వెళ్ళిపోయాడట. ఇంత జరుగుతున్నా అప్పుసామికి ఈ విషయాలేవీ తెలియవు.

1946 ఆగస్ట్‌లో లీలావతి ఓ మగబిడ్డను కంది. అప్పుసామి ఆనందానికి అవధి లేదు. చాలారోజులకి తమ ఇంట్లో మగబిడ్డ కేరింతలు వినిపిస్తున్నందుకు పొంగిపోయాడు. ఓ గొప్ప జ్యోతిష్యుడి చేత జాతకం రాయించాడు. తన మనవడు ఓ మేధావి, ఆస్తిపరుడూ అవుతాడట. ఓ గొప్ప నాయకుడై, గొప్పవారితో స్నేహం చేసి ధనవంతురాలిని పెళ్ళాడతాడట. ఇంతవరకు బాగానే వుంది. మొదటి అయిదేళ్ళ కాలంలో శని ప్రభావం పడకుండా చూసుకోవాలట. ఏ అజాగ్రత్త జరిగినా ప్రాణాపాయం జరగవచ్చునట.

మనవణ్ని కంటికి రెప్పలా చూడమని అప్పుసామి లీలావతిని మరీమరీ హెచ్చరించేవాడు. లీలావతికి కూడా తన బిడ్డే ఇప్పుడు సర్వస్వమూ.

1946 నవంబర్‌లో లీలావతికి సైన్యం ప్రధాన కార్యాలయం నుండి ఓ టెలిగ్రాం వచ్చింది. అది టెలిగ్రాం కాదు. లీలావతి గుండెలపై బడ్డ కొండ. యుద్ధంలో సోమపాల్ మరణించాడట! ఆ వార్త లీలావతికి అశనిపాతం. గుండెలు కరిగి కన్నీళ్ళై ప్రవహించేలా ఏడుస్తోంది. ఇరుగుపొరుగు వారి ఏ ఓదార్పుకు ఆ దుఃఖం లొంగడం లేదు. అప్పుసామికీ వార్త తెలిసి పరుగు పరుగున వచ్చాడు. కూతురి మాంగల్యం మట్టిపాలయినందుకు కుమిలిపోయాడు. ఆ రాత్రి లీలావతి ఇల్లు ఒక శోకసముద్రం.

మర్నాడు అప్పుసామి పన్లోకి పోలేదు. బంధువులు, ఇరుగు పొరుగు వాళ్ళు కూడా వాళ్ళ దుఃఖానికి సానుభూతిని చిలకరిస్తున్నారు. యుద్ధం, మిలట్రీ, మీరా, శరత్, లీలావతి, అప్పుసామి, సోమపాల్... ఇలా అనేక విషయాల మీద వాళ్ళ కబుర్లు సాగుతున్నాయి. ఇంతలో హఠాత్తుగా పైకిలేచింది లీలావతి. అందరూ విస్తుపోయి చూశారు. చేతులు ప్రక్కలకు చాపింది. శరీరమంతా బిగుసుకుపోయింది. కళ్ళు ఎర్రటి పత్తికాయల్లా వికసించాయి. వళ్ళంతా వూగిపోతుంది. వికృతమైన నవ్వు, అరుపులు గొంతులోంచి తన్నుకొస్తున్నాయి.

“ఒరేయ్! నిన్ను ఇంతటితో వదల్రా! నిన్ను నాశనం చేసేదాకా వదల్రా! నీ మూలంగా నా భార్యకీ కష్టం వచ్చిందిరా! ఆమెను మోసం చేస్తావట్రా! నిన్నూ నీ బిడ్డనీ నమిలిమింగుతారా. మనుషుల రక్తం నాకు కొత్త కాదు. ఎంతోమందిని చంపాను. ఆ శరత్ గాణ్ని, వాడి బిడ్డని చంపాకనే నేను శాంతిస్తాను” అంటూ అరచీ అరచీ లీలావతి తిరిగి నేలపై పడింది. పావుగంట వరకు స్పృహరాలేదు.

అది సోమపాల్ పనేననుకున్నారు అంతా. యుద్ధంలో చచ్చి దయ్యమయ్యాడని, లీలావతిని పూనాడని ఏకాభిప్రాయానికి వచ్చారు. లీలావతి దగ్గర పసిబిడ్డను వుంచటం మంచిది కాదని అప్పుసామికి సూచించారు.

అప్పుసామి మనవణ్ణి తన చెల్లెలి వద్ద వుంచాలనుకున్నాడు. కూతురు ససేమిరా అంది.

ప్రతిరోజూ రాత్రి భోజనాలయ్యాక 'పూనకం' వస్తోంది. మిలట్రీ కేకలతో తన ఇంటి చుట్టూ మార్చింగ్ చేస్తోంది. మధ్య మధ్యలో శరత్‌ని తిడుతోంది. చంపుతానని అరుస్తోంది. పగలు మాత్రం లీలావతి బాగానే వుంటోంది. తన బిడ్డను కూడా చక్కగా చూసుకొంటోంది. రాత్రి అప్పుసామి మనమణ్ణి తన పక్కలోనే వుంచుకున్నాడు. లీలావతి నుండి సోమపాల్ ఆత్మని దూరం చెయ్యాలని అప్పుసామి నిశ్చయించుకున్నాడు. కొందరు పేరున్న మంత్రగాళ్ళను పిలిపించాడు. పూజలు ఏర్పాటు చేయించాడు. ఖర్చు ఎంతైనా లీలావతి మామూలు మనిషి కావడమే తనకు కావల్సింది.

పూజ జరుగుతోంది. దయ్యాన్ని వదలగొట్టాలని మంత్రగాళ్ళు నానా హంగామా చేస్తున్నారు. తప్పెట్లు లయబద్ధంగా మార్మోగిపోతున్నాయి. కడుపునిండా తాగిన కల్లుమత్తు ఎక్కువై వళ్ళంతా మరిచి డాన్స్ చేస్తున్నారు. అప్పటిదాకా మౌనంగా వున్న లీలావతిలో ఏదో కదలిక మొదలయింది. ఆమె కూడా లేచి మంత్రగాళ్ళతో కాళ్ళు కలిపింది. ఉండీ ఉండీ ఒక్కసారిగా వాద్యాలన్నీ ఆగిపోయాయి. వారిలో పెద్ద మంత్రగాడు లీలావతిని సమీపించి మంత్రదండంతో ఆమె నుదురు తాకాడు. ఆమెతో ఇలా సంభాషించాడు.

మంత్రగాడు : రేయ్? ఎవడ్రా నువ్వు?

లీలావతి : నేను సోమపాల్‌ని

మంత్రగాడు : ఇక్కడికెలా వచ్చావ్ ?

లీలావతి : ఓడలో

మంత్రగాడు : ఎందుకొచ్చావురా?

లీలావతి : నా భార్యని చూట్టానికి

మంత్రగాడు : నీకిక్కడేంపని?

లీలావతి : ఆ శరత్ గాడు నా భార్యని మోసం చేశాడు. వాడి బిడ్డ ఇపుడు నా భార్య దగ్గర పెరుగుతున్నాడు. అలా వుండటం నాకిష్టం లేదు.

మంత్రగాడు : ఇష్టం లేకపోతే ఏం చేయగలవ్?

లీలావతి : ఏం చేస్తానా? హహ్హాహ్హా! చంపుతాను. వాడ్ని, వాడి బిడ్డని ఇక్కడ లేకుండా చేస్తాను. లేదా నువ్ ఆ పనిచేసినా నేను వెళ్ళిపోతాను. నాకు రక్తం కావాలి ఇస్తావా?

మంత్రగాడు : ఆ ఇస్తాను. రక్తం ఇస్తాను, వెళ్ళిపో.

లీలావతి : వెళతాను. అదిగో, ఆ తోటలో పనసచెట్టు లేదూ! అక్కడికి పోతాను. నువ్వు ముందు వాళ్ళిద్దర్నీ చంపు. నేను వెళ్ళగానే ఆ చెట్టు మీదెక్కి గట్టిగా ఊపుతాను. అదే గుర్తు.

లీలావతి నేలమీద పడిపోయింది. మంత్రగాడు రెండు కోళ్ళను బలిఇచ్చాడు. లీలావతి లేవకముందే మంత్రగాళ్ళంతా దగ్గర్లో వున్న పనసచెట్టు దగ్గరకెళ్ళారు. జనం అనుసరించారు. పనసచెట్టును ఉద్దేశించికొమ్మ ఊపమన్నాడు మాంత్రికుడు. ఎవరికీ ఆ చీకటిలో ఏమీ సరిగా కనిపించడం లేదు. ఎవరూ గమనించకపోయినా కొమ్మ ఊగిందని, దయ్యం వెళ్ళిపోయిందని నిర్ధారించాడు మంత్రగాడు. అప్పటికే అర్ధరాత్రి ఒంటిగంట దాటింది.

యుద్ధంలో మరణించిన సోమపాల్‌కి సరిగ్గా అంత్యక్రియలు జరగలేదని, ఆ అసంతృప్తితో లీలావతిని పూనాడని మంత్రగాడు చక్కగా కథ కల్పించాడు. తమకు రావాల్సిన సొమ్ము పుచ్చుకుని అందరూ వెళ్ళిపోయారు.

రెండు మూడు రోజుల వరకు లీలావతి మామూలుగానే వుంది. అందరూ తగ్గిపోయిందనుకొన్నారు. ఓరోజు పనసకాయ కూర తిన్నది. అది కూడా సోమపాల్ దయ్యం ఎక్కిన చెట్టు కాయే! అది తెలుసుకున్నాక, లీలావతి కథ మళ్ళీ మొదటికొచ్చింది.

***

కోవూర్ ఆ సమయంలో 'గల్లే'లోని రిచ్‌మండ్ కాలేజిలో పనిచేస్తున్నాడు.

ఓరోజు అప్పుసామి తన షాపు యజమాని ప్రియదాసతో కోవూర్ దగ్గరకెళ్ళాడు. ప్రియదాస కోవూర్‌కి స్నేహితుడు.

అప్పుసామి లీలావతి పరిస్థితిని వివరించాడు. ఎలాగైనా తన కూతుర్ని మామూలు మనిషిని చేసి తనకు దక్కించమని ప్రాధేయపడ్డాడు. తన మనవడికి తండ్రి ఎటూ లేదు. తల్లి కూడా కరవైతే తాను తట్టుకోలేనని ఎంతో కుమిలిపోయాడు.

కోవూర్ అప్పుసామిని ఓదార్చాడు. ఇంతమాత్రాన తాను రావలసిన అవసరం లేదన్నాడు. లీలావతిపై తన అభిప్రాయాన్ని విడమర్చి ఇలా చెప్పాడు.

లీలావతిని పీడించేది సోమపాల్ ఆత్మ కాదు, దయ్యమూ కాదు. లీలావతి సోమపాల్ మరణవార్త విని భ్రమించింది. తాను తప్పుచేశానని పదుగురూ అనుకొంటారని, శరత్‌తో తాను అతి చనువుగా ప్రవర్తించినట్లు అందరూ అనుమానిస్తున్నారని భయపడింది. ఆమెకేర్పడిన అభద్రత, ఆత్మన్యూనత ఆమెలో కొన్ని భ్రమలు కల్పించాయి. చిన్నప్పట్నుంచి చచ్చిన మనుషులు దయ్యాలవుతారని, తమకిష్టమైనవారిని లేదా తమకు ద్రోహం చేసినవారిని పట్టి పీడిస్తారని అందరిలా లీలావతి కూడా నమ్మింది. సోమపాల్ చచ్చి తన వద్దకు చేరివుంటాడని ఊహించుకుంది. తన దగ్గర వున్న బిడ్డను చూసి అతడు క్షమించడని భావించింది. ఇలాంటి ఊహలతో ఆమె మనసంతా చికాకు పడింది. దాని ఫలితమే ఈ 'పూనకం'.

ఆత్మలు, దయ్యాలు, పూర్వజన్మ జ్ఞాపకాలు, మంత్రతంత్రాలు, శాపాలు - ఇవన్నీ నిరాధారమైన నమ్మకాలు. ఇవెంత అబద్ధమో, దయ్యాల్ని , ఆత్మల్ని వదిలిస్తామని చెప్పడం అంతే అబద్ధం. మోసం కూడా.

ఇలా పూనకాలు వున్నవాళ్ళలో చాలామందికి పారాథైరాయిడ్ గ్రంధులలోపం కారణమవుతుంది. మతపరమైన పండగల్లో, జాతర్లలో, బలులిచ్చేచోట, దయ్యాలను వదిలించేచోట ఇలా పూనకాలు రావడానికి ఆయా వ్యక్తుల్లో వున్న బలహీన మానసికస్థితి, నమ్మకాలు కారణం. ఈ మూఢనమ్మకాల్ని ఆసరాగా చేసుకొని మంత్రగాళ్ళు, తంత్రగాళు ళ్ళ, క్రైస్తవఫాదర్లు, పూజార్లు, దయ్యాలు, పూనకాలు నిజమేనని ప్రచారం చేస్తారు. వాటిని వదిలిస్తామని అనేక తంతులు జరుపుతారు.

ఈ కేసులో మంత్రగాడు దయ్యాన్ని పనసచెట్టు మీదకి తోలాడనడం, కొమ్మ వూగిందనడం నిజం కాదు. అసలే చీకటి, అందులో నల్లని పనసచెట్టు. ఎవరు గమనించగలరు?

ఇలా కోవూర్ చెప్పేదంతా విన్నారు ప్రియదాస, అప్పుసామిలు. ప్రియదాసకు ఓ అనుమానం వచ్చింది "సారూ! లీలావతి ఇలా ఇప్పుడే ప్రవర్తించడానికి కారణం ఏమిటి?" అన్నాడు.

"సోమపాల్ ఆత్మ దయ్యమై తన దగ్గరికి వచ్చి వుంటుందని లీలావతి నమ్మింది. దయ్యాలు కూడా దేవతల్లా ఎక్కడికయినా వెళ్ళగలవని, అన్నీ తెలుసుకోగలవని ఆమె గట్టిగా నమ్మింది. తన అంతశ్చేతనలో శరత్ పట్ల తాను చూపించిన చనువు సోమపాల్‌కి తెలిసి వుంటుందని ఆమె భయపడింది. లోలోపల ఆమెకున్న గందరగోళం, ఒత్తిడి పెరిగి ఇలా ప్రవర్తించసాగింది. సోమపాల్ మరణవార్త ఆమెకు తెలియకపోతే ఎంతకాలమైనా మామూలుగానే వుండగలిగేది" అన్నాడు కోవూర్.

లీలావతిని అందరికీ దూరంగా కొంతకాలం వుంచమని అప్పుసామికి సలహా ఇచ్చాడు కోవూర్. ఈ స్థితి వున్నవారిలో ప్రదర్శనాభావం ఎక్కువగా వుంటుందని, మాటిమాటికీ ఇలా 'పూనకాలు' ప్రదర్శిస్తారని చెప్పాడు.

అప్పుసామి, ప్రియదాసలు వెళ్ళిపోయారు. వారికి కోవూర్ ఇచ్చిన వివరణ, సలహాలు అంతగా రుచించలేదు. అది కోవూర్‌కీ తెలుసు. అందుకే ఓరోజు అతడు ప్రియదాసతో కలసి అప్పుసామి ఇంటికి వెళ్ళాడు. రెండువారాల నుండి లీలావతి అందరికీ దూరంగా వుంచబడింది. ఇప్పుడు పరిస్థితిలో మార్పు వచ్చిందని చెప్పాడు అప్పుసామి. దయ్యాలు పూనడం అబద్ధమని, ఆమె అంటే సోమపాల్‌కి ఎంతో ఇష్టం కనుక సోమపాల్ అలా పూనాడని లీలావతిని నమ్మించి తిరిగి వచ్చాడు కోవూర్.

1947 మార్చిలో కోవూర్‌కి ప్రియదాస నుండి ఓ ఉత్తరం వచ్చింది. సోమపాల్ యుద్ధంలో చనిపోలేదని, యింటికి వచ్చాడని రాశాడు. శత్రువుల చేత ఖైదీగా పట్టుబడ్డాక కొలంబో సైనికాధికారులు విషయం తెలియక ముందే సోమపాల్ చనిపోయాడనుకుని తొందరపాటుతో టెలిగ్రాం ఇచ్చారట. కొన్నాళ్ళ తర్వాత శత్రువులు సోమపాల్‌ని వదిలేశారట.

కోవూర్ ఈ ఉత్తరం చూసి నవ్వుకున్నాడు. తిరిగి జవాబిస్తూ “ప్రియదాసా! బ్రతికున్నవాళ్ళు కూడా దయ్యాలై పూనడం విచిత్రంగా లేదూ! ఇప్పుడైనా తెల్సిందా, దయ్యాలు పూనటం అబద్ధమని?” అన్నాడు.



# వెలుతురు చెట్లు

దుమ్ము రేపుకుంటూ వేగంగా వచ్చిన ఓ కారు హఠాత్తుగా ఆ ఇంటి ముందు ఆగింది. డోర్లు తెరుచుకున్నాయి. చేతిలో తుపాకులతో ముగ్గురు వ్యక్తులు బయటకు వచ్చారు. తుపాకులు సవరించుకుంటూ చుట్టూ కలయజూస్తున్నారు.

ఆ శ్రీలంక వాసులు ముగ్గురూ చూట్టానికి ఒకే వయసులో వుంటారు. ఒకే పని కోసం తుపాకులు పట్టుకున్నవాళ్ళలా వున్నారు. ఆ రోజు శనివారం, 1930వ సంవత్సరం.

వాళ్ళు శ్రీలంక తమిళ టైగర్లు కారు. వాళ్ళు బందిపోటు దొంగలు అంతకంటే కారు. వాళ్ళు కేవలం టీచర్లు. చిన్న గడ్డం, తలపై చిన్న టోపీ, కళ్ళకి అద్దాలు ధరించి సన్నగా వున్న ఆ వ్యక్తి డాక్టర్ కోవూర్. మిగిలిన ఇద్దరూ శామ్యూల్ జాకబ్, ఎస్.ఎ.మాన్. ముగ్గురూ జాఫ్నా సెంట్రల్ కాలేజ్‌లో టీచర్లే. అప్పుడప్పుడూ ముగ్గురూ కలసి వేటకు వెళుతుంటారు. అందుకోసమే ఈసారి 'ఒడ్డుచుట్టాన్' అడవిలోకి వేటకై వచ్చి 'మాంకులం' గెస్ట్‌హౌస్ ముందాగారు.

ఇలా వచ్చేవాళ్ళకు మార్గదర్శకులుగా ఆ అడవిలో చాలామంది వున్నారు. వారిలో ఒకడు చిన్నయ్య. చిన్నయ్య కూడా ఓ చిన్నపాటి వేటగాడే. ఆ అడవిలో ఏ అంగుళంలో ఏముందో చిన్నయ్యకి తెలుసు. అందుకే చిన్నయ్యను తమకు మార్గదర్శిగా కుదుర్చుకున్నారు ఈ వేటగాళ్ళు.

చిన్నయ్య ఆ అడవికి సంబంధించిన పటాల్ని టేబుల్ మీద పరిచాడు. ఎక్కడేముందో చెబుతున్నాడు. ముగ్గురూ శ్రద్ధగా వింటున్నారు. 'ఒలుమాడు' అనే ప్రాంతం వారికి నచ్చింది. అక్కడే ఆ రాత్రికి వేటాడాలనే నిశ్చయానికి వచ్చారు. చిన్నయ్యతో అదే చెప్పారు.

"వద్దు సార్! మనం అక్కడికి వెళ్ళొద్దు" భయపడుతున్నట్లు చెప్పాడు చిన్నయ్య.

"ఏం? అక్కడ జంతువుల్లేవా?" అడిగాడు జాకబ్.

"జంతువులున్నాయి సార్! కానీ ఎవరూ అక్కడకెళ్ళి వేటాడలేరు"

"కారణం?" ప్రశ్నించాడు మాన్.

"ఆ ప్రాంతమంతా కాదేరి దయ్యాల కాపలాలో వుంది సార్"

ముగ్గురూ ఆశ్చర్యపోతూ ఒకరినొకరు చూసుకున్నారు.



"చిన్నయ్యా! కాదేరి దయ్యమేమిటి?" ఈసారి కోవూర్ చిన్నయ్య వైపు చూస్తూ అడిగాడు.

''అడవిలో వుండి కావలా కాచే దయ్యాన్ని కాదేరి అంటారు సార్! అక్కడికి ఎవరెళ్ళినా ప్రాణాలతో తిరిగి రాలేరు. ఓసారి ఏమయిందంటే..." చిన్నయ్య కావాలనే ఆపాడు.

"ఆ ఏమయింది? చెప్పు" జాకబ్ అడిగాడు.

"ఇది ఆరేళ్ళనాటి సంగతి, మీలాగే నలుగురు మనుషులు వేటాడ్డానికి వచ్చారు సార్! ఈ ఒలమాదు దగ్గరకి వెళ్ళారు. అక్కడే ఓ నీటిగుంట వుంది. అక్కడికి ఎందుకెళ్ళారో తెలియదు కానీ, మర్నాడు ఉదయం అటువెళ్ళినవారికి ఆ నలుగురూ శవాలై కన్పించారు. తుపాకులు కూడా వాళ్ళ పక్కనే వున్నాయి. నాలాంటోణ్ణి కలిస్తే అక్కడికి వెళ్ళొద్దని చెప్పే వాళ్ళు. వాళ్ళు అలా కలవకుండా వెళ్ళారు. ఆ 'కాదేరి'కి బలయ్యారు."

"చిన్నయ్యా! కాదేరి ఎక్కడ వుంది? ఎలా వుంటుంది? నువ్వెప్పుడైనా చూశావా?" మాన్ ప్రశ్నల పరంపర కురిపించాడు.

"చూడకపోవటమేంటి సార్! దాన్ని గురించి నాకు బాగా తెలుసు. ఆ దయ్యానిది చాలా పెద్దకుటుంబం సార్! ఇంతకీ అవి ఎలా వుంటాయో మీకు చెప్పలేదుగా. చెట్ల రూపంలో వుంటాయి. రెండు పెద్దవి, వాటి ప్రక్కనే చిన్నవీ వుంటాయి. పెద్దవి రెండూ తల్లిదండ్రులట. ప్రక్కనున్నవి వాటి పిల్లలట. ఎవరో బాగా మంత్రాలొచ్చినోళ్ళు మాత్రమే వాటి దగ్గరదాకా వెళ్ళి చూడగలరు గానీ అందరివల్లా కాదు. పగలంతా ఆ దయ్యాలు, జంతువులై తిరుగుతాయట. చీకటి పడేసరికి మళ్ళీ పాల్ చెట్ల రూపానికి మారతాయంట. ఎవరైనా తుపాకీతో కాల్చారా, వాళ్ళకీ భూమ్మీద నూకలుండవ్. మరో సంగతి సార్! ఆడికిపోతే రాత్రి పగలులాగే వుంటుంది. ఆ దయ్యాలనుండి అంత వెలుగువస్తుంది సార్!"

చిన్నయ్య చెప్పేదంతా వింటూ జాకబ్, మాన్ భయపడసాగారు. కోవూర్ మాత్రం చిన్నయ్య చెప్పినదాన్ని నిర్భయంగా విశ్లేషిస్తున్నాడు.

"కోవూర్! మనకిక్కడ వేటావద్దు, ఆటావద్దు. వేరేచోటుకి పోదాం." అన్నాడు జాకబ్.

కోవూర్ చిన్నగా నవ్వుతూ "జాకబ్! చిన్నయ్య చెప్పినదానికే అంతగా భయపడి వేట మానుకోవడమెందుకు? చిన్నయ్యా! ఈ రాత్రికి మనం 'ఒలుమాడు' ప్రాంతానికి వెళుతున్నాం. భోజనాలు త్వరగా సిద్ధం చేయించు" అన్నాడు.

"వద్దుసార్! వద్దు. మీలాంటోళ్ళకి నేను చెప్పదగినోణ్ని కాకపోయినా నా మాట వినండి" చిన్నయ్య అన్నాడు.

వేటాడకపోయినా, కనీసం ఆ ప్రాంతాన్ని చూడాలని డాక్టర్ కోవూర్ అభిలాష. అదే అన్నాడు చిన్నయ్యతో, తుపాకీలు చేతిలో లేకుండా అయితే ఆ ప్రాంతానికి వెళ్ళడానికి చిన్నయ్య అంగీకరించాడు.

జాకబ్, మాన్ మాత్రం లోలోపల భయపడుతూనే వున్నారు.

భోజనాలు చేసి రాత్రి 9గంటలకు కారులో తమ సరంజామాతో బయల్దేరారు నలుగురూ. అరగంట ప్రయాణం తర్వాత ఓ వంతెన దగ్గర కారాపారు. అందరూ దిగారు.

జేబులో పసుపు కొమ్ములు, దారం తీసాడు చిన్నయ్య. దారానికి పసుపు కొమ్ములు కట్టి 'రాఖీలుగా' అందరికీ కట్టసాగాడు.

"ఇవెందుకు?" అన్నాడు కోవూర్.

"ఇవి రక్షాబంధనాలు సార్! ఇవి కట్టుకుంటే దయ్యాలు దగ్గరకి రావని మా నమ్మకం" అతనితో ఆ వేళలో పేచీపడి వాదించదలచుకోలేదు కోవూర్. చిన్నయ్య తన తలపై సెర్చిలైట్ ధరించాడు. (గనుల్లో పనివారు, రాత్రివేటకు వెళ్ళేవారు ఇలాంటివి ధరిస్తారు). ముందుగా నడుస్తూ త్రోవ చూపిస్తున్నాడు. గజిబిజిగా అల్లుకున్న తీగల్ని చీల్చుకుంటూ, గుబురుగా వున్న లీచ్ మొక్కల్ని విడదీస్తూ నడుస్తున్నారు. ఆ చీకటిలో కీచురాళ్ళ రొదలు, వివిధ పక్షులు, జంతువుల అరుపులు కొత్తవాళ్ళకు చాలా భయంకరంగా వుంటాయి.

చిన్నయ్య హఠాత్తుగా అందరినీ ఆపాడు. తన చూపుడు వేలు వైపే చూడమన్నాడు.

కోవూర్‌తో పాటు అందరూ చూసారు.

ఓహ్! ఎంత అద్భుతం! అటువంటి దృశ్యాన్ని వాళ్ళెవరూ అంతకుముందు చూసి ఎరుగరు. కోవూర్ ఫీల్డ్‌గ్లాస్ కళ్ళకు పెట్టి చూసాడు. అద్భుతమైన ఆ కాంతి ఎక్కడనుండి

వస్తున్నది? పరిశీలనగా చూసాడు. అక్కడ దాదాపు 30 చెట్ల దాకా వున్నాయి. వాటి కొమ్మలన్నీ నిప్పుకణికల్లా మెరుస్తున్నాయి. వాటిల్లో రెండు చెట్లు మాత్రం చాలా పొడవుగా వున్నాయి.

"చిన్నయ్యా! ఆ పొడవుగా వున్న చెట్లేనా కాదేరీ దయ్యాలు?"

"అవున్సార్! ప్రక్కనున్న చిన్నచెట్లన్నీ వాటి పిల్లలు సార్!"

కోవూర్‌కి ఇంకా ముందుకు వెళ్ళాలనిపించింది.

చిన్నయ్యే కాదు, జాకబ్, మాన్‌లు కూడా అందుకు ఒప్పుకోలేదు. తిరిగి కారు దగ్గరకొచ్చారు. వేరేచోటికి వెళ్ళి తెల్లవారేవరకు వేటాడి ఓ కుందేలు, ఓ అడవిపందిని పట్టుకుని గెస్ట్‌హౌస్‌కు చేరారు.

కోవూర్‌కి మాత్రం మనసంతా ఆ 'దెయ్యాల'మీదే వుంది.

తెల్లారింది. ఫలహారం ముగిసాక కోవూర్ ఒత్తిడి మీద చిన్నయ్య పగలు ఆ దయ్యపు చెట్లను చూపడానికి బయల్దేరాడు. జాకబ్ మాత్రం రానని ఖచ్చితంగా చెప్పాడు. మాన్‌కి భయంగా వున్నా పగలు వాటిని చూడాలనిపించింది. వాళ్ళతో తనూ బయల్దేరాడు.

ముగ్గురూ ఆ చెట్ల దగ్గరకు చేరుకున్నారు.రాత్రి చూసిన చెట్లను కోవూర్, మాన్‌లు గుర్తుపట్టలేకపోయారు. చిన్నయ్య చూపించినా వారికి నమ్మకం కల్గలేదు. వాటికిప్పుడు ఏ వెలుగూ లేదు.

కోవూర్ వాటి దగ్గరకు నడవసాగాడు. చిన్నయ్య వారించాడు. వినలేదు. మాన్ కూడా కొంత ధైర్యం చేసి కోవూర్‌ని అనుసరించాడు. ఇద్దరూ ఆ 'పాల్' చెట్ల దగ్గరకెళ్ళి పరిశీలించసాగారు. అక్కడున్న రెండు పెద్ద చెట్లకూ చాలా వయసుంటుంది. వాటిలో ఒకటి ఎండిపోయింది పూర్తిగా. రెండోది కొంత భాగం ఎండింది. అక్కడున్న చాలా చెట్లకి కుడివైపున లేతపసుపు రంగులో వున్న దట్టమైన చిక్కని బూజు వంటిది పట్టింది.

కోవూర్ జాగ్రత్తగా అంతా గమనించాడు. సంచిలోంచి కత్తిని తీసాడు. ఆ చెట్టు బెరడుని చెక్కి తన సంచిలో వేసుకున్నాడు.

కొంతసేపు అక్కడ అన్నింటినీ పరిశీలించి తిరిగి గెస్ట్‌హౌస్‌కి చేరారు. జాకబ్ అప్పటికే సామాన్లన్నీ సర్ది రెడీగా వుంచాడు.

***

'దయ్యాల' చెట్టు బెరడుతో సాయంకాలం వరకూ పరిశోధన చేస్తూనే వున్నాడు కోవూర్. చీకటిపడింది.

భార్య శ్రీమతి అక్కాకోవూర్‌ని, మూడేళ్ళ కొడుకును పిల్చి తన టేబుల్‌కి ఎదురుగా కూర్చోబెట్టాడు, గదిలో లైట్లన్నీ తీసేశాడు.

అంతే, కుర్చీలో కూర్చున్న వారిద్దరూ ఆశ్చర్యంతో ఎగిరి గంతేశారు. వాళ్ళ సంతోషానికి అవధుల్లేవు. ఎంత అద్భుతకాంతి!

"ఒరే, బుజ్జీ! అవేంటనుకున్నావురా! కాదేరి దయ్యాల మునిమనవళ్ళురా" అంటూ వివరించింది అక్కా.

ఆ చెట్ల బెరళ్ళు అలా పసుపు రంగులో వుండటానికి కారణం మెరిసే సూక్ష్మజీవులతో ఏర్పడ్డ ఫంగస్ (నాచు). ఇలా చెట్ల మీద భాస్వరగుణం గల ఫంగస్ ఏర్పడడం, అది రాత్రివేళ ప్రకాశించడం అడవుల్లో వింతేమీ కాదు. నిర్జీవమైన చెట్ల మీద ఈ ఫంగస్ ఎక్కువగా ఏర్పడుతుంది. వాటి బెరళ్ళని, ఫంగస్‌ని పరీక్షిస్తే నిజం బయటపడుతుంది.

అయితే అన్ని రకాల ఫంగస్‌కి మెరిసే గుణం వుండదు. జీవప్రకాశక సూక్ష్మజీవుల(Bio-luminous organisms)తో ఏర్పడ్డ ఫంగస్ గల చెట్ల బెరళ్ళకే అలాంటి అద్భుతకాంతి వస్తుంది. ఈ సంగతి తెలియనివారంతా ఆ చెట్లని దయ్యపు చెట్లని అమాయకంగా నమ్ముతుంటారు.

***

భాస్వరగుణం(Phosphorescence) గల ఫంగసే కాకుండా కొన్ని మొక్కలు, జంతువులు కూడా స్వయంగా ప్రకాశిస్తూ ఉంటాయి. వాటిని స్వయం ప్రకాశక జీవులు లేదా జీవప్రకాశక జీవులు అనవచ్చు. ఇలాంటివి సముద్రాల్లో ఎక్కువగా వుండటం వల్ల ఎక్కువమందికి వీటిని గూర్చి తెలియదు.

'మిణుగురు పురుగులు' గూర్చి మనందరికీ తెలుసు. ఇలాంటివే చీకటి గుహల్లో, అడవుల్లో మరికొన్ని కనిపిస్తాయి. ఈ మిణుగురు పురుగు కూడా నిజానికి పేడ పురుగులాంటిదే. మగ మిణుగురులకే ప్రకాశించే గుణం, ఎగిరే శక్తి ఉన్నాయి. ఆడ మిణుగురులు కొన్ని మొక్కలను అంటి పెట్టుకుని ఉంటాయి. మగ మిణుగురుల మెరుపుల వల్లనే ఆడ, మగ పరస్పరం తెలుసుకుని కలుసుకుంటాయి.

కొన్ని రకాల బాక్టీరియాలో కూడా ఈ మెరిసే గుణం ఉంది. జంతుకళేబరాలు, చేపలు మొదలైనవి కుళ్ళిపోయినప్పుడు అవి ఒక్కోసారి చీకట్లో మెరుస్తుంటాయి. అందుక్కారణం ఆ బాక్టీరియానే.

న్యూజిలాండ్‌లో అక్కడక్కడ కొన్ని గుహల గోడలు కూడా స్వయంప్రకాశ జీవుల వల్లనే మెరుస్తుంటాయి. ఈ జీవులకు తల మీద కాంతినిచ్చే కణాలుంటాయి. రాత్రివేళ అవి పోతూవుంటే హెడ్‌లైట్స్ గల కార్లు పరిగెత్తుతున్నట్లు ఉంటుంది.

సముద్రంలో నాక్టిలుకా(Noctiluca) అనే అతి సూక్ష్మజీవులుంటాయి. సముద్రం కల్లోలితమైనపుడు అవి పైకి వచ్చి మెరుస్తుంటాయి. కోట్లాదిగా వచ్చిన ఇవి నీటిపై మెరుస్తుంటే మంట వస్తున్నట్లు అనిపిస్తుంది కూడా.

అడవిలో మెరిసే చెట్లని చూసి చిన్నయ్యలాంటి వారు ఎలా భయపడతారో, సముద్రాల్లో తిరిగేవారు కూడా ఇలాంటి కాంతిపుంజాల్ని చూసి సాగర దయ్యాలుగా భావించి భయపడతారు.

స్వయంప్రకాశ జీవుల మాదిరే కొన్ని రకాల ముత్యాలు, అల్చిప్పలు, చేపలు, నత్తలు, కాళ్ళజెర్రులు, రోకటిబండ పురుగులు మొదలైనవి సముద్రాల్లో మెరుస్తుంటాయి. 1887లో రాఫెల్ దుబోయ్(Raphal Duboi) అనే శాస్త్రవేత్త ఇలా మెరిసే కాంతికణాలు (Pholas Shells) మెరవటానికి కారణాలను గూర్చి పరిశోధించాడు. వాటిల్లో మెరుపు రావడానికి లుసిఫెరిన్ (Luciferin) అనే పదార్థముండడమే కారణమన్నాడు.

స్వయంప్రకాశ శక్తి గల బాక్టీరియా, ఫంగస్, మిణుగురులు సముద్రాలలోని కొన్ని జీవులలో మెరిసే గుణం నిరంతరం వుంటుంది. వాటి నరాల వ్యవస్థ మెరుపును కంట్రోల్ చేస్తుంటుంది. అందుకే ఒక్కోసారి వెలుగు ఆగిపోవడం కూడా వుంటుంది. అలాగే వాటినుంచి వచ్చే కాంతిలో కూడా వేడి వుండదు. సాధారణంగా నీలం, పసుపు, ఎరుపు, ఆకుపచ్చ రంగు ప్రాంతాలలో కాంతి ఎక్కువగా వుంటుంది.

మన కథలో 'కాదేరి దయ్యపు' చెట్లు (పాల్ చెట్లు/Mimusops Hexandra) ఫంగస్ వల్లే మెరుస్తున్నాయని మనం గ్రహించవచ్చు. ఎండిన చెట్టు మీద మొదటగా ఆ ఫంగస్ ఏర్పడింది. ఫంగస్‌లో వుండే 'స్పోరు'ల వ్యాప్తి వల్ల ప్రక్కచెట్లక్కూడా వ్యాపించింది.

ఇదంతా తెలియకనే ఆ చెట్లని 'దయ్యాల కుటుంబం'గా ఆ అడవిలో భావించి భయపడుతున్నారు.

దయ్యాలున్నాయనీ, దేవుడున్నాడనీ నమ్మడం వల్ల తనకు తెలియనివన్నీ వాటి ప్రభావం వల్లనే జరుగుతున్నాయని చాలామంది విశ్వసిస్తారు. ఈ విశ్వాసాలే వారిని మానసికంగా బలహీనపరిచి ఒక్కోసారి ప్రాణాపాయాన్ని కూడా కల్గిస్తాయి. ఆ చెట్లని రాత్రివేళ చూసి విపరీత భయానికి గురైనవారే ఒడ్డు చుట్టూన్ అడవిలో అక్కడిక్కడ చనిపోయారు.



# దివ్యదృష్టి బండారం

డాక్టర్ కోవూర్ అప్పుడే స్నానపానాలు ముగించి తన డ్రాయింగ్‌రూంలోకి వచ్చాడు.

కుర్చీలో కూర్చుంటూ 'సిలోన్ డైలీన్యూస్'ను అందుకొన్నాడు. ఆరోజు 1963 ఏప్రిల్ 20.

కోవూర్ దృష్టి ఓ వార్త దగ్గర ఆగిపోయింది. నిదానంగా, నిశితంగా చదవసాగాడు.

"కొలంబోలో ఓ పదిహేనేళ్ళ అమ్మాయి కిడ్నాప్ అయింది. తండ్రి ఇ.పి.ఎస్.రామన్. అతడు తన కూతురి ఆచూకీ కోసం ఒక దివ్యదృష్టిగాడి దగ్గరకెళ్ళాడు. అతగాడు ఆమెను అపహరించినవారి టాక్సీ నెంబర్, వారెటు వెళ్ళిందీ సరిగ్గా చెప్పగలిగాడు. అందుకు కొలంబో ఛీఫ్ మెజిస్ట్రేట్ సాక్షి. అతని దివ్యదృష్టి అద్భుతం, అసాధారణం అంటూ అందరూ మెచ్చుకొంటున్నారు"

ఈ వార్త చదివాక కోవూర్ పేపర్ టీపాయ్ మీద పడేశాడు. ఆలోచిస్తూ తనలో తానే నవ్వుకున్నాడు. తన భార్య అక్కాని పిలిచి ఆ వార్త గురించి చెప్పాడు. "అయితేమీకు మళ్ళీ పనిపడిందన్నమాట" అంటూ నవ్వింది అక్కా.

ఆరోజు నుండే పుంఖానుపుంఖంగా కోవూర్‌కి ఉత్తరాలు వస్తున్నాయ్. పేపర్లో వచ్చిన ఆ వార్తకు మీ జవాబేమిటి? మీ హేతువాదం దీన్నెలా కాదంటుంది? ఆ దివ్యదృష్టి మహిమను ఎలా కాదనగలరు? ఇలా ప్రశ్నల దొంతరలు వస్తున్నాయి.

కోవూర్ కార్యరంగంలోకి దిగక తప్పదనుకొన్నాడు. ఎలాగయినా దివ్యదృష్టి బండారాన్ని బైటపెట్టి ఆ ఉత్తరాలకు జవాబు చెప్పాల్సిన తన బాధ్యతను గుర్తించాడు.

అది ఏప్రిల్ 26వతేదీ.

కోవూర్ కారులో బయలుదేరి 'కుడంపిటియా' అనే ప్రాంతానికి చేరుకొన్నాడు.

అది తనకు బొత్తిగా పరిచయంలేని ప్రదేశం. ఎలాగా ఆ దివ్యదృష్టిగాడిని కలవటం? టీ త్రాగుదామని ఒక టీకొట్టు ముందు ఆగాడు. ఆ టీకొట్టు నడిపేది ఓ మళయాళీ. పేరు రాఘవన్. సింహళజాతి స్త్రీని పెళ్ళాడి అక్కడే స్థిరపడ్డాడు. విషయం తెలుసుకొన్నాక కోవూర్ మళయాళీలో అతనితో మాట్లాడగానే రాఘవన్ పొంగిపోయాడు. అప్పుడే తన కథను క్లుప్తంగా చెప్పాడు. అతని పరిచయం కోవూర్‌కి ఎంతో ఉపకరించింది.

కోవూర్ తాను వచ్చిన పనిగురించి చెప్పాడు. దివ్యదృష్టిగాడిని గూర్చి అడిగాడు. రాఘవన్‌కి అర్థమైంది. ఆ దివ్యదృష్టిగాడు తనకు బాగా తెలుసన్నాడు. తాను కోవూర్‌తో రావటానికి అంగీకరించాడు.

దారిలో దివ్యదృష్టిగాడి మీద మాటలు సాగాయి. అతడి పేరు 'పప్పు' అని, మళయాళీగా చెప్పుకొంటాడని కోవూర్‌కి అర్థమయింది.

రాఘవన్ టీ దుకాణం మళయాళీలందరికీ గెస్ట్‌హౌస్ లాంటిది. సాయంత్రానికి అందరూ అక్కడ గుమికూడతారు. ఆదాయం చాలని రోజుల్లో 'మంత్రవిద్య'తో కూడా రాఘవన్ సంపాదిస్తుంటాడు.

పప్పు నిజానికి సింహళీయుడు. వృత్తి కోసం మళయాళీనని చెప్పుకొంటాడు. మళయాళీకే మంత్రాలు బాగా వస్తాయని, అవే బాగా పనిచేస్తాయని అక్కడి వారి నమ్మకం. పప్పూకి మళయాళం చదవడం రాదు, రాయడం రాదు.

అపహరించబడ్డ అమ్మాయిని గురించి అడిగాడు కోవూర్. రాఘవన్‌కి ఆ అమ్మాయి తెలుసు. ఆమె తండ్రి రామన్ కూడా తన టీకొట్టు దగ్గర్లోనే సారాదుకాణం నడుపుతుంటాడు. నివాసం కూడా ఆ దుకాణానికి రెండు ఫర్లాంగుల దూరంలోనే వుంది. అతని ఇంటి ప్రక్కనే 'కుమారతుంగ' ఉంటున్నాడు. అతగాడే ఆ అమ్మాయిని అపహరించాడు. తల్లీతండ్రీ పెళ్ళికని బైటకి వెళ్ళారు. అదే అదునుగా కుమారతుంగ ఆ అమ్మాయిని కిడ్నాప్ చేశాడు.

పదిహేను నిమిషాల్లో పప్పూ ఇంటి ముందు కారాగింది. కారును రోడ్ ప్రక్కనే పార్క్ చేసి కోవూర్ రాఘవన్‌ని అనుసరించాడు. అప్పటికే మూడు కార్లు ఆగివున్నాయక్కడ. ఇంటి ముందు 'పప్పు' పేరు ఇంగ్లీష్, సింహళం, తమిళం, మలయాళం భాషల్లో బోర్డుమీద రాయబడి వుంది 'ప్రొఫెసర్ పప్పు!'

వరండా దాటి ఇద్దరూ వెయిటింగ్‌రూంలోకి ప్రవేశించారు. రెండు కుర్చీలు, రెండు బెంచీలు వున్నాయి. నిండుగా జనం ఉన్నారు. అందరూ 'పప్పూ'దివ్యదృష్టి కోసం వచ్చారు. ఒకావిడ మాత్రం అప్పుడప్పుడూ బయటకీ లోనికీ తిరుగుతోంది.

"రాఘవన్! ఆమె ఎవరు?" అడిగాడు కోవూర్.

"పప్పూ భార్య సార్! వచ్చినోళ్ళని కూర్చుండబెట్టడం, వరుసగా పిలవడం ఆమె పని" రాఘవన్ వివరణ ఇచ్చాడు.



"మరి మధ్యమధ్యలో అందరికీ ఏదో చెబుతోందే" కోవూర్ సందేహం.

"జనం అనేకం అడుగుతుంటారు సార్! పప్పూ గురించి, ఫీజు గురించి ఈమె చెబుతూ వుంటుంది. అలాగే ఎవరు ఎందుకు వచ్చారో కూడా ఆరా తీస్తూ వుంటుంది".

"మరి లోపలికి వెళ్ళిరావడం దేనికి?"

"లోపల పప్పూ ముందు ఇత్తడి నూనెదీపం ఒకటి వుంది. దానిలో వత్తుల్ని సరిగా వుంచడం, నూనె పోయడం... వగైరా చేస్తూవుంటుంది. అప్పుడప్పుడు పప్పూ చెవిలో వచ్చిన వారి వివరాలు ఊదుతూ వుంటుంది కూడా" ఈ మాట చాలా చిన్నగా చెప్పాడు రాఘవన్.

కోవూర్ ఆమెను ఎగాదిగా పరిశీలించాడు. సింహళ స్త్రీ అయినా, మళయాళ స్త్రీలా ముస్తాబై వుంది. నడకలో, మాటలో, ముఖంలో ఓ రకమైన డాబు కన్పిస్తోంది.

రాఘవన్‌ని చూడగానే ఆమె పలకరింపుగా నవ్వింది. రాఘవన్ తాము వచ్చిన పని చెప్పాడు. లోనికివెళ్ళి వచ్చి కొద్దిసేపట్లోనే కోవూర్‌ని, రాఘవన్‌ని లోపలికి పంపించింది.

కోవూర్ లోపల గదంతా ఎగాదిగా చూశాడు. దాదాపు 10అడుగుల పొడవూ, వెడల్పూ గల ఆ గదిలో గాలి వచ్చే అవకాశం లేదు. గది నిండా కర్పూరపు గుబాళింపులు, కొబ్బరి నూనె వాసనలు, గది మధ్యలో త్రికోణాకారపు గొయ్యి, అందులో నిప్పు, ఆ నిప్పులో వెలుగుతున్న కర్పూరం. ఆ గొయ్యి ప్రక్కగా కొబ్బరి బోండాలు, బియ్యం, ధాన్యం, వేరుశనగకాయలు, అన్నం ఇలా చాలా అమర్చబడ్డాయి. గదిలో ఓ మూల పప్పు కూర్చొని వున్నాడు. అతని ప్రక్కనే పావురాల గూడు వంటి పెట్టె ఒకటి వుంది, రంగులతో అందంగా డిజైన్ చేయబడింది. సందర్శకులు తమకు దక్షిణగా ఇచ్చే డబ్బును తమలపాకుల్లో పెట్టి ఇస్తుంటారు కాబోలు, డబ్బులు, ఆకులు కలగలిసి ఓ ప్రక్కనే వున్నాయి. పద్మాసనం వేసిన పప్పూ సన్యాసిలా గడ్డం, మీసం బాగా పెంచాడు. ముఖం నిండా, వంటి నిండా విభూతిరేఖలు 'వాతల్లా' కన్పడుతున్నాయి. గోడల నిండా దేవుళ్ళ

బొమ్మలు. రెండు తలలు, నాలుగు తలలు, పది చేతులు, పన్నెండు ముఖాలు...ఇలా అర్థంపర్థంలేని ఫోటోలకు మల్లెపూల దండలు వ్రేలాడుతున్నాయి. ఇవేకాక నాల్గుమూలలా మట్టితో చేసిన దేవుడి బొమ్మలు నిలబెట్టబడి వున్నాయి. మొత్తానికి ఆ గదంతా ఓ పూజా మందిరంలా చేసాడు పప్పూ.

కోవూర్ వెళ్ళేసరికి పప్పూ ఎవరిదో 'కేసు' విచారిస్తున్నాడు. అప్పుడప్పుడూ ముందున్న పెట్టెలోకి తొంగిచూస్తున్నాడు. వారి సందేహాలకు జవాబులిస్తున్నాడు.

కోవూర్ ముందుగా వెళ్ళి ఆ పెట్టెప్రక్కనే కూర్చున్నాడు. రాఘవన్ మరికొందరు కూడా వచ్చి పెట్టెకు ముందు కొద్దిదూరంలో కూర్చున్నారు.

రాఘవన్ కోవూర్‌ని పప్పూకి పరిచయం చేశాడు. గొప్ప రచయితగా, విమర్శకునిగా కోవూర్‌ని పేర్కొన్నాడు. పప్పూ ముఖం వికసించింది. తనకు పబ్లిసిటీ పెరుగుతున్నందుకు లోలోన మురిసిపోయాడు. తన గొప్పతనాన్ని చాటాలని గతంలోని అనేక సంఘటనల్ని తన విజయాలుగా పేర్కొంటూ ఏకరువు పెట్టాడు. కోవూర్ వేసిన ప్రశ్నల వల్ల పప్పూ ఎన్నో విషయాలు వెల్లడించాడు.

పప్పూ అసలు పేరు హరు మానిస్ బెరేరా. మళయాళీలో ప్రసిద్ధ మాంత్రిక సోదరులైన కృష్ణఫణిక్కర్, కుమార ఫణిక్కర్, గోవింద ఫణిక్కర్, దామోదర ఫణిక్కర్ తన గురువులని చెప్పాడు. వారే అతన్ని 'పప్పూ'అని పిల్చేవారట. శ్రీలంక మీద జపాను వాళ్ళు బాంబులు వేసినపుడు ఆయన గురువులంతా కేరళ వెళ్ళిపోయారట. తనకెదురుగా వున్న అంజనం పెట్టెలోకి చూడడం ద్వారా తానే విషయమైనా చెప్పగలడట. ఇటీవల జరిగిన బాలిక కిడ్నాప్ విషయంలో రామన్ తన భార్యతో వచ్చినపుడు దొంగల కారు నెంబర్ ఖచ్చితంగా చెప్పాడట.

అంజనం ద్వారా తానేదైనా చెప్పగలనని మళ్ళీ సగర్వంగా చెప్పాడు.

"మిస్టర్ పప్పూ! నేను మీ గొప్పతనాన్ని తెలుసుకొందామనే వచ్చాను. మిమ్మల్ని ఒకటడగదలిచాను".

"అడగండి సార్! మీ సమస్యలేవైనా ఇట్టే తీర్చగలను"

కోవూర్ తన జేబులోనుండి అయిదురూపాయిల నోటు తీశాడు. దాన్ని మడిచి ఎడమచేతిలో పెట్టుకొన్నాడు. "పప్పూగారూ! ఇపుడు నా ఎడమచేతిలో అయిదురూపాయిల నోటు వుందని మీరు చూశారు. మీ దివ్యదృష్టి ద్వారా లేదా అంజనంతో దాని నెంబరెంతో చెప్పండి?"

చుట్టూ వున్న జనం ఆతృతగా పప్పూ వైపు చూస్తున్నారు. రాఘవన్‌లో కూడా అదే ఉత్సాహం!

రెండునిమిషాలు పప్పూ తన పెట్టెలోకి చూశాడు. మధ్యమధ్యలో నోట్లో ఏదో గుణించుకొన్నాడు.

ఇంతలో కోవూర్ ఒక పెన్సిల్, ఓ పేపరు తీసి రాఘవన్‌కిచ్చాడు. పప్పూ చెప్పే నెంబరు నోట్ చేయమన్నాడు. పప్పూ చెప్పిన నెంబర్ ఎస్/45-90283. కోవూర్ కూడా నోట్ చేసుకున్నాడు డైరీలో.

తర్వాత కోవూర్ తన నోటు విప్పి రాఘవన్‌కి, పప్పూకి, ఆ తర్వాత అందరికీ చూపించాడు. దాని మీదున్న నెంబర్ జి/51-390415. పప్పూ ముఖం వాడిపోయింది. అవమానంతో తలదించుకున్నాడు.

కోవూర్ అంజనం పెట్టెలోకి తొంగిచూశాడు. లోపల అన్ని రకాల కరెన్సీ నోట్లు వున్నాయి. అయిదు రూపాయిల నోటు అన్నిటికంటే మీద వుంది.

పప్పూ దివ్యదృష్టి బండారాన్ని ఆ రకంగా బట్టబయలు చేసి కోవూర్ రాఘవన్‌తో తన కారు వద్దకు వచ్చాడు. కారెక్కి స్టార్ట్ చేశాడు.

"మధ్యాహ్న సమయంలో అంజనం వేయడం సరికాదు సార్!" అన్నాడు రాఘవన్. పప్పూని సమర్థిస్తున్నందుకు, అతన్ని చూసి నవ్వుకున్నాడు కోవూర్.

తన పని ఇంకా వుంది. బాలిక కిడ్నాప్ కేసులోని నిజానిజాలు ఇంకా బయటపడాల్సి వుంది. రెండోరోజు సంబంధిత పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళాడు కోవూర్. పోలీసాఫీసర్‌ను పరిచయం చేసుకుని కేసు వివరాలు అడిగాడు. ఆఫీసర్ చెప్పిన వివరాల ప్రకారం.

జనవరి 21రాత్రి 10:30గం॥లకు తమ కూతురు కన్పించలేదని రామన్ ఫిర్యాదు చేశాడు స్టేషన్లో. అనుమానితుల పేర్లు కొన్ని ఇచ్చాడు. వెంటనే అన్ని స్టేషన్లకీ వైర్‌లెస్ సందేశం వెళ్ళింది. 'అంబలంగోడ' అనే ఊరిలో రాత్రివేళ పహరా డ్యూటీలో వున్న ఓ కానిస్టేబుల్ ఒక టాక్సీని అనుమానించి ఆపాడు. అందులో ఒక అమ్మాయి, ఇద్దరు అబ్బాయిలున్నారని, వారు 'గల్లే'టౌను వైపు వెళుతున్నారని ఆ కానిస్టేబుల్ ఫోన్ చేశాడు. మర్నాటికే ఆ టాక్సీ, ఆ వ్యక్తులతో సహా కొలంబో స్టేషన్‌కి చేరింది.

తమకెవరూ టాక్సీనెంబర్ ఇవ్వలేదని, అలాగే టాక్సీ వెళ్ళిన మార్గం కూడా ఎవ్వరూ చెప్పలేదని పోలీసాఫీసర్ చెప్పాడు.

ఆ సాయంత్రం కోవూర్, రామన్‌ని కలిశాడు. దివ్యదృష్టిగాడి గురించి అడిగాడు. అతనెవరో తనకు తెలియదని, ఏ దివ్యదృష్టిగాడి వద్దకు తాను వెళ్ళలేదనీ, అలాగే తనకెవరూ ముందుగా తన కూతురి ఆచూకీ చెప్పలేదని రామన్ చెప్పాడు.



# దురుసు యవ్వనం

ఆ రోజు 8 గంటలయింది. శ్రీలంక హేతువాద సంఘ కార్యకలాపాలను గూర్చి డాక్టర్ కోవూర్ తన భార్య అక్కాతో చర్చిస్తున్నాడు. ఇంతలో వారి సంభాషణను ఆటంకపరుస్తూ, టెన్నిస్ రాకెట్ చేతిలో వూపుకుంటూ, వచ్చి కుర్చీలో కూలబడ్డాడు డాక్టర్ ఏరీస్.

"డాడీ! నీవు కొన్ని రోజుల నుంచి ఖాళీగా వుంటున్నావు గదూ!"

"అవును. కాలేజీకి సెలవులు కదా!"

"అదికాదు, డాడీ! నీకీమధ్య పరిశోధనలు, పరిశీలనలు వగైరా ఏమీ లేక.."

"అయితే.. ఇపుడేమైనా అలాంటి కేసులు తెచ్చావా ఏమిట్రా?"

"కరెక్ట్, డాడీ! ఇవాళ టెన్నిస్ కోర్టులో ఓ వింత కథ విన్నాను".

'ఏమిటీ?' కోవూర్ ఆసక్తిగా కొడుకు వైపు చూశాడు. తల్లి కూడా ఆసక్తిగా తనవైపే చూస్తున్నందుకు మురిసిపోతూ ఏరిస్ ఇలా అన్నాడు.

"జేవియర్ అనీ, కొలంబోలో ఒక వార్తాపత్రిక ఆఫీస్‌లో పనిచేసే ఉద్యోగి వున్నాడు. అతని ఇంట్లో ఏవేవో వింతలు జరుగుతున్నాయట. ముఖ్యంగా రోజూ ఇంట్లో రాళ్ళు వానలా పడుతున్నాయట!"

'ఆ! అలాగా! ఆ ఇల్లు ఎక్కడుంది?'

'మట్వాల్‌లో'

ఒక్క క్షణం అంతా నిశ్శబ్దం.

"ఏ దయ్యమో వచ్చి ఇంట్లో రాళ్ళు వేస్తోందని, తమపై పగ సాధిస్తోందని అనుకొంటున్నారు డాడీ! నేనూ నీలాగే ఇవన్నీ వట్టిదే అన్నాను. కానీ వాళ్ళు నన్ను ఎద్దేవా చేశారు. కావాలంటే వచ్చి పరిశీలించు కోమన్నారు. డాడీ! మనం ఎలాగైనా వెళ్ళి అలా

ఎందుకు జరుగుతుందో కనిపెట్టి వెల్లడి చేయాలి. నువ్వు ఇలాంటివెన్నో చేశావు. ఈసారి నేను కూడా నీ వెంట వుండి గమనిస్తాను, డాడీ!"



నిజమే తన కొడుకు అన్నట్లు ఇవేవీ తనకు కొత్తకాదు. అయినా లోకులకు ఇలాంటివి ఎప్పటికప్పుడు విచిత్రంగానే వుంటాయి. తన కొడుకు ఎంతో ఆసక్తిగా 'రాళ్ళ వాన' బండారాన్ని బయటపెట్టమంటున్నాడు, తాను ఎన్నిటినో పరిశోధించి వాటి గుట్టులను బట్టబయలు చేశాడు. కానీ తన కొడుకు ఎన్నడూ తన పరిశోధనల్లో పాల్గొనలేదు. 'నీ అభిప్రాయం' ఏమిటి?" అన్నట్టు తన భార్యవైపు చూశాడు కోవూర్.

తన అంగీకారాన్ని ఆనందంగా తెలిపింది అక్కా. తాము వస్తున్నట్లు జేవియర్‌కి కబురుపెట్టాడు ఏరిస్.

1956 సెప్టెంబర్ 28న భార్య, కొడుకులతో కోవూర్ జేవియర్ ఇంటికి వచ్చాడు. అందరికీ సాదరంగా స్వాగతం చెప్పారు జేవియర్ కుటుంబీకులు.

ముందుగదిలో కూర్చున్న అతిథులకు తన భార్యను, 23 ఏళ్ళ పెద్ద కూతురు మేరీని, 17 ఏళ్ళ రెండో కూతురు రోజాను, 5 ఏళ్ళ కొడుకును, అల్లుడు విల్సన్‌ను పరిచయం చేశాడు జేవియర్.

మేరీ గర్భవతి. రోజా అక్కడికి దగ్గర్లోనే వున్న స్కూల్లో 9వ తరగతి చదువుతోంది. మేరీ భర్త విల్సన్ కొలంబోలో ఓ ప్రయివేటు ఉద్యోగి. వాళ్ళ కుటుంబం అంతా రోమన్ కాథలిక్కులే.

కోవూర్ ఒకసారి ఇంటినీ, పరిసరాల్నీ తిరిగి పరిశీలించాడు. వచ్చి మళ్ళీ ముందు గదిలో కూర్చున్నాడు. ఇంట్లో జరిగే ఇబ్బందులను గూర్చి అడిగాడు. జేవియర్, అతని భార్య ఎన్నో విషయాలను కోవూర్‌కి వినిపించారు.

"మా ఇంట్లో రాళ్ళు పడటం మొదలై ఇప్పటికి 5నెలలు సార్! అప్పటికి మా పెద్దమ్మాయి మేరీకి పెళ్ళి జరిగి రెండునెలలయింది. పడే రాళ్ళు కూడా సరిగ్గా మేరీ బెడ్‌రూం వైపే పడతాయి. రాత్రి మొదలై అర్థరాత్రి వరకు రాళ్ళు పడుతూనే వుంటాయి. శని, ఆదివారాల్లో పగలు కూడా పడుతుంటాయి. ఒకసారి ఇంట్లో అందరం ఎంతో జాగ్రత్తగా, రాళ్ళు ఎక్కడినుండి పడుతున్నాయో కనిపెట్టాలని చూశాం. కానీ తెలియలేదు" అన్నాడు జేవియర్.

'అప్పుడేం చేశారు?' ప్రశ్నించాడు కోవూర్.

"రాళ్ళు ఎక్కువగా పడడం గమనించాక మాకు చాలా భయమేసింది. వేరే దిక్కుతోచక ఒక పస్తీవాడి దగ్గరకు వెళ్ళాను. అతగాడు 'అంజనం' వేసి చూశాడు. ఒక దయ్యం ఇవన్నీ చేస్తోందన్నాడు. 'నలభై రూపాయిలిస్తే ఇంటికి మంత్రం వేస్తాను, ఏ దయ్యమూ చుట్టుప్రక్కలకు కూడా రాదు' అన్నాడు. అడిగినంత ఇచ్చాను. అయినా రాళ్ళవాన ఆగలేదు".

జేవియర్ ముఖంలో ఆందోళన, అసహాయత గమనిస్తూ చాలా ఆసక్తిగా వింటున్నాడు ఏరిస్.

"మంత్రాలు పనిచేయవని చర్చిలో ప్రార్థనలు చేశాను. అక్కడా కానుకలు అర్పించుకొన్నాను. అయినా రాళ్ళు పడుతూనే ఉన్నాయి. ఓరోజు బిషప్పుగారి వద్దకు వెళ్ళి నా కష్టం చెప్పుకొన్నాను. వారు స్వయంగా ఓ ఆదివారం వచ్చారు. ప్రార్థన జరిపారు. ప్రభువైన ఏసుక్రీస్తును ప్రార్థించి మంత్రించిన నీటిని అన్ని గదుల్లో చల్లారు. కొత్త దంపతుల బెడ్‌రూంలో 'సెయింట్ ఆంథోని' పటాన్ని గోడకు తగిలించారు. పోతూపోతూ, ప్రస్తుతం వారు పడుకొనే బెడ్‌రూంని ఖాళీ చేసి వేరే రూంలోకి మారమన్నారు.

కోవూర్ మధ్యమధ్యలో అక్కావైపు చూస్తున్నారు. 'నాపని నేను చేస్తున్నాలే' అంటూ అక్కా తను వ్రాస్తున్న రిపోర్టును కోవూర్ గమనించేలా వుంచుతోంది.

"అయితే అప్పుడేమైనా పరిస్థితి మారిందా?" కోవూర్ ప్రశ్న.

"ఆ, మారింది సార్. మేరీ బెడ్‌రూంలోకి రాళ్ళు పడటం ఆగిపోయింది. కానీ వాళ్ళు ఆ రూం ఖాళీ చేసి వేరే రూంలోకి మారిపోయారు. ఆ గదిలో మళ్ళీ మామూలే".

"మరి అప్పుడు ఏంచేశారు? బిషప్‌గారికి తెలియజేయకపోయారా?"ఏరీస్, తనూ ఒక సలహా ఇవ్వగలిగానన్న తృప్తితో అన్నాడు.

"అదే చేశాను బాబూ! బిషప్‌గారు ఒక శిలువబొమ్మను ఇచ్చి, దాన్ని పడుకోబోయే ముందు అల్లుడిగారి దిండుకింద వుండేలా చూడమన్నారు. అందరూ పడుకోబోయేముందు తప్పక ప్రార్థనలు చేయమన్నారు."

"అలా చేశారా? ఆ తర్వాత ఏం జరిగింది" అడిగాడు కోవూర్.

"అక్షరాలా బిషప్‌గారు చెప్పినట్లే చేశాం. అయినా రాళ్ళు పడడం ఆగలేదు. మా బాధల్ని గ్రహించి మంత్రగాళ్ళని రప్పించి పూజలు జరపమని ఓ స్నేహితుడు సలహా ఇచ్చాడు. అలాగే చేద్దామని ఒకని దగ్గరకు వెళ్ళాం. అంతా విన్నాక, దయ్యాన్ని వదిలించడానికి ఒక 'పూజ' చేయాలని మంత్రగాడు చెప్పాడు. కానీ... నా భార్య ఆ పూజకు ఒప్పుకోలేదు సార్. కిరస్తానీ ఇంటిలో అలాంటివి జరగడం ఆమెకు ఇష్టంలేదు. 'పూజ' ఆ ఇంట్లోనే చెయ్యనవసరం లేదని, ఖర్చు భరిస్తానంటే తన ఇంట్లోనే చేస్తానని, అవసరమైతే వచ్చి పరిశీలించవచ్చునని మంత్రగాడన్నాడు. మొత్తం ఖర్చు 400 రూపాయిలన్నాడు"

కోవూర్ చిరునవ్వుతో అంతా వింటున్నాడు. తర్వాతేం జరగబోతుందోనన్న ఆసక్తితో డాక్టర్ ఏరిస్ జేవియర్‌నే చూస్తూ వింటున్నాడు. జేవియర్ మళ్ళీ చెప్పసాగాడు.

"అడిగినంత ఇచ్చాం. వారం పోయాక ఆ మంత్రగాడు నా దగ్గరకి వచ్చి 'పూజ' బాగా జరిగిందని, రాళ్ళు కురిపించే దయ్యం పూజలోకి వచ్చిందని, మరెప్పుడూ ఆ ఇంటి ఛాయలకు కూడా రానని చెప్పిందని అన్నాడు. అంతేకాదు, ఆ దయ్యం ఒక ముస్లిం స్త్రీ అట. ఆమె గర్భవతిగా వుండగా ఆమె భర్త ఆమెను హత్యచేశాడట. అప్పుడా కుటుంబం సరిగ్గా ఈ ఇంట్లోనే వుండేదట. తాను గర్భవతిగా చనిపోయింది కనుక, ఆ ఇంట్లో ఎవర్నీ తల్లి కానివ్వనని పట్టుపట్టిందట. మా ఇల్లు వదలటానికి ముందా తురకదయ్యం ఒప్పుకోలేదట. గర్భవతిగా ఉన్న స్త్రీని తనకు బలివ్వాలని మొండికేసిందట. అది తగదని, నీ తృప్తికోసం గర్భంతో వున్న ఆడమేకను బలిస్తానని చెప్పి ఒప్పించి పంపాడట మంత్రగాడు. తర్వాత గర్భంతో ఉన్న ఆడమేక కోసం తిరిగి తిరిగి వందరూపాయిలకు ఒకదాన్ని బేరమాడాడట. ఆ తర్వాత దాన్ని తెచ్చి బలియిస్తే, ఆ తురకదయ్యం తృప్తిపడి తాను వెళ్ళిపోతున్నట్లు గుర్తుగా తన ఇంట్లో వున్న పనసచెట్టు కొమ్మను గట్టిగా కదిలించి వెళ్ళిపోయిందని ఆ మంత్రగాడు చెప్పాడు. మరో రెండువందలు అదనంగా పుచ్చుకున్నాడు నా దగ్గర్నుంచి"

"ఓరి భడవా! ఎంత చక్కని కథ కల్పించావురా" అనుకొన్నాడు ఏరిస్. తర్వాత ఏమయిందో తెల్సుకోవాలని ఇంకాస్త ముందుకు వంగి "తర్వాత అయినా మీ సమస్య తీరిందా మరి?" అన్నాడు.

"లేదు బాబూ! అప్పట్నుంచి మా కష్టాలు మరిన్ని పెరిగాయి" చెప్పసాగాడు జేవియర్.

"ఆ మంత్రగాడు నా దగ్గర డబ్బు తీసుకుని వెళ్ళినరోజే అర్థరాత్రి రెండు గంటల సమయంలో మా అబ్బాయి మంచం మీంచి క్రిందపడి పెద్దగా చావుకేక పెట్టాడు. మేమంతా ఉలిక్కిపడి లేచాం. దీపం వత్తి పెంచి 'ఏంటి సంగతి' అని అడిగితే 'ఒక ముస్లిం స్త్రీ తన మంచం దగ్గరికి వచ్చి తనను లేపిందని, చంపటానికి రెండు చేతులూ నా గొంతు దగ్గరికి తెచ్చిందని, నన్ను మంచం మీద నుంచి క్రిందకి లాగిపడేసిందని' ఏడుస్తూ చెప్పాడు. వాణ్ణి శతవిధాల చెప్పి ఓదార్చి ఎలాగో పడుకోబెట్టుకొన్నాం. రెండు రోజులదాకా ఇంట్లో రాళ్ళేవీ పడలేదు. మూడో రాత్రి మేరీ బెడ్‌రూంలో ఒక పెద్ద రాయి పడిందట. మేలుకొని చూస్తే, గది ఓ మూల పరదాతో వున్న ఓ ముస్లిం స్త్రీ కన్పించిందట. లేచి దీపం వత్తిని పెద్దది చేసేసరికి మాయమైపోయిందట.

సరిగ్గా ఇవన్నీ జరిగే రోజుల్లోనే నా ముఖం మీద, చెవుల దగ్గర ఎర్రని దద్దుర్లు వచ్చాయి. ఎన్ని ఆయింట్‌మెంట్లు, మందులు వాడినా తగ్గలేదు సరికదా, ముఖమంతా వ్యాపించసాగాయి. మరో విచిత్రమేమిటంటే ప్రతిరోజూ ఉదయం లేవగానే నా వంటి నిండా గోళ్ళతో రక్కినట్లు గోళ్ళ గుర్తులు కన్పించేవి. ఇదండీ మా కథ"

జేవియర్ చెప్పడం పూర్తిచేయగానే కోవూర్ కుర్చీలోంచి లేచాడు. ఇంటి లోపలికి వెళ్ళి అంతా కలియదిరిగాడు.

ఆ ఇంటిలో రెండు పడగ్గదులున్నాయి. రెండింటికీ మధ్య అడ్డంగా ఒక గోడ వుంది. కానీ అది పూర్తిగా పైకప్పు వరకు మూయబడలేదు. గోడకు, ఇంటి కప్పుకు మధ్య చాలా 'ఖాళీ' వుంది. ఒక గదిలో మేరీ, విల్సన్‌లు, రెండో గదిలో రోజా, ఆమె తల్లి, తమ్ముడు పడుకొంటారు. జేవియర్ మాత్రం వరండాలో పడుకొంటాడు.

కోవూర్ తన తరువాత పరిశోధన కోసం మూడు కుర్చీలను ఆరుబయట వేయించాడు. ఒకటి తనకి, ఒకటి తన భార్య అక్కాకి, మరొకటి తను ప్రశ్నించదలచిన వ్యక్తికి. అందరినీ ఇంట్లోకి వెళ్ళిపొమ్మన్నాడు. ఒక్కొక్కరినీ పిలిచి ప్రశ్నించడం మొదలుపెట్టాడు.

జేవియర్, అతని భార్య, రోజా అనేక సార్లు మేరీ, విల్సన్‌ల గదిలో రాళ్ళు పడడం విన్నారు. మేరీ రాళ్ళు పడగానే కేకలేస్తుంది. ఆ కేకలు విన్పడగానే ముగ్గురూ వాళ్ళ గదిలోకి వెళ్ళేవారు. జేవియర్ కొడుకు మాత్రం ఎన్నడూ రాళ్ళు పడడం చూడలేదన్నాడు. ఒకసారి జేవియర్ మేరీతో మాట్లాడుతున్నప్పుడే ఒక రాయి పడిందట. ఆ రాళ్ళు ఎక్కడనుంచి వస్తున్నాయో తెలియదుగానీ, రెండు గదుల మధ్యగోడకి ఎదురుగా వున్న గోడకు తగిలి క్రిందపడుతున్నాయని విల్సన్ చెప్పాడు. తనకు ఆ గదిలో పడుకోవడానికి ఇబ్బందిగానే వుందని చెప్పాడు.

మేరీ చెప్పినదాన్ని బట్టి తన గదిలో అనేక వస్తువులు తారుమారైపోయేవట. ఒకసారి తన భర్త ఫోటో రెండ్రోజుల వరకు కన్పడలేదట. ఎన్ని రాళ్ళు పడ్డా తన గదిలో వున్న సెయింట్ ఆంథోని బొమ్మకు మాత్రం ఎన్నడూ తగల్లేదని చెప్పింది.

అందరితోనూ మాట్లాడాక, రోజాను ప్రత్యేకంగా పిలిపించాడు కోవూర్. దగ్గరలో ఎవరినీ వుండనివ్వలేదు. రోజాను తనకెదురుగా దగ్గరగా వున్న కుర్చీలో కూర్చోమన్నాడు. ఆమె కుడిచేతిని తన కుర్చీ మీద పెట్టమన్నాడు. తన కుడిచేతిని రోజా తలపై వుంచాడు. రోజాను నెమ్మదిగా హిప్నాటిక్ నిద్రలోకి పంపాడు. గత ఆరునెలలు నుంచి తానేమేమి చేసిందో వివరంగా చెప్పింది రోజా. ఇదే సమయంలో వరండాలో వుండి ఆసక్తిగా ఇదంతా గమనిస్తున్న తన కొడుకు డాక్టర్ ఏరిస్‌ని రమ్మని, గమనించమని సైగ చేశాడు కోవూర్.

కోవూర్ అడిగిన వాటన్నిటికీ జవాబులిస్తోంది రోజా. ఎంతో అందంగా, ఆరోగ్యంగా, 17ఏళ్ళ పరువంలో వున్న రోజా తాను 9వ తరగతి చదివే కాన్వెంట్‌లోనుంచే రాళ్ళను పోగు చేసుకుని తన పుస్తకాల సంచిలో వేసుకొని వచ్చేది. రాత్రి పడగానే ఎవరూ చూడడం లేదని అనుకొన్నప్పుడు రెండుగదుల మధ్య నున్న గోడమీద నుంచి రాళ్ళు విసిరేది.అలా ఎందుకు చేస్తున్నావని అడిగితే 'ఊరికే' అంది. తనకు అక్కా, బావలపై ఏమీ ద్వేషం లేదట.

తల్లిదండ్రులు తనని బాగానే చూస్తారు. తనతో కూడా ప్రేమగానే వుంటారు. అప్పుడప్పుడు బహుమతులు కూడా ఇస్తుంటారు. ఓసారి తన బావ ఫోటోను స్కూలుకు తీసుకెళ్ళి అక్కడ తన స్నేహితులకు చూపించి మళ్ళీ తెచ్చింది. స్కూల్లో తనకొక్కతే ముఖ్యమైన స్నేహితురాలు ఉందట. అయితే ట్యూషన్‌లో మాత్రం చాలా వెనుకబడి వుంటుంది. అందుకే టీచర్లు ఆమెను తిడుతుంటారు. తల్లిదండ్రులు కూడా అలాగే తిడ్తారట.

కోవూర్ రోజాను హిప్నాసిస్ నిద్ర నుంచి మామూలుస్థితికి తెచ్చాడు. ఆమె చేసిన నేరాన్ని ఒప్పించాడు. ఇకనుంచిఇలాంటి పనులు చేయనని తనకి మాటిస్తే ఆమెను గూర్చి తల్లిదండ్రులకు చెప్పనన్నాడు. ఇంకెప్పుడూ ఇలాంటివి చేయనని రోజా మాట ఇచ్చింది.

తన సత్యశోధన పూర్తి అయింది. ఏరిస్ కూడా తన తండ్రి చాకచక్యాన్ని మనసులో మెచ్చుకొన్నాడు. కుటుంబసభ్యులందర్నీ వరండాలో సమావేశపరిచాడు కోవూర్.

"ఇకనుంచి మీకు ఇంటిలో ఏ ఇబ్బందులూ వుండవు. రాళ్ళు పడటానికి ఏ తురక దయ్యమూ కారణం కాదు. అసలు దయ్యం అనేది ప్రపంచంలో ఎక్కడా వుండదు. మన అజ్ఞానమే మనల్ని అలా భయపెడుతుంది. ఒకవేళ ఇకమీద మీకు ఏమైనా ఇలాంటి ఇబ్బందులు వస్తే ఏ మంత్రగాడి వద్దకో పరుగెత్తకండి. నాకు చెప్పండి. మీరు ఖర్చు పెట్టిన 600రూపాయిలు వట్టి దండగ. అలాగే మీరు నమ్మే మతం కూడా మిమ్మల్ని ఇలాంటి వాటికి ఏ రక్షణా ఇవ్వలేకపోయిందని గుర్తించండి. హేతువాదాలోచన వల్లే మనిషి జీవితం వికసిస్తుంది".

"కోవూర్ గారూ! ఇంతకీ రాళ్ళు పడడానికి కారణం ఏమిటో తెలుసుకోవాలనుంది" అడిగాడు విల్సన్.

"మీకు ఈ విషయం మాత్రం చెప్పను" రోజా వైపు చూస్తూ అన్నాడు కోవూర్. "అయితే ఇకనుంచి మాత్రం పడవని గట్టిగా చెప్పగలను"

సమావేశం ముగిసాక జేవియర్ కుటుంబీకుల వద్ద సెలవు పుచ్చుకొని ఇంటి ముఖం పట్టారు కోవూర్ కుటుంబీకులు.

అయితే ఏరిస్‌కు మాత్రంఇంకా సందేహాలు తీరలేదు. "రోజా అలా ఎందుకు చేసింది?" అన్న అనుమానం అతనిని వేధిస్తోంది. దారిలో తన తండ్రిని అదే అడిగాడు.

తన కొడుకు ఇలా అడుగుతాడని ముందుగానే కోవూర్ ఊహించాడు.

"రోజా పగలంతా తన కాన్వెంట్‌లో వుంటుంది. అందుకే ఆ ఇంట్లో పగలు రాళ్ళు పడవు. శని, ఆదివారాలు పగలు రాళ్ళు పడడానికి కారణం ఆమె ఇంట్లో వుండడమే. ఇకపోతే ఆమె రాళ్ళు వేయటంలో ప్రధాన ఉద్దేశం ఎవ్వరూ గమనించలేనిది ఒకటుంది. అదే ఆమె ఇలా ప్రవర్తించటానికి కారణం".

"ఆమె మానసిక పరిస్థితి అంటారా?" ఏరీస్ మధ్యలో అడిగాడు."అవును, రోజా చాలా ఆలస్యంగా యౌవ్వనంలోకి అడుగుపెట్టింది. ఆమె సెక్స్ గ్రంథులు తగినట్లుగా పనిచేయకపోవడం వల్ల ఇలా ప్రవర్తిస్తోంది. మిగిలిన ఆరోగ్యం అంతా బాగానే వుంది. ఆమెలో ఎన్నో అలజడులున్నా మగ స్నేహితులు లేరు. ఉండే అవకాశమూ లేదు. తాను పరుండే గది ప్రక్కనే తన అక్క, భర్తతో సంసారసుఖాలను అనుభవించడం, ఆమెలో తన అక్క పట్ల అసూయను రేకెత్తించింది. తన అంతశ్చేతనలో నిండివున్న ఆ అసూయను వ్యక్తం చేయడానికి ఆమె ఆ పన్నాగం చేపట్టింది. తన బావ పట్ల రోజాకు ఏమీ ద్వేషంగానీ, అసూయగానీ లేవు. పైగా అంతశ్చేతనలో అతనిని కోరుకొంటోంది. అందుకే ఎవ్వరికీ తెలియకుండా, అతని ఫోటోను తన ఏకైక స్నేహితురాలికి చూపించడానికి తీసుకెళ్ళింది.

మరో కారణం ఏమంటే రోజా చదువులో వెనుకబడ్డ పిల్ల. ఈ విషయంలో ఆమె స్కూల్లోను, ఇంట్లోను తిట్లు కాస్తూనే వుంది. అది ఆమె మనసులో ఎంతో బాధకల్గించింది. ఇంట్లో సమస్యలు సృష్టించడం ద్వారా తన అంతశ్చేతనలో దాగివున్న కోపాన్ని బైటపెట్టగలుగుతోంది. ఆనందిస్తోంది.

మరోటి ఏమంటే విల్సన్ ప్రతి శనివారం మధ్యాహ్నం ఇంటికి వస్తాడు. రోజా శనివారం ఉదయం నుంచి ఇంట్లో వున్నా రాళ్ళు మధ్యాహ్నం నుంచే పడతాయి. కారణం, తన బావ అప్పుడే తన అక్కతో ఆ గదిలోకి వస్తాడు కనుక.

వాళ్ళయినా కాస్త ఆలోచిస్తే రాళ్ళు ఎటునించి వస్తున్నాయో తెలిసివుండేది. గదిలోకి వచ్చిన రాళ్ళు మధ్య గోడకెదురుగా వున్న గోడపైన తగులుతున్నాయి అంటే మధ్యగోడకి ఇంటి కప్పుకి మధ్య నుంచే వస్తున్నాయని తేలిగ్గా గుర్తించవచ్చు.

ఇక జేవియర్ కొడుకు మంచమ్మీద నుంచి పడడానికి కారణం 'కల'. ఒక ముస్లిం దయ్యం ఇంటిలో వుందని మంత్రగాడు చెప్పిన విషయం ఆ కుర్రాడి మనసులో పడి 'కల'లో వ్యక్తమయింది. భయంతో క్రిందపడి అరిచాడు. అలాగే మేరీ కూడా అటువంటి భయాన్ని, భ్రమలను పొందింది.

జేవియర్ ముఖమ్మీద ఎర్రని దద్దుర్లు రావడం ఎలర్జీ వల్ల. అది అంటువ్యాధిగా మారి వళ్ళంతా వ్యాపించింది. ఇక అతని వంటి మీద గోళ్ళ గుర్తులు నిద్రలో గోక్కోవడం వల్లనే వచ్చాయి.

ఏరీస్ శ్రద్ధగా వింటున్నాడు. 'ఇంకా ఏమైనా సందేహాలున్నాయా' అడిగాడు కోవూర్. 'లేవు' అన్నట్లు తలూపాడు ఏరీస్.

తండ్రీకొడుకుల సంభాషణకు మురిసిపోతూ చిన్నగా నవ్వుకొంటోంది అక్కా.



# పిల్లలూ! పురాణకథలున్నాయ్, జాగ్రత్త!

అతడొక లాయర్. అతడొక మేధావి, మంచి వక్త, బహు పుస్తక రచయిత, శాస్త్రవేత్త కాకపోయినా, కొంతమంది శాస్త్రవేత్తల కంటే మిన్న అయిన విజ్ఞాని.'యుక్తివాది' అనే మళయాళ పత్రిక సంపాదకుడు. కేరళ హేతువాద సంఘానికి అప్పటి అధ్యక్షుడు. అతడే ఎం.సి.జోసెఫ్.

1961 ఏప్రిల్‌లో కోవూర్ తన మాతృభూమిని చూట్టానికి కేరళ వెళ్ళాడు. అప్పుడప్పుడు అలా వెళ్ళడం కోవూర్‌కి చాలా ఇష్టమైన విషయం. కేరళలోని 'తిరువెళ్ళ' అతని మాతృభూమి.

తన బంధువుల్ని కలిశాక, తన ప్రియమిత్రుడైన జోసెఫ్‌ను కలవటానికి అతనింటికి వెళ్ళాడు. వారిరువురి మధ్య ఉన్నది చిక్కనైన స్నేహం. రక్తబాంధవ్యం కంటే మించిన ఆశయబాంధవ్యం.

ఎన్నాళ్ళకో వచ్చిన స్నేహితుని చూసి తబ్బిబ్బయ్యాడు జోసెఫ్. ఇరువురి మనసులు ఆనందంతో విప్పారాయి. ఆ ఆనందంలోంచి ఎన్నో అనుభవాలు, ఆలోచనల ముచ్చట్లు పరిమళమై చిమ్ముకొచ్చాయి.

ఇటీవల తనకెదురైన ఒక అనుభవం గురించి జోసెఫ్ చెప్తుంటే ఆసక్తితో ఆలకించసాగాడు కోవూర్.

***

కేరళలోని త్రిచూర్ జిల్లాలో 'ఇరింగలక్కుడ' అనే పట్నం వుంది. దానికి మూడు మైళ్ళ దూరంలో పోతుసెరి హైస్కూల్ వుంది. అక్కడొక సైన్స్ విభాగాన్ని ప్రారంభించేందుకు స్కూలు యాజమాన్యం హేతువాది అయిన జోసెఫ్‌ను ఆహ్వానించింది.

ఏప్రిల్ 14న జరిగిన ఆ ఉత్సవానికి హాజరైన జోసెఫ్, అర్థరాత్రి కారులో ఇంటి ముఖం పట్టాడు. కేశవన్ వైద్యార్ అనే ఒక ఆయుర్వేద డాక్టర్‌తో పాటు ఎం.సి.మాధవన్



మీనన్ కూడా కారులో జోసెఫ్‌ను అనుసరి స్తున్నారు. మీనన్ సంస్కృత పండితుడు.

జరిగిన ఉత్సవాన్ని గురించి ముగ్గురూ ఉత్సాహంగా మాట్లాడుకొంటున్నారు. జోసెఫ్, సైన్స్ గురించి, శాస్త్రీయ దృక్పథం గురించి చెప్పిన అంశాలన్నీ చక్కగా వున్నాయని మిగిలిన ఇద్దరూ ప్రశంసించారు.

"జోసెఫ్‌గారూ! మీ ఉపన్యాసం విన్నాక నా మనసులోని బాధను మీకు చెప్పుకోవాలని పిస్తుంది".

"చెప్పండి, మీనన్ గారూ!" ఆసక్తితో అన్నారు జోసెఫ్.

"నాకు పన్నెండేళ్ళ కూతురుంది సార్. పేరు రాజ్యలక్ష్మి. 7వ తరగతి చదువుతోంది. చాలా తెలివిగల పిల్ల. అయిదున్నర నెలల క్రితం మా ఇంట్లో నా అత్తయ్య చనిపోయింది. అప్పట్నుంచి నా కూతురిలో ఎంతో మార్పు వచ్చింది. ప్రతిరోజూ సాయంత్రం 5గంటలు కాగానే చచ్చేంత భయంతో పెద్దగా కేకలు పెడుతుంది. అరుస్తుంది. 'ఏమిటమ్మా? ఏం జరిగింది?' అని ఎవరడిగినా జవాబివ్వదు. రెండుగంటలపాటు అలా అరిచీ అరిచీ చివరికి పడిపోతుంది. మళ్ళీ 9గంటలకు తనే లేచి కొద్దిగా అన్నం తిని నిద్రపోతుంది. మళ్ళీ రెండోరోజు సాయంత్రం దాకా బాగానే వుంటుంది".

"ఎందుకలా చేస్తున్నావని పగలు అడగలేకపోయారా?"

"అడిగాం సార్! భయం వల్ల అలా చేస్తోందట".

"ఏం భయం? దేని గురించి?"

"అడిగితే చెప్పదు. ఈ పరిస్థితి వల్ల రోజూ 'వింత చూడడానికి' అన్నట్లు ఎవరెవరో రావడం, ఏదేదో అడగడం, ఏమేమో వ్యాఖ్యానించడంవల్ల పాపలో భయం మరింత పెరుగుతోంది. నేనున్నప్పుడైతే ఎవర్నీ ఏమీ అడగనివ్వను. కానీ..." మీనన్ మాట పూర్తికాకముందే..

"మరి ఏ డాక్టర్‌కైనా చూపకపోయారా?" అడిగారు జోసెఫ్.

"చూపించాం సార్. ఒకరు కాదు, ముగ్గురు చూశారు. వారివల్ల కాలేదు. మానసిక వైద్యుని వద్దకు వెళ్ళాలని ప్రయత్నిస్తుంటే ఇంట్లో అందరూ నన్ను తూలనాడారు.వాళ్ళ

బలవంతం మీద చంద్రన్ అనే జ్యోతిష్యుడ్ని సంప్రదించాల్సి వచ్చింది. అతగాడు ఏవో బొమ్మలు గీచి, వాటి మీద గవ్వలు పెట్టి అదంతా 'ఒక దయ్యం వల్ల' వచ్చిందన్నాడు. మా పాప చెరువులో స్నానానికి వెళ్తూ వాళ్ళ అమ్మమ్మ పూడ్చిన స్థలం ప్రక్కనుంచి వెళ్ళిందని, అప్పుడు అమ్మమ్మ దయ్యమై పాపను ఆవహించిందని చెప్పాడు. తన మిత్రుడొకడు గొప్ప మాంత్రికుడున్నాడని, అతని సాయంతో దాన్ని వదిలించుకొమ్మని అడ్రసు కూడా ఇచ్చాడు.

"ఓహో! అయితే కథ వైద్యుల నుంచి భూతవైద్యుల వరకు వెళ్ళిందన్నమాట" జోసెఫ్ సాలోచనగా అన్నాడు.

"అవును సార్! ఆ మంత్రగాడ్ని పిలిపించాం. ఏవేవో మంత్రాలు చదివి, పూజచేసి, దారం ఒకటి మంత్రించి పాపచేతికి కట్టాడు. తనకు రావాల్సింది పుచ్చుకొని వెళ్ళిపోయాడు. కానీ ఆమె పరిస్థితిలో ఏమీ మార్పురాలేదు".

"ఎలా వస్తుందండి, మంత్రాలతో, దారాలతో బాధలు ఎలా పోతాయి?"

"తర్వాత ఒక ప్రముఖ ఆయుర్వేద వైద్యునికి చూపించాం సార్! అతడు కొన్ని నెలలు మందులు వాడితే గాని ఇది పోదు అన్నాడు. ప్రస్తుతం ఆ మందులే వాడుతున్నాం. కానీ మార్పు వస్తుందని నాకేమీ నమ్మకం కల్గడంలేదండీ!"

మీనన్ ముఖంలోని ఆందోళనకు జోసెఫ్ జాలిపడ్డాడు.

"మీనన్ గారూ! మీరేమీ బాధపడకండి. ఇలాంటివి మంత్రాలకు, మందులకు పోయేవి కావు. ప్రతి జబ్బుకూ మందు వుండదు. కొన్ని జబ్బులకు మందుల అవసరం లేదు. మీ రాజ్యలక్ష్మిని నేను మామూలు మనిషిని చేస్తాను. మీరేమీ ఆందోళన చెందకండి" జోసెఫ్ మాటల్లోని ఊరడింపు మీనన్‌కి కారుచీకటిలో కాంతిరేఖ అయింది.

కారులోనే ప్రోగ్రాం నిర్ణయమయింది. 17వ తేదీన జోసెఫ్‌తో పాటు కేశవన్ వైద్యార్ కూడా మీనన్ ఇంటికి రావటానికి ఆసక్తి చూపారు.

అనుకొన్నట్లుగానే జోసెఫ్, మీనన్ ఇంటికి వెళ్ళారు. మీనన్ దంపతులు సాదరంగా ఆహ్వానించారు.

"సార్! ఈ అమ్మాయే నా కూతురు రాజ్యలక్ష్మి" పరిచయం చేశాడు మీనన్.

"అలాగా! పాపా!, రామ్మా! రా! ఇలా కూర్చో" దగ్గరగా కూర్చోబెట్టుకున్నాడు జోసెఫ్.

"పరీక్షలు బాగా రాశావా?" అడిగాడు జోసెఫ్. అవునని తలూపింది రాజ్యలక్ష్మి

"నువ్వు చాలా మంచి అమ్మాయివనీ, తెలివిగలదానివనీ మీ నాన్నగారన్నారు. క్లాసులో మంచి మార్కులువస్తాయా?"

"వస్తాయండి" తనను పొగుడుతున్నందుకు సంతోషంగా ఉంది రాజ్యలక్ష్మికి. రాజ్యలక్ష్మిలోని బెరుకుతనాన్ని పోగొట్టి, చనువును పెంచుకోవటానికే జోసెఫ్ అలా అడిగాడు.

"రాజ్యలక్ష్మీ! రోజూ నువ్వు సాయంత్రం పెద్దగా అరుస్తుంటావట ఎందుకు?"

"భయం వేస్తుందండి"

"భయమా? దేనివల్ల?"

ఈ ప్రశ్న రాజ్యలక్ష్మికి అర్థం అయినట్లు లేదని గ్రహించాడు జోసెఫ్.

"అంటే.. భయం అనేది ఏదో జంతువు వల్లనో, ఎవరైనా వ్యక్తుల వల్లనో, ఏదైనా సంఘటన వల్లనో, వస్తువుల వల్లనో వస్తుంది గదా! అలాంటిది నీకేమైనా వుందా?"

జోసెఫ్ మాటల్లోని ఆప్యాయత, రాజ్యలక్ష్మిని ఆకర్షించింది. కానీ ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో పాలు పోలేదు. మళ్ళీ జోసెఫ్ అందుకున్నాడు.

"కుక్క కరవడానికి వస్తేనో, ఎద్దు పొడవడానికి వస్తేనో, కొందరు భయపడతారు. అలాగే పాముల్ని చూసి, ఏనుగుల్లాంటి జంతువుల్ని చూసి మరికొందరు భయపడతారు. ఇంకొందరు తమలో తాము ఏవేవో ఊహించుకొంటూనో, దయ్యాలను గురించో భయపడతారు. మరి నువ్వు దేనికి భయపడుతున్నావ్".

జోసెఫ్ మాటలు టీచర్ పాఠం చెప్తున్న తీరులో వున్నాయి.

"నేను గాల్లోకి తేలిపోయినట్లు అనిపిస్తుంది. అప్పుడే నాకు ఏడుపొస్తుంది" అంది రాజ్యలక్ష్మి. ఆమె ముఖంలోని భయాన్ని చక్కగా పసిగట్టాడు జోసెఫ్.

"అక్కడి నుండి పడిపోతున్నట్లు అన్పిస్తుందా?"

"లేదండీ! అప్పుడే నా కళ్ళ ముందు అంతా చీకటి అలుముకొన్నట్లు ఉంటుంది. దాన్ని చూడగానే నాకు విపరీతమైన భయం పుడుతుంది" రాజ్యలక్ష్మి మాటల్లో ఒక సన్నని వణుకును గమనించాడు జోసెఫ్.

"చీకటంటే ఎందుకమ్మా భయం? మనం రోజూ చూస్తూనే వుంటాం గదా!"

"ఏమోనండీ! ఆ చీకటిలో నేను ఏమైపోతానో అన్పిస్తోంది."

జోసెఫ్ ఒక నిమిషం మౌనం వహించాడు. ఏదో ఆలోచించుకొని....

"మీ అమ్మమ్మ చనిపోక ముందు కూడా నీకు చీకటంటే భయం వుందా?"

"అప్పుడు ఇంత లేదండీ!"

జోసెఫ్ మీనన్ వైపు తిరిగి, "మీ అత్తగారు ఎప్పుడు చనిపోయారు?"

"1961 నవంబర్ 1వ తేదీనండి" అవునా, కాదా? అన్నట్లు భార్య మొహం చూసాడు మీనన్. ఆమె కూడా అవునని నిర్ధారించింది.

"ఆ మర్నాటి సాయంత్రం నుంచే రాజ్యలక్ష్మి ఇలా...." మీనన్ మాట పూర్తికాకముందే.

"అదిగో.. అదిగో.. వాడు చూడండి. నన్ను భయపెట్టాలని ఆ పుస్తకంలోని ఆ బొమ్మను చూపిస్తున్నాడు" అంటూ కంగారు పడుతూ వేలెత్తి తమ్ముడి వైపు చూపింది రాజ్యలక్ష్మి.

జోసెఫ్ వెంటనే ఆ పుస్తకం అందుకున్నాడు. ఆ బొమ్మను చూశాడు. దున్నపోతు మీద కూర్చున్న యముని బొమ్మ. ఎడమచేతిలో త్రిశూలం వుంది. కుడిచేతిలో త్రాడుకు వేలాడుతున్న సత్యవంతుని తల వుంది. ఆ బొమ్మ క్రింద – 'యముడు సత్యవంతుని ప్రాణాలను యమలోకమునకు తీసుకొని వెళ్ళుట' అని రాసి వుంది.

"నాకు ఆ బొమ్మ అంటే భయమండీ! దాన్ని విసిరి పారేయండి. అది చూస్తే నేను మళ్ళీ అరుస్తాను, ఏడుస్తాను, పడిపోతాను. దాన్ని పారేయండి సార్" అని ఆవేశంతో వణుకుతోంది రాజ్యలక్ష్మి.

జోసెఫ్ వెంటనే ఆ పుస్తకాన్ని దూరంగా విసిరాడు. రాజ్యలక్ష్మి భుజాన్ని చేతితో తాకుతూ "ఎందుకమ్మా! అలా భయపడతావు? అదంతా నిజం కాదు. ఆ కథంతా వట్టిది" అన్నాడు.

"ఆ యముడు మా అమ్మమ్మను కూడా అలాగే తీసుకువెళ్ళాడు కదాండీ!" తగ్గిన ఆవేశంతో అమాయకంగా అడిగింది రాజ్యలక్ష్మి.

"ఎవరన్నారు అలాగని?"

"మా పిన్ని చెప్పింది".

"ఎప్పుడు చెప్పింది?"

"మా అమ్మమ్మ జబ్బుతో మంచం మీద వుండేది. అప్పుడు మా చుట్టాలు వచ్చారు. అంతా కలిసి ఆమెను లేవదీసి నేలమీద పడుకోబెట్టారు. ఆమె బ్రతికే వుంది. ఎంతో బాధగా, మూలుగుతూ. ఊపిరి కూడా అందకుండా కొట్టుకుంటుంటే వారు ఆ పని చేశారు. నాకు ఆమెను చూస్తే చాలా ఏడుపొచ్చింది. నేను బాగా ఏడ్చాను. అప్పుడు మా పిన్ని నన్ను అక్కణ్నుంచి ఇంటి బయటకి దూరంగా తీసుకెళ్ళి తన దగ్గర కూర్చోబెట్టుకుంది. అప్పుడు చెప్పింది. మా అమ్మమ్మ యమలోకానికి వెళ్ళిందట. యముడు చీకటిలో వచ్చి తీసుకెళ్ళాడట. అతని లోకం దక్షిణాన వుందట. కనుక అమ్మమ్మ కోసం నీవేమీ ఏడవవద్దు అంది పిన్ని.

జోసెఫ్ జాగ్రత్తగా విన్నాడు. గదిలో మీనన్, ఆమె భార్య, ఇంకా వారి మగపిల్లలు, కేశవన్ వైద్యార్ – అంతా శ్రద్ధగా ఆలకిస్తున్నారు.

జోసెఫ్‌కి అంతకు ముందే మీనన్ చెప్పాడు. ఆ ఇంటిలో రాజ్యలక్ష్మి ఒక్కతే ఆడపిల్ల. మిగిలిన ఏడుగురు సంతానం మగపిల్లలే. రాజ్యలక్ష్మి అంటే అందరికీ ముద్దు. వాళ్ళ అమ్మమ్మ అన్నా రాజ్యలక్ష్మికి ఎంతో ఇష్టం.

జోసెఫ్ రాజ్యలక్ష్మి బాధను అర్థం చేసుకొన్నాడు. ఆ లేతవయసులో, ఆమె పసిగుండెలో కలిగిన భయానికి కారణం స్పష్టమైంది. యముడు నల్లగా వుంటాడని, చీకటిలో వస్తాడని, తనను కూడా తీసుకెళ్తాడని ఆమె ఊహించుకొంది. గాలిలోకి తేలిపోతున్నట్లు అన్పించటం అంటే తనను యముడు తీసుకువెళ్తున్నట్లుగా అనుకొంటోంది.

జోసెఫ్ ప్రేమగా రాజ్యలక్ష్మి తల నిమిరాడు. భయంతో గాయపడిన ఆమె మనసుకు ఊరట కావాలి. మనసులోంచి ఆ భయాన్ని తొలగించాలనుకొన్నాడు.

"పాపా! యముడు, యమలోకం, దయ్యాలు, దేవతలు.. ఇవన్నీ వట్టి అబద్ధాలమ్మా! నిజానికివేవీ లేవు..." అన్నాడు.

ఏమీ అర్థం కానట్లు వుంది రాజ్యలక్ష్మి ముఖం. 'ఇదేమిటి ఇలా అంటాడు?' అనుకొంటుందేమో!

"పాపా! నీకు తోడేలు.. మేకపిల్ల కథ తెలుసా?" అడిగాడు జోసెఫ్.

'తెలుసు' అంటూ తల గుండ్రంగా తిప్పింది.

"ఏదీ, నాకాకథ చెప్పు" అన్నాడు రాజ్యలక్ష్మి తన చిట్టిపొట్టిమాటలతో కథను వివరించింది.

"నాకోచిన్న సందేహం పాపా! తోడేలు, మేకపిల్ల ఎక్కడైనా మాట్లాడుతాయా?"

"ఊహు" అంది

"మరి నువ్వు మాట్లాడినట్లు చెప్పావుగా"

ఏం చెప్పాలో తెలియలేదు రాజ్యలక్ష్మికి

"ఈ యముడు కథ కూడా అలాంటిదేనమ్మా! యముడు రావటం, ప్రాణాలు తీసుకెళ్ళటం అన్నీ అబద్ధం"

రాజ్యలక్ష్మి ఏమీ అనలేదు, ఆసక్తిగా వింటోంది.

"చెడ్డవారు మంచివారిని ఎలా బాధపెడతారో తెలియచెప్పడానికి తోడేలు, మేకపిల్ల కథను కల్పించారు పెద్దలు. చెడ్డవారి మాటలు తోడేలు ద్వారా, మంచివారి మాటలు మేకపిల్ల ద్వారా చెప్పించారు. నిజానికి వాటికి మాటలు రావు. అలాగే ఈ యముడి కథ కూడా వట్టిది".

రాజ్యలక్ష్మి తెలివిగల పిల్ల కనుక జోసెఫ్ మాటలను అర్థం చేసుకొంది.

కూర్చున్న చోట నుంచి లేచింది. అంతా ఆమెనే చూస్తున్నారు. గబగబా వెళ్ళి జోసెఫ్ విసిరేసిన పుస్తకాన్ని తెచ్చి యముని బొమ్మ వున్న పేజీ తెరిచింది.

"నేనింకా ఈ కథ నిజమేననుకొంటున్నా. ఇదంతా ఒట్టిదన్నమాట!"

పుస్తకాన్ని మూసి "ఇక నుంచి నాకే ఏడుపులు, అరుపులు రావు" అంది. ఆమె ముఖంలో ఆనంద చంద్రోదయమయింది. మీనన్ దంపతుల గుండెల్లో ఒక్కసారిగా సంతోషం ఉప్పొంగింది. జోసెఫ్, కేశవన్‌లు రాజ్యలక్ష్మిలో వచ్చిన మార్పుకి ఎంతో ఆనందించారు.

"శభాష్ పాపా! అలా వుండాలి రాజ్యలక్ష్మి అంటే"అంటూ ప్రశంసించాడు జోసెఫ్. "మీనన్ గారూ! రాజ్యలక్ష్మికి మరేం భయం లేదు. ఇకనుంచి మీకే ధైర్యం చెబుతుంది." అంతా గొల్లున నవ్వారు. ఆనందం అర్ణవమైన ఆ ఇంటిలోని ప్రతి ఒక్కరినీ పలకరిస్తూ బైటికి నడిచారు జోసెఫ్, కేశవన్‌లు.

ఆ తర్వాత రెండురోజులకు జోసెఫ్ మళ్ళీ రాజ్యలక్ష్మిని చూడడానికి వెళ్ళారు. "అంకుల్, నేను నిన్న, మొన్న అస్సలు ఏడవలేదు"అంది రాజ్యలక్ష్మి. "వెరీ గుడ్‌గర్ల్" అంటూ మెచ్చుకొన్నారు జోసెఫ్.

అయిదున్నర నెలలు తమనందరిని కలవరపరిచిన భయాన్ని ఒక్కరోజులోనే, కేవలం మాటలతోనే తొలిగించిన జోసెఫ్‌గారికి మనసారా కృతజ్ఞతలు చెప్పారు మీనన్ దంపతులు.

***

జోసెఫ్ చెప్పిన తన అనుభవం కోవూర్‌కి ఆసక్తి కలిగించింది.

"జోసెఫ్! మనిషి చావు చుట్టూ కూడా ఎన్ని మూఢనమ్మకాలు అల్లుకున్నాయి!" కోవూర్ మాటల్లో ధ్వనించిన ఆశ్చర్యాన్ని అంగీకరిస్తూనే "అవును కోవూర్! చచ్చిన మనిషిని మంచమ్మీద వుంచరు. ఏ చాపమీదనో, అరిటాకుల మీదనో పడుకోబెడతారు. ముఖం దక్షిణదిక్కుగా వుండాలట. అలా చేస్తే యముడు ఏ ఇబ్బందీ పెట్టకుండా మృతుని ప్రాణాన్ని తీసుకుపోతాడట. ఎంత మౌఢ్యం! మరో వింతేమిటంటే, తమ ఇంటికి దక్షిణ ద్వారం లేకపోతే అప్పటికప్పుడు గోడ పడగొట్టి ఏర్పాటు చేసేవారున్నారు."

"నిజమే. చనిపోయినప్పుడు మృతునితో వున్న వస్తువులను తగలబెట్టడం మూర్ఖత్వం కాదూ! నువ్వు చెప్పిన రాజ్యలక్ష్మి అమ్మమ్మ మంచంమీద నుంచి ముందుగా దించింది అందుకే. మంచాన్ని తగలబెట్టాల్సి వస్తుందనే. అదలా వుంచితే, మైలట. ఈ 'మైల' ఆచారం మరీ అసహ్యంగా వుంటుంది. ఒక్కో ప్రాంతంలో ఒక్కో విధంగా వుంటుంది.

15రోజుల వరకు కూడా ఈ 'అంటు'ను పాటించి సమాజంతో సంబంధాలు లేకుండా ఉండడం ఎంత అవివేకం! ఆ మైల పోవటానికి వేరే శుద్ధి కార్యక్రమమొకటి".

"జోసెఫ్! యముని బొమ్మల పుస్తకం వివరాలు చెప్పు"

"కేరళ ప్రభుత్వం, పాఠశాలల్లో మళయాళం భాష నేర్పటానికి ఆ పుస్తకాన్ని తయారు చేయించింది. 'పదావళి'అనే పేరు గల సిరీస్‌లో ఇది మూడవది. ఆ పాఠం పేరు 'చావును జయించవచ్చు' పేరుబాగానే వుంది. కానీ, సావిత్రి, తన భర్త సత్యవంతుని ప్రాణాన్ని యముని నుండి తిరిగి పొందటం చావును జయించడమెలాగవుతుంది? అసలీ పాఠాలు పిల్లలకు పెట్టటం అంటే వారిని బాల్యం నుంచే మూఢులుగా చేయటం కాదా? పెద్దలకు ఆసక్తి కల్గించేవైనప్పటికీ, రాక్షసులు, దయ్యాలు, ఆత్మలు, స్వర్గనరకాలు, మాయలు, మంత్రాలు, రక్తం త్రాగటాలు, హత్యలు ఇలాంటి పాఠాలు పిల్లలపై ఎలాంటి ప్రభావాలు కల్గిస్తాయో పాఠ్యరచయితలూ ఆలోచించరు, విద్యాధికారులూ పట్టించుకోరు" జోసెఫ్‌లో విసుగు, ఆందోళన, కోపం ముప్పిరిగొన్నట్లున్నాయి.

"నువ్వన్నది నూటికి నూరుపాళ్ళు నిజం జోసెఫ్! బాల్యం నుంచే తల్లిదండ్రుల నుంచి, పాఠశాల నుంచి, ఇరుగుపొరుగు నుంచి పిల్లలకు మంచి కన్నా చెడే బాగా నేర్పబడుతోంది. కొందరు పిల్లలు చూడు, 'ఎడమచేతి వాటం'గలవారుంటారు. వారిని గేలి చేసి అవమానిస్తారు. పెద్దలు పిల్లలూ కూడా. దాంతో అలాంటి వారిలో మానసికంగా బలహీనత ఏర్పడి నత్తి వస్తుంది. అలాగే చిన్నప్పటినుంచి పిల్లల్లో ఏర్పడ్డ భయమే పెద్దయ్యాక కూడా వదలదు. అందాకా ఎందుకు? పిచ్చాసుపత్రుల్లోని రోగుల్లో ఎక్కువమంది మతం నూరిపోసిన మౌఢ్యం వల్ల అనర్థాలు తెచ్చుకున్నవారే..." కోవూర్ ఇంకా ముగించకముందే భోజనానికి పిలుపొచ్చింది. మాట్లాడుకుంటూ ఇద్దరూ కుర్చీల్లోంచి లేచారు.



# పునర్జన్మ అబద్ధమే

శ్రీలంకలో సన్, ది వీకెండ్, ది రవిరేసా అన్న పత్రికలు ప్రముఖమైనవి. అందులో పడిన వార్తలు పాఠకులకు ప్రామాణికాలు. అలాంటి పత్రికల్లో 1977 ఏప్రిల్‌లో ఒక సంచలనవార్త ప్రకటితమయింది. "చచ్చిపోయిన ఓ ప్రభుత్వోద్యోగి మళ్ళీ పుట్టాడు". ఆ వార్తలో ఇంకా ఈ వివరాలున్నాయి.

'మటారా'అనే పట్నంలో ఫ్రాన్సిస్ కొదితవక్కు అనే వ్యక్తి కోర్టు క్లర్కుగా పనిచేస్తూ మరణించాడు. చనిపోయిన ఇంటికి 300 అడుగుల దూరంలోనే వున్న మరో ఇంట్లో తిరిగి ఓ బాలునిగా జన్మించాడు. అతడు తన భార్యను, పిల్లలను గుర్తించాడు. పునర్జన్మపై నమ్మకం లేనివారిని కూడా ఆశ్చర్యపరిచే రీతిలో ఆ బాలుడు ఏ వివరాలు అడిగినా ఖచ్చితంగా చెబుతున్నాడు. అనేకమంది పరిశోధకులు, కొందరు బౌద్ధులు కూడా అతనిది పునర్జన్మేనని ధృవీకరించారు.

ఆ వార్త చదివాక కోవూర్ నవ్వుకున్నాడు. అదంతా అబద్ధమని తనకు తెలుసుకాని లోకం తనలాగా వుందా? ఆ పాటికి ఎందరు పాఠకులు ఆ వార్త నిజమే అయివుంటుందనే నిర్ణయానికి వచ్చి వుంటారో! ఇలాంటి వార్తను ఇలాగే వదిలేస్తే ప్రజలకు వాస్తవాలు ఎలా తెలుస్తాయి? ఈ ఆలోచన రాగానే కోవూర్ తన నిర్ణయాన్ని తన 'సంఘం' ముందుంచాడు.

శ్రీలంక హేతువాదసంఘం సమావేశంలో జరిగిన నిర్ణయం ప్రకారం ఆ 'మటారా పునర్జన్మ' బండారాన్ని బయటపెట్టడానికి 5మంది సభ్యులతో నిజనిర్ధారణ బృందం ఏర్పడింది. అందులో ఆమునుగోడ తిలకరత్నే, అతని భార్య కూడా వున్నారు.

నిజనిర్ధారణ బృందం 1977 మే 13న తన పరిశోధన ప్రారంభించింది. వరుసగా ముఖ్య వ్యక్తులను విచారించింది. చనిపోయిన ఫ్రాన్సిస్ భార్య సుమనావతిని, మళ్ళీ పుట్టాడని చెప్పబడే బాలుని (పునర్జన్మ బాలుడు) తండ్రి సుగతపాల్‌ని, కోర్టు గుమాస్తాలుగా

వున్న ఫ్రాన్సిస్ స్నేహితులు గుణవంత, అరియదాస, అమదోరు రణవీర అనేవారిని, ఫ్రాన్సిస్ సంతానంలో ముగ్గుర్ని, పునర్జన్మ బాలుడ్ని బృందం విచారించింది.

పునర్జన్మ బాలుని వయస్సు ఇప్పుడు మూడేళ్ళ ఆరునెలలు. ఫ్రాన్సిస్ చనిపోయిన ఏడు నెలలకు ఈ బాబు పుట్టాడు.

నిజనిర్ధారణ బృందం మొదటగా మటారాలోని ఫ్రాన్సిస్ పనిచేసే కోర్టు (కచేరి) నుంచి తన పరిశోధన ప్రారంభించింది. అక్కడి ప్రభుత్వ అధికారి వారితో చక్కగా సహకరించాడు. అక్కడ పనిచేసేవారి నుంచి కొంత సమాచారం దొరికింది.

తర్వాత పునర్జన్మ బాలుడి ఇంటికి వెళ్ళారు. వెళ్ళేముందు కొన్ని ద్రాక్షాపళ్ళను కూడా తీసుకెళ్ళారు. బాలునికి భయం, బెరుకు లేకుండా వుండాలని వాటిని ఇచ్చారు. అతనిని ప్రశ్నించడం ముగిసాక కచేరికి తీసుకెళ్లారు. చాలామంది అంతకుముందే ఆ ప్రదేశాలన్నీ తిప్పి వుండడం వల్ల బాలుడు ఎక్కడా కొత్తదనం ఫీల్ కాలేదు. పైగా తండ్రి సుగతపాల్ ఎప్పుడూ వెంటవుంటున్నాడు కూడా. నిజనిర్ధారణ బృందం ప్రశ్నించే తీరు, బాలుడు ఇచ్చిన సమాధానాలు ఇలా వున్నాయి.

"బాబూ! నీ పేరేంటి?"

"ఫ్రాన్సిస్ కొడివతక్కు"

"నీ వయసెంత?"

నలభైతొమ్మిది"

"(ఫ్రాన్సిస్ 52వయేట చనిపోయాడు)"

"నీకు పెళ్ళయిందా?"

"ఆ!"

"నీ వయసు నలభైతొమ్మిదని ఎలా తెల్సు నీకు?"

"నాకు తెలియదు"

"ఏం చదివావు?"

"నాకు తెలియదు"

"నీకు పిల్లలున్నారా?"

"ఆ, వున్నారు"

"మగపిల్లలు ఎక్కువా? లేక ఆడపిల్లలా?"

"ఆడపిల్లలే ఎక్కువ"



"కొడుకులెంతమంది?"

"ఎక్కువమంది"

"వాళ్ళ పేర్లు ఏమిటి?"

"సుసిత, పాటియా"

"వాళ్ళలో చిన్నవాడెవరు?"

"నాకు తెలియదు"

"నీ భార్య పేరేమిటి?"

"తెలియదు"

"నీకేమైనా ఉద్యోగం వుందా?"

"తెలియదు తర్వాత చెప్తాను"

"మీ అమ్మపేరేమిటి?"

"ఎవెలిన్‌వాడి సిన్హా" (ఇది ప్రస్తుత తల్లి పేరు)

"నీ జీతంతో ఏం చేసేవాడివి?"

"నేను దాన్ని పోగొట్టుకున్నాను"

"నీవు రోజూ ఆఫీస్‌కి ఎలా వెళ్లావు?"

"మోటార్‌సైకిలుంది"

"అది ఏ కంపెనీది?"

"తెలియదు తర్వాత చెప్తాను"

"నీవేం ధరించేవాడివి?"

"బెల్‌బాటం"

"ఆ రోజుల్లో నీకేం తినటమంటే ఇష్టం?"

"ద్రాక్షపళ్ళు"

"ఫ్రాన్సిస్ తండ్రి పేరేమిటి?"

"తెలియదు"

"గతజన్మలో నీవు ఎక్కువగా ఏంతాగేవాడివి?"

"సారాయి"

"తాగడానికి డబ్బులెవరిచ్చేవారు?"

"జనం ఇచ్చేవారు"

"నీతో కలిసి ఇంకా ఎవరు తాగేవారు"

"తెలియదు"

"కచేరీలో నీకు స్నేహితులున్నారా?"

"ఆ, వున్నారు"

"వాళ్ళ పేర్లేమిటి?"

"తెలియదు తర్వాత చెప్తాను"

"ఫ్రాన్సిస్ ఏ మతస్థుడు"

"తెలియదు"

"ఫ్రాన్సిస్ భార్య పేరేమిటి?"

"సుమనావతి"

ఈ ప్రశ్నలన్నింటినీ అడిగాక బృందం ఆ బాలుణ్ణి ఫ్రాన్సిస్ ఇంటికి తీసుకెళ్ళింది. తండ్రి కూడా అనుసరించాడు. ఆ సమయాన ఇంట్లో సుమనావతి, ఆమె ముగ్గురు పిల్లలూ ఉన్నారు. మొత్తం ఆరుగురు పిల్లల్లో మొదటి ముగ్గురూ మగపిల్లలు, చివరి ముగ్గురూ ఆడపిల్లలు, సుమనావతికి యాభైఏళ్ళు.

బాలుడు రసిక, పాటియా అనే ఇద్దరు పిల్లల్ని గుర్తించాడు. ఎదురుగా గోడపై ఫ్రాన్సిస్ దిగిన గ్రూప్ ఫోటో సభ్యుల కంటపడింది. వారా ఫోటో చూసి అందులో ఫ్రాన్సిస్‌ని గుర్తించమన్నారు. బాలుడు గుర్తించలేకపోయాడు. ఫ్రాన్సిస్ పిల్లల గ్రూప్ ఫోటో తెప్పించారు. పిల్లల పేర్లు చెబుతూ గుర్తించమన్నారు. బాలుడు ఇద్దర్నే గుర్తించగలిగాడు.

సంవత్సరం పాటు వాళ్ళ ఇంట్లో వుండి ఫ్రాన్సిస్‌కు మంచి స్నేహితుడైన ధర్మదాస ఫోటో చూపించి అతడెవరని అడిగితే బాలుడు తెల్లమొహం వేశాడు. ఫ్రాన్సిస్ పనిచేసిన కచేరీలో ఒక ఆఫీసర్ రిటైరవుతుండగా తీసిన గ్రూప్ ఫోటోలో ఫ్రాన్సిస్‌ను అతని ప్రియ స్నేహితుడైన 'గుణవంత'ను కూడా బాలుడు గుర్తుపట్టలేకపోయాడు.

ఫ్రాన్సిస్ ఓసారి తన స్నేహితులందరితో కటరగామా అనే ప్రాంతానికి విహారయాత్రకై వెళ్ళాడు. దాన్ని గురించి ఆ బాలుడు ఏమీ తెలియదన్నాడు. ఫ్రాన్సిస్ మరో స్నేహితుడు అరియదాసను కూడా బాలుడు గుర్తించలేదు. క్లబ్బులో రోజూ ఫ్రాన్సిస్‌తో పాటు తాగడానికి వచ్చే స్నేహితుడు 'అమదోరు'ను చూపిస్తే అతనెవరో తెలియదన్నాడు.

నిజనిర్ధారణ బృందం మొత్తం డైబ్భై ప్రశ్నల వరకూ ఆ బాలుడిని అడిగింది. వాటిలో నాలుగింటికే సరైన జవాబులిచ్చాడు. అయిదింటికి సగంరైటు జవాబులిచ్చాడు.

వార్తాపత్రికలు పేర్కొన్నదే నిజమైతే పూర్వజన్మలోని జ్ఞాపకాల వల్ల బాలుడు అన్ని ప్రశ్నలకు జవాబులివ్వగలగాలి. అలా జరుగలేదు. కనుక, బాలుడి పునర్జన్మ 'కట్టుకథ'గా బృందం ప్రకటించింది.

అయితే బాలుడు కొన్నింటిని ఎలా వాస్తవంగా చెప్పగలిగాడు? అతని తండ్రి, తదితరులు ఇచ్చిన తర్ఫీదు వల్ల. హిందువుల నమ్మకం ప్రకారం ప్రతి ప్రాణి చనిపోయాక దాని ఆత్మ మరో ప్రాణిగా పుడుతుంది. ఫ్రాన్సిస్ చనిపోయిన ఏడునెలలకు పుట్టిన బాలుడు, పుట్టవలసిన టైము కన్నా ముందే పుట్టాడు. అలా పుట్టకూడదని ఏమీ లేదు. తర్ఫీదు ఇచ్చేవారు ఇది ఆలోచించేవుంటారు.

ఫ్రాన్సిస్ తన స్నేహితులతో దిగిన ఫోటోను బాలుడికిస్తే అందులో ఫ్రాన్సిస్‌ను గుర్తించలేకపోవడానికి కారణం, మొదటిసారిగా అప్పుడే ఆ బాలుడు ఆ ఫోటోను చూడటం. ఫ్రాన్సిస్ భార్యను, ఇద్దరు పిల్లలను గుర్తించడానికి కారణం, వారిని అంతకుముందు చూచివుండడం.

శ్రీలంక హేతువాదులు పునర్జన్మ బండారాన్ని సవివరంగా పత్రికల్లో ప్రకటించారు. బృందం పరిశోధనకు తెర వెనుక సూత్రధారి డాక్టర్ కోవూర్ అని వేరుగా చెప్పనక్కర్లేదు కదూ!



# ప్రేమికుడు

పడుక్కా అనే గ్రామంలో రణసింఘే, అతని భార్య నివసిస్తున్నారు. వారికి ముగ్గురు పిల్లలు. పెద్దకుమార్తె లత, ఎస్.ఎస్.సి. చదువుతోంది. ఇంకా ఇద్దరు ఆడపిల్లలు 12 ఏళ్ళు, 10 ఏళ్ళ వయసులతో 7,5 తరగతులు చదువుతున్నారు. రణసింఘే దంపతులకు మగసంతానం లేదు.

లత అంటే స్కూల్లో అందరికీ చెప్పలేనంత అభిమానం. చదువులో పాఠశాల ఇచ్చే బహుమతులన్నీ ఆమె కొట్టేస్తుంది. ఆటల్లో ఆమె కెప్టెన్‌గా వున్న టీముకే మొదటి బహుమతి వస్తుంది. పాటల్లోనూ ఆమెకి ఎదురులేదు. ఇలా అన్ని రంగాల్లోను విశేష ప్రతిభగల లత అంటే ప్రిన్సిపాల్ దగ్గరనుండి అందరికీ వాత్సల్యపూరితమైన ప్రేమ. ఆ గరల్స్ స్కూల్‌కి ఆమె నాయకురాలిగా వుందంటే, విద్యార్థులందరికీ ఆమె పట్ల వున్న అభిమానం ఎంతో అర్థం చేసుకోవచ్చు.

ఆరోజు దినపత్రికలన్నిటిలో లతను ప్రశంసిస్తూ ఫోటోలు ప్రచురించబడ్డాయి. నెట్‌బాల్ ఆటలో ఆమె కనబరిచిన ప్రతిభను పొగుడుతూ వ్యాసాలు వచ్చాయి. కొలంబో స్కూల్లో వున్న బలోపేతమైన టీముల్ని సైతం మట్టిగరిపించి విజయం సాధించింది లత.

లత అంటే పొరుగునే వున్న బాలుర పాఠశాల బాలురందరికీ ఎంతో ఇష్టం. పదహారేళ్ళ పరువంలో వున్న లతను తమ స్వప్నసుందరిగా భావించే కుర్రోళ్ళు ఎందరో వున్నారు. అధునాతన వస్త్రధారణలో కూడా ఆమెకు ఆమే సాటి.

లత మంచి డాన్సర్, అంతకన్న మించిన పాటగత్తె. ఆ మధ్య పాఠశాలలో ఆమె టికెట్ ప్రోగ్రాం కూడా ఇచ్చింది. టిక్కెట్లన్నీ వేడివేడి పకోడీల్లా అయిపోవటమే కాదు, తన ఆటపాటలతో కుర్రకారుని, ప్రేక్షకుల్ని మైమరపింపచేసింది. పాఠశాల అభివృద్ధి నిధి కోసం ఏర్పరచబడ్డ ఆ ప్రోగ్రాం ఊహలకందనంత ఆర్థికలాభాన్ని చేకూర్చింది.

ఇక ఇంట్లో కూడా లత అంటే తల్లిదండ్రులకు పంచప్రాణాలు. రణసింఘే గవర్నమెంట్ ఆఫీస్‌లో గుమాస్తా. అతని జీతం కూడా తక్కువే. అయినా లత కోసం ఏది

కొనాలన్నా వెనుకాడేవాడు కాదు. ఎన్నో అందమైన గౌన్లు, చీరలు కొనేవాడు. భార్యతో సంప్రదించి అడిగినవన్నీ తెచ్చేవాడు. లతను అందంగా చూడాలని ఆ తల్లిదండ్రులు ఆశపడేవారు.

ఎస్.ఎస్.సి. పరీక్షలు అయిపోవడంతో 'లత' జీవితం మలుపుతిరిగింది. ఏ స్కూల్‌లో ఆమె కీర్తి'లత'మొగ్గతొడిగిందో, ఏ స్కూల్లో ఆమె ప్రజ్ఞాపాటవాలు వెల్లివిరిశాయో, ఏ స్కూల్ ఆమెను అత్యంత అభిమానంతో ప్రేమించిందో, ఆ స్కూల్‌లో మరెప్పుడూ అడుగుపెట్టలేని విధంగా ఆమె జీవితం మలుపుతిరిగింది.

పరీక్షలు అయిపోయిన ఆ రోజు విద్యార్థులందరి ముఖాలలో ఆనందం తాండవ మాడుతోంది. విద్యార్థినులందరూ తమ ఆనందాన్ని అనేక విధాలుగా వెల్లడించడానికి పథకాలు వేస్తున్నారు. కాని లత పరిస్థితి అందుకు భిన్నంగా వుంది. ఆమె ముఖంలో ఆనందం కాగడాపెట్టి వెతికినా కన్పించడంలేదు. నిరాశ, ఏదో కోల్పోయాననే వెలితి, ముభావం ఆమెలో ముప్పిరిగొన్నట్లున్నాయి. జీవితం అంటే విరక్తి గల్గినదానిలా ప్రవర్తిస్తోంది. తల్లిదండ్రులు ఆమె పరీక్షల గురించి అడిగారు. ఏదో చెప్పాలి గనుక చెప్పింది. చెల్లెళ్ళు ప్రక్కనచేరి ముచ్చట్లాడుతుంటే, వారిని విడిపించుకొంది. తమ కూతురిలో కన్పడే మార్పుకి కారణం తెలియక రణసింఘే దంపతులు ఆందోళన చెందసాగారు.

రెండుమూడ్రోజుల నుంచి ఉదయం లేవగానే లత బట్టలు మార్చుకొంటోంది. స్నానమైనా చేయకుండా ఏమిటిలా చేస్తోందని తల్లి అనుకొంది కూడా. అయినా కూతురి ముభావాన్ని గ్రహించి ఏమీ అడగలేదు. అయిదవరోజు ఉండబట్టలేక అడిగింది.

"లతా! ఏమిటి బట్టలు మార్చుకొంటున్నావు? స్నానం చేశాక మార్చుకుంటే బావుంటుంది గదా!"

లత తల్లికి జవాబివ్వడానికి తటపటాయించింది. అయినా తల్లి రెండోసారి కూడా అడిగేసరికి చెప్పక తప్పలేదు.

"అమ్మా! నేను వేసుకున్న బట్టలుతెల్లవారేసరికి చిరిగిపోతున్నాయి. వాటితో ఎలా తిరగ్గలను?" అంది.

తల్లికి ఆశ్చర్యమేసింది. లత విడిచిన గౌనుని పరిశీలించింది. అది ముక్కలుగా చినిగిపోయివుంది. ఎందుకో ఆమెకీ అర్థంకాలేదు. ఎక్కువగా అడిగితే లత బాధపడుతుందని ఏమీ అన్లేదు. మౌనంగా వెళ్ళిపోయింది.

రణసింఘేకి తెలిసినా లతపై వున్న ప్రేమవల్ల అతడూ చూసీచూడనట్లు వెళ్ళిపోయేవాడు.

పదిరోజులు గడిచాయి. ఇప్పుడామె బీరువాలో బాగా వున్నబట్టలేవీ లేవు. అన్నీ చినిగిపోయాయి. అదీ చిరగకూడని చోట్ల చిరగడం వల్ల ఏదోరకంగా వేసుకొందామన్నా సిగ్గనిపిస్తోంది.



రణసింఘే దంపతులకు లత విషయం పెద్ద సమస్యగా మారింది. చాలా బాధపడు తున్నారు. కూతురికేమయిందో అంతుపట్టడం లేదు. చలాకీగా వుండే లత మూగదైపోయింది. రోజూ ఎంతో అందంగా కన్పించే తమ కూతురు చినిగిన బట్టల్లో వికారిగా తయారైంది. ఏమడిగినా చెప్పదు. ఏది కావాలో అడగదు. ఎవ్వరితోనూ మాట్లాడదు. అడగ్గా అడగ్గా ఓరోజు తన బట్టలు ఎందుకు చిరుగుతున్నాయో తనకే తెలియడం లేదంది.

ఇంటికెవరైనా వస్తే పెళ్ళీడుకొచ్చిన పిల్ల చినిగిన బట్టల్లో వుంటే ఎలా? అందుకే మళ్ళీ కొత్త బట్టలు తెచ్చేవారు. ఆ మర్నాటికీ అవీ చిరిగివుండేవి. అతని జీతంలో చాలాభాగం లత బట్టలకే ఖర్చవుతోంది. ఇది గ్రహించిన తల్లికి లత మీద కోపం వస్తోంది. బాగా తిడుతోంది. ఓసారి చెంపమీద గట్టిగా కొట్టింది కూడా.

తల్లి కొట్టిన చెంపదెబ్బతో పరిస్థితులు మరీ విషమించాయి. మర్నాడు లత నిద్రలేచేసరికి లత తొడుక్కున్న కొత్త గౌను నిండా రంధ్రాలున్నాయి. రొమ్మును కప్పే భాగాలన్నీ రంధ్రాలైనాయి. తల్లికి తెలియకుండా ఉండాలని కుట్టుకుంటోంది.

రణసింఘే దంపతుల పరిస్థితి నిస్సహాయమైంది. ఇంటికి ఎవరొచ్చినా లతను చూపించడం లేదు. ఆమె గదికి గడియవేసి వుంచుతున్నారు. ఆహారం అక్కడికే పంపుతున్నారు. ఒక్క లేవటరీకి తప్ప, మరి ఎప్పుడూ లత బయటకిరాదు. లత ఇపుడు ఇంటి జైల్లో ఒంటరి ఖైదీ.

తమ కూతురికి ఏదో దుష్టశక్తి పూనిందని రణసింఘే దంపతులు నిశ్చయించు కున్నారు. ఒక రోజు మంత్రగాణ్ణి సంప్రదించాడు రణసింఘే. తానా దయ్యాన్ని వదిలిస్తానని వచ్చాడు. అయిదుగురు సహాయకుల్ని వెంట తెచ్చుకున్నాడు. మంత్రాలు వల్లిస్తూ ఇల్లంతా కలియదిరిగాడు. పూజలు చేశాడు. తెల్లటిరాళ్ళను ఇంటి నలువైపులా పెట్టించాడు. ఇక ఏ దెయ్యమూ లతదగ్గరకు రాదని, రెండువందల రూపాయలు పుచ్చుకొని వెళ్ళిపోయాడు.

లత పరిస్థితి ఏమీ మారలేదు. మరింత తీవ్రమయింది. ఆరోజు నుండి బట్టలు కత్తిరించడం ఆగిపోయింది. కానీ, నిప్పుతో కాల్చడం మొదలయింది. గౌను నిండా నిప్పుతో కాల్చిన రంధ్రాలే కన్పిస్తున్నాయి. వంటి మీద బట్టలే కాదు, దండెంమీదవీ, బీరువాలోవీ కూడా కాలిపోతున్నాయి. రెండునెలలు గడిచేసరికి లత వంటి మీద చినిగిన

పీలికలు వేలాడసాగాయి. చినిగినవి కుట్టడం కూడా మానేసింది. కుట్టినవే కుట్టడం అవి మరలా చినగడం ఆమెకి విసుగ్గా వుంది. స్నానం చేయాలనే ఆసక్తి కూడా లతకి తగ్గిపోయింది.

ఓరోజు లత తల్లి ఆమె గదిలో కత్తెర్లు, బ్లేడ్లు, అగ్గిపెట్టెలు కన్పిస్తే తీసుకెళ్ళి దాచేసింది. రణసింఘే మరలా ఓ పస్తీవాణ్ని కలిశాడు. అతనికి భూత, భవిష్యత్, వర్తమానాలు తెలుసునని ప్రతీతి. దేన్నైనా దివ్యదృష్టితో చూసి చెప్పగలడని కర్ణాకర్ణిగా విన్నాడు. అతగాణ్ణి ఇంటికి తీసుకువచ్చాడు. లతను చూపించాడు. పస్తీవాడు దివ్యదృష్టితో చూస్తున్నట్లు నటించాడు. 'రణసింఘేగారూ! లత దుస్థితికి కారణం తన మేనమామ' అన్నాడు.

రణసింఘే దంపతులు అదిరిపడ్డారు. వారి ముఖకవళికలు గమనించి పస్తీవాడు ఇలా అన్నాడు "అవును, లతకో మేనమామ వున్నాడు. అతడామెను పెళ్ళాడాలనుకున్నాడు. కానీ తన కోరిక తీరకుండానే చనిపోయాడు. తీరని కోర్కెను తీర్చుకోవడానికి ఇప్పుడిలా పీడిస్తున్నాడు".

రణసింఘే భార్య ఇదంతా సరికాదని కొట్టిపారేసింది. లతకు మేనమామలు ఎవరూ లేరంది. మామ వరుస వారూ కూడా లేరని, ఎవరూ చనిపోలేదని కూడా అంది.

పస్తీవాడింకేం మాట్లాడలేదు. లత మాత్రం ఇదంతా వింటూనే వుంది. పస్తీవాడు వెళ్ళిపోయాడు. ఇప్పటిదాకా వున్న లత పరిస్థితి ఇంకో మలుపు తిరిగింది.

ఇప్పటివరకు తన బట్టలెలా చిరుగుతున్నాయో లత చెప్పలేకపోయింది. కానీ ఇప్పుడు చెప్తోంది. ఓ రోజు తల్లిదండ్రులకు చెప్పింది.

ఎవరో ఓ యువకుడు రాత్రివేళ తన పక్కమీదకి వస్తున్నాడట. తనపై చేతులు వేస్తుంటే తను అడ్డగిస్తోందట. అతడు బలవంతంగా ముద్దాడబోతున్నాడట. ఇద్దరికీ జరిగే పెనుగులాటలో తన బట్టలు చిరిగిపోతున్నాయట.

రణసింఘే దంపతులాశ్చర్యపోయారు. భయపడ్డారు. రణసింఘేకేమీ పాలుపోవటం లేదు. ఆఫీస్‌కెళ్ళి వస్తున్నాడే కానీ, మనసు నిండా ఇదే దిగులు.

ఓరోజు లేస్తూనే పెద్దగా అరచింది లత. తల్లి, తండ్రి పరిగెత్తుతూ ఆమె గదిలోకి వచ్చారు. కూతుర్ని చూసి నిశ్చేష్టులయ్యారు. లత తలవైపు చూసి వారి కళ్ళ వెంట నీళ్ళు సుళ్ళు తిరిగాయి. ఆమె అందాన్ని రెండింతలు చేసే ఆమె జుట్టు ఇప్పుడు లేదు. ఆమె పొడవైన జడ కత్తిరింపబడి వుంది. వెంట్రుకలన్నీ నేలమీద చెల్లాచెదురై వున్నాయి. లత ఏడుస్తోంది. దాన్ని చూసి తల్లి కూడా బిగ్గరగా ఏడ్చింది. వెళ్ళి తన కూతుర్ని కావలించుకొని ఏడ్చింది. తండ్రి కన్నీళ్ళను తుడుచుకుంటూ దగ్గరకొచ్చి –

"అమ్మా! ఏమయిందో చెప్పమ్మా! ఇదంతా ఎలా జరిగిందమ్మా!" అన్నాడు. "నాన్నా!" వెక్కి వెక్కి ఏడ్చింది లత. "రాత్రి ఆ మగదయ్యం రెండుసార్లు వచ్చింది. మొదటిసారి వచ్చినపుడు నా పళ్ళంతా గీరేసింది. అక్కడక్కడా కసిగా కొరికింది. నేనెంతా ఏడ్చినా నా నోరు మూసింది. రెండోసారి వచ్చినపుడు నా జుట్టంతా కత్తిరించి వెళ్ళింది" అంది.

రణసింఘే దు:ఖం కోపంగా మారింది. ఎంత ఖర్చయినా వెనుకాడకుండా ఆ మగదయ్యాన్ని తొలగించాలనుకొన్నాడు. వెంటనే ఓ గొప్ప భూతవైద్యుణ్ని వెంట తీసుకురమ్మని పట్నంలో వున్న తన బావమరిది స్టాన్లీ పెరేరాకి ఉత్తరం రాశాడు. వారు వచ్చే రోజుకి లతకి ఓ కొత్త గౌను కుట్టించాడు.

ఆ రోజు భూతవైద్యుడితో స్టాన్లీ వస్తున్నాడు. లత తల్లి ఉదయాన్నే బలవంతంగా స్నానం చేయించడానికి బాత్రూంకి తీసుకెళ్ళింది. అప్పుడు చూసింది. లత రొమ్ముల మీద రక్కులు, గీరలు వున్నాయి. కుడిచేతి భుజం మీద కొరికినట్లు పంటిగాట్లు వున్నాయి. అవన్నీ చూస్తుంటే దుఃఖం ఆగలేదు. చేసేదిలేక కన్నీళ్ళను దిగమింగుకొని స్నానం చేయించింది. కొత్త గౌను వేసింది.

భూతవైద్యుడు వచ్చాడు. యధావిధిగా తన తంతు జరిపాడు. అడిగినవన్నీ తెచ్చి పెట్టారు రణసింఘే దంపతులు. పూజయిపోయింది. భూతవైద్యుడు తన సంచిలోంచి కొన్ని దారాలు, తాయెత్తులు తీశాడు. వాటిని మంత్రించాడు. ఒకటి లత కుడికాలి గిలకకి, మరొకటి మెడలోను కట్టాడు. మరో అంత్రాన్ని తీసి 'విష్ణురాజ తైలం' కొన్ని చుక్కలు దాన్లో వేసి లత కుడిచేతికి కట్టాడు. తన ఫీజు పుచ్చుకొని చక్కా వెళ్ళిపోయాడు.

రెండ్రోజుల వరకు పరిస్థితి బాగానే వుంది. అంతా పీడ విరగడయిందనుకున్నారు. నవ్వుతూ గడిపారు.

కానీ మూడోరోజు రాత్రి నుండి లత పరిస్థితి మరింత తీవ్రమయింది. రణసింఘే కోపంతో స్టాన్లీకి లెటర్ రాశాడు. ఆ భూతవైద్యం పనిచేయలేదని, వాడు సరైనవాడు కాదని, లత పరిస్థితి మళ్ళీ విషమించిందని రాశాడు.

ఆ తర్వాత స్టాన్లీ వద్ద నుండి రణసింఘేకి ఓ ఉత్తరం వచ్చింది. అదే లత అంధకార జీవితానికి అరుణోదయం.

లత జీవితానికి తానెంతో ఆందోళన చెందుతున్నానని,భూతవైద్యానికి కూడా అది తగ్గలేదు గనుక అటువంటి కేసులను పరిష్కరించగల వ్యక్తి ప్రముఖ మానసిక శాస్త్రవేత్త, హిప్నాటిస్టు అయిన డాక్టర్ కోవూర్ మాత్రమేనని అతనిని సంప్రదించమని స్టాన్లీ సలహా ఇచ్చాడు. అందులో కోవూర్ చిరునామా కూడా వుంది.

రణసింఘే కోవూర్‌కి వెంటనే లెటర్ రాసి కలవటానికి అనుమతి కావాలన్నాడు. కోవూర్ ఇచ్చిన అపాయింట్‌మెంట్ ప్రకారం అతని ఇంటికి వెళ్ళాడు. లత గురించి

అంతా చెప్పాడు. కోవూర్ అంతావిని, ఓ రోజు తానే లతను చూట్టానికి వస్తానని రణసింఘేను పంపించాడు.

ఓ ఆదివారం కోవూర్, తన భార్య 'అక్కా'తో కలిసి 'లతానివాస్'కి వెళ్ళాడు. మర్యాదలు బాగా జరిగాయి. లతతో ప్రత్యేకంగా మాట్లాడాలన్నాడు. లత బెడ్‌రూంలో రెండు కుర్చీలు వేసారు. కోవూర్ దంపతులు ఆ గదిలో ప్రవేశించారు. మిగిలిన వారంతా డ్రాయింగ్ రూంలోనే వుండిపోయారు.

లతను ఎంతో ప్రేమగా పలకరించాడు కోవూర్. కుశల ప్రశ్నలు వేశాడు. 'అక్కా' లత ప్రక్కన కూర్చొని ఆమె చినిగిన బట్టలు చూపించమని కోరింది. లత లేచివెళ్ళి బీరువాలో వున్న బట్టల్ని ఆమె ముందు కుప్పగా పడేసింది.

అన్నీ బాగా చిరిగివున్నాయి. కొన్ని కాలి వున్నాయి. జాగ్రత్తగా తన పరిశీలన సాగించాడు కోవూర్.

లతను ఎగాదిగా చూశాడు. తిండి సరిగా తినకపోవటం వల్లనేమో, బాగా నీరసంగా, బలహీనంగా వుంది లత. ఆరోగ్యంలో ఏ లోపమూ వున్నట్లు లేదు. ఆమె కళ్ళు ఆమెలోని చురుకుదనానికి 'సాక్షులు'గా ఉన్నాయి. ఆమె నవ్వితే చెక్కిళ్ళు గుంటలు పడ్డాయి. కావాలనే నవ్వించాడు కోవూర్. ఆమె పై దంతాలు ముందు రెండింటి మధ్య కొద్ది ఖాళీ వుంది. ఆమె జడవైపు చూశాడు. అది కత్తిరింపబడ్డ విధానాన్ని పరిశీలించాడు. వయసు పదహారేళ్ళయినా, పద్దెనిమిదేళ్ళ జవసత్వాలు, శరీరపుష్టి లతలో వున్నాయి.

కోవూర్ సూచించిన విధంగా 'అక్కా' లతను ఏకాంతంగా పరిశీలించింది. లత గౌను విప్పించింది. ఆమె రొమ్ము భాగాన అయిదుచోట్ల రక్కులు కన్పించాయి. అన్నీ ఎడమరొమ్ము దగ్గరే వున్నాయి. కుడి తొడ మీద మరో రెండు రక్కులు కన్పించాయి. కుడిభుజం మీద వున్న పంటిగాట్లను కూడా స్పష్టంగా గమనించింది అక్కా. ఆ పంటిగాట్లలో పైవరసలో రెండు పళ్ళమధ్య ఖాళీ వుండడం గమనించింది.

కోవూర్ తన భార్య ద్వారా తెలుసుకొన్నవన్నీ నోట్ చేసుకున్నాడు. లత వైపు తీక్షణంగా చూశాడు. పడకమీద వెల్లకిలా పడుకోమన్నాడు. తానడిగే ప్రశ్నలకు ఖచ్చితమైన జవాబులు ఆలస్యం లేకుండా ఇవ్వమని గట్టిగా గద్దించి చెప్పాడు. లత నుండి వచ్చిన జవాబులన్నిటినీ కలుపుకొంటే కోవూర్‌కి కూడా ఆశ్చర్యమేసింది.

***

లత నిద్రిస్తున్నప్పుడు ఓ బలమైన యువకుడు ఆమె వద్దకు వస్తాడు. ఆమెను తన వైపుకి లాక్కొని ముద్దులు పెట్టుకుంటున్నాడు. ఆమెకి చాక్లెట్లు, స్వీట్లు, అత్తరు వంటి పరిమళ ద్రవ్యాలు, ఇంకా అనేక బహుమతులు తెచ్చియిస్తుంటాడు. కొంతసేపు ముద్దలతో

పొద్దుపుచ్చి, తాను కారులో వచ్చానని అది గేటు దగ్గర వుందని, తనతో లేచి రమ్మని అడుగుతాడు. లత రాలేనని చెప్తుంది. ఆ విధంగా ఇద్దరి మధ్య గొడవ మొదలవుతుంది. ఆ గొడవ పెనుగులాటలో అతడు ఆమె బట్టలు చింపేస్తాడు. ఒక్కోసారి కొరుకుతాడు కూడా. అతడి గోళ్ళు వాడిగా వుంటాయి. బట్టలు చింపటానికి లత వారిస్తే కత్తెరతో కత్తిరించేవాడు. ఒక్కోసారి తన ఆకారాన్ని ఎంతో పెంచేవాడు. తన చేతులతో లతను పైకెత్తుకొని తిప్పి ముద్దాడేవాడు. ఆమె గిలాగిలా తన్నుకొన్నప్పుడు కిందకి దించేవాడు. ఓరోజు లత అతన్ని అలా చేయవద్దంది. అందుకే కోపంతో ఆమె జుట్టును కత్తిరించాడు.

లత చెప్పిన ఈ విషయాలన్నీ కోవూర్ పరిశీలనలో కీలకాంశాలు. "అమ్మాయ్! లతా! ఈ యువకుణ్ణి అంతకుముందు నీవెప్పుడైనా చూశావా?" అన్నాడు కోవూర్. "ఆ.. బాలుర పాఠశాలలో అతడు ఫుట్‌బాల్ టీముకి కెప్టెన్. అతని పేరు లయోనెల్, ప్రతిరోజూ నేను స్కూలుకి వెళ్ళేటప్పుడు, స్కూలు నుండి వచ్చేటప్పుడు కన్పించేవాడు. నాతో ప్రేమగా మాట్లాడతాడు. నేను నా టీముతో నెట్‌బాల్ ఆడటానికి ఎక్కడకు వెళ్ళినా నన్ను అభినందించడానికి వచ్చేవాడు" అంటూ గడగడా చెప్పింది లత. "అతడిప్పుడు ఎక్కడున్నాడమ్మా!" అడిగాడు కోవూర్. "లేదు సార్. ఎక్కడా లేదు. మూడునెల్ల క్రితం కారు ప్రమాదంలో చనిపోయాడు" అంటూ కన్నీరు పెట్టింది లత.

కోవూర్‌కి ఇప్పుడంతా అర్థమయింది. ముఖం గంభీరంగా పెట్టాడు. లత కోవూర్‌ను చూసి కొంచెం భయపడింది.

"లతా! నాకంతా తెలుసు. నిజం చెప్పు నీ బట్టలు ఎలా చినుగుతున్నాయి. ఊ.. చెప్పు" గద్దించి అడిగాడు కోవూర్.

లతలో వణుకు మొదలయింది. "సార్! మీరు నన్నేమనకండి చెప్తాను. ఇవన్నీ నేనే చేస్తాను. రాత్రివేళల్లో నా మనసంతా చికాకుగా వుండేది. నాకెప్పుడూ లయోనెల్ గుర్తుకొచ్చేవాడు. అలా జరిగినప్పుడు నా అంతట నేనే బట్టలు చింపేదాన్ని, కత్తెర, అగ్గిపెట్టెలు పగలు నా గదిలోకి తెచ్చి వుంచి, రాత్రి వాటినుపయోగించేదాన్ని". నిజం ఒప్పుకున్నందుకు లతను కోవూర్ అభినందించాడు. మళ్ళీ ప్రేమగా ఆమె వూపు చూశాడు. అక్కా లతను కూర్చోబెట్టింది. ఇలాంటి పనులు ఇకముందు చేయనని లత నుండి హామీ పొంది, ఆమెకు కొన్ని సూచనలు, సలహాలు ఇచ్చారు కోవూర్ దంపతులు.

గంటంబావు తర్వాత లత గదిలోనుండి బయటకొచ్చారు. ఇద్దరూ రణసింఘే దంపతులతో కలసి భోంచేశారు.

భోజనాలయ్యాక రణసింఘేను దగ్గర కూర్చోబెట్టుకున్నాడు కోవూర్. ఒకే ఒక విషయం స్పష్టం చేశాడు. లతకు వచ్చిన దుస్థితి తొలగాలంటే వెంటనే బలమయిన ఆటగాణ్ని చూసి లతకు పెళ్ళిచేయమన్నాడు.

రణసింఘే ఆ సలహాను పాటించాడు.

లత జీవితం మళ్ళీ పుష్పించింది. ఆమెలో పూర్వం వున్న అందం, ఆనందం ఇనుమడించాయి. తన భర్తతో సంతోషకరమైన దాంపత్యజీవితాన్ని గడుపుతూ ఓ అబ్బాయినీ, ఓ అమ్మాయినీ కూడా ఎత్తుకొంది.

అయితే 'లత'దుస్థితిని కోవూర్ ఎలా తొలిగించాడు? అనేది పత్రికావిలేకరులకి అంతుబట్టలేదు. 'లత'గురించి అంతకుముందు వీరంతా తెలుసుకొన్నవాళ్ళే. ఏమీ చేయలేకపోయినవాళ్ళే. అలాంటిది కోవూర్ ఏ విధంగా పరిష్కరించాడు?

ఇదే అడిగారు వారంతా కోవూర్‌ని. కోవూర్ వివరించాడు. లత అన్నిటికీ తనే బాధ్యురాలినని ఒప్పుకొంది. ఒకవేళ తానొప్పకొనకపోయినా ఆమె కావాలని అదంతా చేస్తోందని కోవూర్ మొదట్లోనే గ్రహించాడు. అందుకు తగ్గ ఆధారాలు ఆయనకు లభించాయి.

లత కుడిచేతివాటపు మనిషి. అందుకే ఆమె రొమ్ము మీద రక్కులన్నీ ఎడమవైపే వున్నాయి. ఆమె కాకపోతే, మరెవరైనా ఆ ఒక్కవైపే ఎందుకు రక్కుతారు? కుడివైపు ఒక్కటైనా కన్పించదా? అలాగే కుడి తొడ మీద కూడా కన్పించాయి. గౌను కత్తిరింపులు ఎడమవైపే ఉన్నాయి.

మరో ముఖ్య ఆధారం ఏమంటే – ఆమె కుడిజబ్బ కొరుకుడు, కుడిజబ్బ మీద పంటిగాట్లు ఆమెవేనని, పళ్ళ మధ్య వున్న ఖాళీ వల్ల తెలిసింది. పళ్ళ పరిణామాన్ని బట్టి కూడా అది స్పష్టమయింది.

లత చిన్నప్పట్నుంచీ అందరిలాగానే పెరిగింది. దయ్యాలపట్ల నమ్మకం, భయం ఆమె మనసులో గూడుకట్టుకొని ఉన్నాయి. లతలో స్కిజోఫ్రేనియా అనే మానసికరోగం ఏర్పడింది. అందుకు ప్రధాన కారణం ఆమె తొలియవ్వనపు సెక్స్‌కోరికలే.

లత పరిపూర్ణ ఆరోగ్యవంతురాలు. తిండిపుష్టి, కండపుష్టి గలది. తగిన వ్యాయామం వల్ల శారీరక స్థితి, అందరూ ఆమె పట్ల చూపించే ఆదరణ, ప్రేమల వల్ల మానసిక భద్రత బాగా వున్నాయి. పైగా ఇంట్లో విలాసవంతంగా పెరిగింది. ఇవన్నీ ఆమెలో స్వేచ్ఛను పెంచాయి. అందునా తక్కువ వయసున్నా, ఆమె శరీర పెరుగుదల ఎక్కువ వయసనిపించేలా వుంది.

ఇంట్లో మగపిల్లల సహవాసం లేకపోవడం కూడా 'లత'లో స్కిజోఫ్రేనియాకి మరొక కారణం. తండ్రి పట్ల వుండే అనురాగం వేరు, అన్నదమ్ముల పట్ల వుండేది వేరు. ఆటల్లో, పాటల్లో, అల్లరిలో ఆడా, మగ పిల్లలు కలిసి వుండడం వల్ల వారి వికాసానికి అది తోడ్పడుతుంది. అది లతకు లభించలేదు.

ఆమెతో ఆప్యాయంగా, చనువుగా, ప్రేమగా మాట్లాడిన మొదటివ్యక్తి లయోనెల్. అతడూ ఆటగాడే. ఆరోగ్యకరమైన దేహదారుఢ్యంతో పాటు, అందంగా వుంటాడు. లత ఆటలను, తెలివితేటలను పొగుడుతూ ఉండేవాడు. ఇవన్నీ లతలో అతనంటే ఇష్టాన్ని పెంచాయి. ఆమెలో అతనిపట్ల ఆశాసౌధాలను నిర్మించాయి. హఠాత్తుగా జరిగిన అతని మరణం ఆ సౌధాలను కూల్చివేసింది. తన ప్రియుడు ఇక లేడనే విషయం మానసికంగా క్రుంగదీసింది. అయితే అప్పుడు పరీక్షలవుతుండడం వల్ల తన మనోవేదనలను పైకి కన్పడనీయకుండా అణచిపెట్టింది. పరీక్షలయ్యాక ఒక్కసారిగా బాధంతా ఆమెను చుట్టేసింది. నిరాశ, ముభావం, నిరాసక్తత పెరిగాయి.

బలమైన కండలతో ఆకర్షణీయంగా వుండే లయోనెల్‌ని ఆమె గాఢంగా ప్రేమించిందనడానికి ఉదాహరణ ఆమె భ్రాంతులే. అతడొచ్చి ముద్దాడుతున్నట్లు, పైకెత్తి తిప్పినట్లు, శరీరాన్ని పెంచుతున్నట్లు ఆమెకు అన్పించాయి. అలాగే అతడు బహుమతులు తెస్తున్నట్లు, కారులో తీసుకెళతానన్నట్లు ఆమెకు అన్పించడానికి కూడా అతనిపై ప్రేమే కారణం. ఆమె తన జుట్టు కత్తిరించుకోవడానికి ప్రధాన కారణం ఫ్యాషన్ల పట్ల ఆమెకున్న మోజు. లయోనెల్‌కు తాను రోజూ అందంగా కన్పించాలనుకొనేది స్కూలుకి వెళ్ళేటప్పుడు. అధునాతన యువతిగా అతని మెప్పు పొందాలనే భ్రాంతిలో ఆమె అలా కత్తిరించుకొంది. రొమ్ముల వద్ద గౌనులు కత్తిరించుకోవడం, రక్కుకోవడం, కొరుక్కోవడం ఇవన్నీ అతనితో పడకసుఖం పొందుతున్నట్లు ఆమె భ్రమించి చేసిన పనులు. వాటివల్ల బాధ కలిగినా సుఖంగానే అనుభవించేది.

ఇదంతా విశ్లేషించుకున్నాకనే కోవూర్ రణసింఘేకి ఆ ఒకే ఒక సలహా ఇచ్చాడు. దానివల్లనే లత జీవితం మళ్ళీ చిగురించింది.

ఇదంతా విన్నాక, కోవూర్‌కున్న అమోఘమైన నిశిత పరిశీలనాదృష్టి, చాకచక్యం, హేతువాద పరిశీలన, విలేకరులను ఆశ్చర్యపరిచాయి. కోవూర్ కోరిక మేరకు పాత్రలకు మారుపేర్లు పెట్టి వారు ఈ కథనాన్ని పత్రికలలో ప్రచురించారు.



# భయం...భయం...భయం

"డ్రైవర్! కారు రడీయేనా?"

"రడీయే సార్! మీదే ఆలస్యం"

"ఇదిగో వచ్చేస్తున్నాను ఒక్క నిమిషం" అంటూ ఆ వ్యక్తి తన గదిలోకి వెళ్ళి క్యాష్ బాగ్‌తో బైటకి వచ్చాడు"

కారు కదిలింది. తిన్నగా బూసాలోని జాక్‌పాట్‌ఏరియా వైపు వేగంగా పరుగెడుతోంది. కారులో కూర్చున్న ఆ వ్యక్తి ఆలోచనలు కూడా అలాగే పరుగెడుతున్నాయి. గుర్రప్పందాలంటే అతనికెంత మోజో! తాతలు సంపాదించిన ఆస్తికి వారసుడు. వెనుకా ముందూ ఎవరూ లేరు. డబ్బేం చేయాలి? అందుకే గుర్రప్పందాలు. అవి అతనికి కాలక్షేపాన్ని, వినోదాన్ని ఇస్తున్నాయి.

పగలంతా 'రేసు'లతో గడిపాడు. ఆ రోజు తను పందెం కాసిన గుర్రాలు గెలిచాయి. చాలా డబ్బు వచ్చింది. స్నేహితులతో అక్కడే విందు చేసాడు. అంత డబ్బుతో అక్కడ వుండడం క్షేమం కాదు. అందుకే నమ్మకస్థులైన స్నేహితులతో 'గల్లే' ప్రాంతంలో వున్న రెస్ట్‌హౌస్‌కి ప్రయాణమయ్యాడు. కారునిండా స్నేహితులు కూర్చున్నారు. అందుకే డ్రైవర్ని వెనక్కి వెళ్ళి కూర్చోమని తను స్టీరింగు పట్టుకొన్నాడు. అది పాత మోడల్ కారు. వెనుక ప్రక్కడిక్కీలాగా సామాన్లు పెట్టుకోవడానికి చాలా ఖాళీ వుంటుంది. అక్కడే డ్రైవరు కూర్చున్నాడు. కారు పరుగెడుతుంటే, గడిచిపోతున్న దారిని చూస్తూ తన ఆలోచనల్లో తనున్నాడు.

జోరుగా హుషారుగా పరిగెడుతున్న కారు 'డాడల్లా శ్మశానం' రాగానే హఠాత్తుగా ఆగిపోయింది. కారు లైట్లు ఆగిపోయాయి. డ్రైవర్ వెంటనే కిందకి దిగి ముందుకువచ్చాడు. అక్కడ వీధి లైట్లుకూడా లేవు. ప్రక్కనే శ్మశానం. భయపడుతూనే కారు లైట్లు ఎందుకు ఆరిపోయాయో చెక్ చేస్తున్నాడు.

జమిందార్ విసుగ్గా ఉన్నాడు. "ఇప్పుడది బాగు కాదు కానీ, కార్బయిడ్ లైట్లు వెలిగించు" అన్నాడు. నిజమే ఇప్పుడిక అదే మంచిది అనుకొని కార్బయిడ్ లైట్లు వెలిగించి మళ్ళీ యథాస్థానంలో కూర్చున్నాడు. ఆ రోజుల్లో కారు లైట్లు మధ్యలో ఆగిపోతే, కారును నడిపించుకోవడానికి కార్బయిడ్ లైట్ల సదుపాయం వుండేది.

డ్రైవర్ భయంభయంగా కూర్చున్నాడు.

కారు రెస్ట్‌హౌస్‌కి చేరింది. డ్రైవర్ని పిలిచాడు జమిందార్. జవాబు లేదు.

ఎంత పిలిచినా పలకని డ్రైవర్ మీద విపరీతమైన కోపం వచ్చింది. విసురుగా తలుపు తీసుకుని వెనక్కి వెళ్ళి చూశాడు. అచేతనస్థితిలో డ్రైవర్.. ఎంత కదిపినా లేవలేదు.. సీసా తెచ్చి ముఖం మీద నీళ్ళు చల్లాడు.

డ్రైవర్ నెమ్మదిగా కళ్ళు తెరిచి, కూర్చున్నాడు.

"ఏమిరా, ఏమయింది, చచ్చినవాడిలా పడిపోయావ్?"

"అవున్సార్, చచ్చినంత పనయింది, అసలు చచ్చివుండాల్సింది"

"ఏమయింది అసలు?"

"కార్బయిడ్ లైట్లు వెలిగించి మళ్ళీ వచ్చి కూర్చున్నానా? మీరు కారు స్టార్ట్ చేశారు. నాకెదురుగా ఓ తెల్లని ఆకారం చాలా వేగంగా వస్తోంది. కారు వేగం కంటే ఎక్కువ వేగంతో అది నా వైపు వస్తోంది. రాను రాను పెద్దదై నా దగ్గరికి వచ్చేసింది సార్! ఏం చేయాలి? వళ్ళంతా చెమటలు, భయంతో నాలుక ఎండిపోయింది. అక్కడికీ రెండుమూడు సార్లు పెద్దగా కేకలు పెట్టాను. ప్రక్కనే సముద్రపుహోరు గాలి కదా, మీకు వినపడివుండదు. ఇంతలో ఆ దయ్యం నా పక్కకు చేరింది.తన రెండు చేతులూ నా పీకమీదకు తెచ్చి గట్టిగానొక్కింది. అంతే తర్వాత ఏమయిందో ".. జమిందార్ అది వింటూ నిశ్చేష్టుడయ్యాడు.

***

శ్రీలంకలోని 'గల్లే'లో వున్న డాడల్లా ప్రాంతపు శ్మశానం అంటే జనానికి హడల్. పొద్దుకుంకితే, అటుగా వెళ్ళడానికి కూడా ఎవరూ సాహసించరు. అక్కడ దయ్యాలను గురించి అనేక కథలు ప్రచారంలో వున్నాయి. అందులో పై కథ ఒకటి.

చాలామంది తమ కళ్ళతో దయ్యాలను అక్కడ చూశామంటారు. కొందరైతే తమను వెంబడించాయంటారు. నోట్లో నిప్పులు చిమ్ముతూ సమాధుల చుట్టూ డాన్స్ చేస్తుండగా చూశామంటారు మరికొందరు. చుట్టు ప్రక్కల వుండే వారయితే, అక్కడ రాత్రి వేళల్లో ఏవేవో వింతశబ్దాలు, ఏడ్పులు, అరుపులు, కేకలు విన్పిస్తాయని అంటారు.

ఈ డాడల్లా శ్మశానదయ్యం పూనిన కేసొకటి కోవూర్ దృష్టికి వచ్చింది.



"ఏమండోయ్! ఒకసారి ఇలా రండి" భార్య మాటలకు అదిరిపడి వరండాలో పడుకున్న వాడల్లా వంటింట్లోకి పరిగెత్తాడు సోమరత్నే.

"కిరోసిన్ అయిపోయింది. అది లేకపోతే వంట కాదు, వంటింట్లో దీపం కూడా వెలగదు"

''మరి ఇప్పటి దాకా ఎందుకు చెప్పలేదు? నేను డ్యూటీ నుంచి రాగానే చెప్పితే తెచ్చివుందును కదా! ఏదైనా అయిపోతుంద నుకున్నప్పుడు ముందే తెచ్చి వుంచుకోవాలి"

భర్త మాటలకు చిరుకోపంతో "సరేలే, ఇప్పుడు కిరోసిన్ తెస్తారా, లేదా?" అంది మేనక

బయటంతా చీకటిగా వుంది. అసలే అమాసరాత్రి. "సరే, ఆ సీసా ఇవ్వు తెస్తాను" సోమరత్నే చీకటిలో సీసా పట్టుకొని బయల్దేరాడు.

'గల్లే' పట్నంలోని ఒక విదేశీ కంపెనీలో సోమరత్నే అటెండర్‌గా పనిచేస్తున్నాడు. మేనకతో అతనికి పెళ్ళయి ఎంతోకాలం కాలేదు. ఇంకా పిల్లా పీచు లేకపోవడంతో జల్సాగా కాపురం చేస్తున్నారు. వాళ్ళుంటున్న ఇంటికి కొద్ది దూరంలోనే 'డాడల్లా శ్మశానం' వుంది. ఆ శ్మశానానికి వాళ్ళ ఇంటి సందుకు మధ్య కొన్ని ఇళ్ళు మాత్రమే వున్నాయి.

చీకటి సందు నుంచి నడుస్తూ మెయిన్‌రోడ్‌లోకి వెళ్ళాడు సోమరత్నే. ఏ కొట్టు తీసుందా అని పరికించి చూశాడు. అదుగో! అబ్దుల్‌ఖాదర్ కొట్టు తీసేవున్నాడు!

"సలాం ఖాదర్ భాయ్!"

"సలాం సోమరత్నే సలాం!"

"ఏం భాయ్ నువ్వింక కొట్టుకట్టేయలేదు" అడిగాడు సోమరత్నే.

"కొట్టు కట్టేయబోతుంటే ఒక వింత జరిగింది భాయ్. కొద్దిసేపటి క్రితం ఓ కుర్రవాడు నా కొట్టుకొచ్చాడు. వెళుతూ వెళుతూ అదుగో ఆ గోతిలో పడిపోయాడు భాయ్"

"అయ్యయ్యో! దెబ్బలేమైనా తగిలాయా?"

"బాగానే తగిలాయ్. ఏమయ్యా! నీకు ఈ గొయ్యి ఇక్కడుందని తెలుసు కదా అంటే తెలుసు కాని నేను పడాలని పడలేదు, నన్ను బలవంతంగా నెట్టి తోసారెవరో

అన్నాడు. నిన్నెవరు తోస్తారయ్యా అని అంటే, నల్లగా వున్న ఆకారం తనకు దగ్గరగా వచ్చిందని తోసేసిందని అన్నాడు. ఒంటరిగా ఒక ఇంటికి వెళ్ళలేనన్నాడు. ఇంతలో వాళ్ళ ఇంటివైపు వెళ్ళే ఇంకో కూలీతో జతచేసి పంపించేసరికి ఈ టైమయింది".

"సరే నాకు అర్జంటుగా కిరోసిన్ రెండు లీటర్లు నింపు" అంటూ సీసా అందించాడు సోమరత్నే. ఖాదర్ కబుర్ల పుట్ట. ఒక నిమిషంలో చెప్పేదాన్ని పదినిమిషాల పాటు సాగదీస్తే గాని తృప్తి వుండదు. ఇంటిలో తనభార్య ఒకతే వుంది. అసలే చీకటి రాత్రి.

"ఏమిటి భాయ్, ఇవాళ తొందరపడుతున్నావ్..ఆ.. ఇదిగో కిరోసిన్, ఇంకా ఏం కావాలి"

"ఏమీ వద్దు. ఇంట్లో దీపం కూడా లేదు. త్వరగా వెళ్ళాలి. రేపు కలుస్తాలే. దీని ఖర్చు ఖాతాలో రాసుకో".

సోమరత్నే అసలు భయం ఇంట్లోని దీపం గురించి కాదు. తన గురించే, దయ్యాలంటే విపరీతమైన భయం. కుర్రవాడు గోతిలో పడడానికి నల్లని ఆకారం కారణమనేసరికి అతని గుండెల్లో వణుకు పుట్టింది. డాడల్లా శ్మశానం దయ్యాలు ఎప్పుడు ఎవరిని ఏంచేస్తాయో అని అతని భయం. ఇలాంటి కథలు ఎన్నో విన్నాడు. అందుకే చీకటి పడితే చాలు, బయటకు అడుగు కూడా వేయడు.

మెయిన్‌రోడ్ నుంచి తన సందులోకి తిరిగాడు. చేతిలో నూనె సీసా. మరో చేతితో జేబులోంచి ఒక మేకు తీసి నోట్లో పెట్టుకొన్నాడు. ఇనుపమేకు నోట్లో వుంటే ఏ దయ్యమూ దగ్గరకు రాదని అక్కడివారి నమ్మకం. అలాగే చీకట్లో నడవాల్సి వస్తే పెద్దగా సినిమా పాటలు పాడుతూ వెళ్ళడం తనకలవాటు. అయితే ఇప్పుడంత ధైర్యమేదీ? ఖాదర్‌భాయ్ ఆ కుర్రవాడి గురించి చెప్పకపోయినా బాగుండేది.

మౌనంగా నడుస్తూన్న సోమరత్నే తన వెనుక ఎవరో వెంబడిస్తున్న అలికిడి విన్నాడు. ఆ కారుచీకటిలో, నిశ్శబ్దం ఆవరించిన ఆ ఇరుకు సందులో ఎవరై వుంటారు? కొంచెం ఆగి నెమ్మదిగా వెనక్కి తిరిగి చూశాడు.

పదిపదిహేను అడుగుల దూరంలో నల్లని ఆకారం, ఆడమనిషిలాంటి ఆకారం.

చూసీచూడగానే, సోమరత్నే గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. అది ఖచ్చితంగా ఆ కుర్రవాణ్ణి గోతిలోకి తోసిన దయ్యమేనని నిర్ధారించుకొన్నాడు. ఇక నిలబడడం మంచిది కాదు. అసలే దయ్యం, అందులోనూ ఆడది. కామపిశాచేమో!

మళ్ళీ నడవసాగాడు. పది అంగలు వేశాడు. ఆ దయ్యం ఇంకా వస్తోందా? అనుమానం తీర్చుకోవడానికి ఓరకంట చూశాడు నడుస్తూనే. బాగా దగ్గరకు వచ్చేస్తోంది. సోమరత్నే కాళ్ళు వణుకుతున్నాయి. అడుగు ముందుకు పడడం లేదు. అప్పటికే వళ్ళంతా

చిరుచెమటలు పట్టాయి. అంత భయంలోనూ ఒక్కసారిగా హఠాత్తుగా ఆగి వెనక్కి తిరిగాడు. వెంబడించే ఆకారం కూడా నిలిచిపోయింది. అరవాలనుకున్నాడు, కానీ నోరు పెగల్లేదు.

శక్తినంత కూడగట్టుకుని పరిగెత్తాడు సోమరత్నే. ఆ ఆకారం కూడా పరుగెత్తి వస్తున్నట్లు, తనకు దగ్గరగా వస్తున్నట్లు గమనించాడు. తనను కూడా ఆ కుర్రవాడిలా పడదోసి మీదకెక్కి చంపుతుందేమో! ఈ ఆలోచన రాగానే సోమరత్నే తట్టుకోలేకపోయాడు.

గుండెలు కూడా కాలిపోయేంత ఆయాసంతో ఇంటి వరండాకు చేరుకున్నాడు సోమరత్నే. ఎదురుచూస్తున్న భార్యకు సీసా అందించాడు. రొప్పుకుంటూనే వెళ్ళి మంచం మీద పడిపోయాడు.

తన భర్తకేమయిందోనని భయపడుతూ, మేనక హడావుడిగా దీపంలో నూనె పోసి వెలిగించి తెచ్చింది. ఎంత పిలిచినా భర్త పలకటం లేదు. చేతితో కుదిపినా లేవలేదు. నీళ్ళు చల్లింది ముఖాన.

స్పృహ వచ్చింది. అయినా ఇంకా ఊపిరి కోసం కొట్టుకునే వాడిలా అటు ఇటు దొర్లుతున్నాడు.

మేనక కళ్ళుకన్నీటి కాలువలయ్యాయి. 'ఏమండీ! ఏమయిందండీ?" అంటూ ఏడవసాగింది. ఇరుగుపొరుగును పిలిచినా, ఈ వేళప్పుడు ఎవరొస్తారు? పదినిమిషాల తర్వాత మెల్లగా కళ్ళు తెరిచాడు సోమరత్నే. నీటి కోసం సైగ చేశాడు.

అర్ధరాత్రి 2 గంటల సమయం. హఠాత్తుగా మంచం మీద నుంచి లేచి పెద్దగా అరిచాడు. ఉలిక్కిపడి లేచింది మేనక. మళ్ళీ ఆమెలో ఆందోళన. భర్త తనలో తాను ఏదేదో గొణుగుతూ, అటు ఇటు తిరుగుతున్నాడు గదంతా.

"ఏమండీ, మిమ్మల్నే, ఏమయిందండీ" అని కంగారుగా అడిగింది మేనక. "ఎవరు నువ్వు? నన్ను ఏమండీ అంటున్నావే.. నన్ను గుర్తుపట్టలేదా? నేను శీలావతిని" అంటూ ఆడగొంతుతో మాట్లాడే భర్త వైఖరికి మరింత కంగారు పడింది మేనక.

శీలావతి అనగానే మేనకకు గుర్తొచ్చింది. తన ఇంటి దగ్గర్లో వున్న ఒక జాలరి భార్య కొద్దికాలం కిందటే చనిపోయింది. ఆమెకు అప్పటికే ఇద్దరు కూతుళ్ళు.

మేనక తన భర్తను శీలావతి పూనిందని గ్రహించింది. తెల్లవారిందాక అలాగే జాగారం చేసింది. తెల్లవారుతుండగానే మైలుదూరంలో వున్న తన తల్లిదండ్రులకు కబురుపంపింది. లేచి పనులు చేసుకుంటున్న ఇరుగూ పొరుగుకి కూడా సోమరత్నే విషయం తెలిసిపోయింది.

అంతా చూడడానికి వచ్చారు. అది దయ్యమేనని నిశ్చయించారు. మేనక తల్లిదండ్రులొచ్చేసరికి మంత్రగాడు కూడా వచ్చాడు. సోమరత్నేను మాట్లాడించాడు. అది

జాలరి దయ్యమని, అంతతేలిగ్గా వదలదని క్షుద్రపూజ చేయాలని చెప్పి, ఖర్చు వివరాలు ఇచ్చాడు.

మూడోరోజున అయిదుగురు మంత్రగాళ్ళు వాద్యాలతో సహా వచ్చారు. పూజ జరిపాక, వాద్యాలు మోగుతుంటే మంత్రగాళ్ళతో సోమరత్నే కూడా డాన్సు చేసాడు. మధ్యలో డాన్సును ఆపించి మంత్రగాడు సోమరత్నేను ప్రశ్నించాడు.

తాను శీలావతినని, తన పిల్లల్ని చూడడానికి వచ్చానని అన్నాడు సోమరత్నే. తనకు కోడిపుంజును బలి ఇస్తే గాని సోమరత్నేను వదలనని చెప్పాడు. ఇంకేముంది ఓ కోడిపుంజు తలతెగింది.

సోమరత్నేను దయ్యం వదిలిందని తమ డబ్బు తీసుకుని మంత్రగాళ్ళు వెళ్ళిపోయారు.

సోమరత్నే ఆఫీసుకు వెళ్ళడం లేదు. దయ్యం వదిలిందని మంత్రగాళ్ళు చెప్పినా ఇంకా భయంభయంగానే వుంటున్నాడు. రాత్రివేళ దయ్యాల కలలు వస్తున్నట్లు చెప్తున్నాడు. శీలావతిలా మాట్లాడకపోయినా, వికారంగానే ప్రవర్తిస్తున్నాడు.

సోమరత్నే వుంటున్న ఇంటి సందులో చివర్న జయసింగే నివాసం. జయసింగే కూడా సోమరత్నే ఆఫీసులోనే గుమాస్తాగా పనిచేస్తున్నాడు. అతని కొడుకు సిరిల్, డాక్టర్ కోవూర్ పనిచేస్తున్న కాలేజీలో చదువుతున్నాడు.

ఓరోజు కోవూర్ కాలేజీ గార్డెన్‌లో వుండగా సిరిల్ వెళ్ళి కలిశాడు. మాటల్లో సోమరత్నే గురించి చెప్పాడు. ఎలాగైనా వచ్చి అతన్ని మామూలు మనిషిని చేయమని కోరాడు.

ఆరోజు ఆదివారం. కాలేజికి సెలవు కనుక, సోమరత్నే కేసును పరిశీలించడానికి కోవూర్ వాళ్ళ ఇంటికి వెళ్ళాడు.

పరిచయాలు అయ్యాక, ఏం జరిగిందో కోవూర్‌కి పూసగుచ్చినట్లుగా వివరించాడు సోమరత్నే.

“సోమరత్నే! నీ స్వభావాన్ని బట్టి నువ్వు చాలా భయస్థుడివి. ఆరోజు నిజంగా ఏ దయ్యాన్ని చూడలేదు. అబ్దుల్ ఖాదర్ నీకు అక్కడి కుర్రవాడి సంఘటన ముందుగా వివరించకపోతే నీకు అంత భయం కలిగేది కాదు. నీలో ఏర్పడ్డ మానసిక భ్రమ వల్ల నువ్వు కలత చెందావు” అని కోవూర్ చెప్తుండగానే..

“లేదు సార్! నేను నిజంగా చూశాను. అది ఖచ్చితంగా ఆడదయ్యమే, నా ఇంటి వరకు రావడం గమనించాను కూడా” అన్నాడు సోమరత్నే.

వాళ్ళిద్దరూ ఈ సంభాషణలో వుండగా, సిరిల్ తమ్ముడు వచ్చి కోవూర్‌ని మధ్యాహ్న భోజనానికై తన ఇంటికి ఆహ్వానించాడు.

భోజనం చేస్తుండగా జయసింగే... "మీ పరిశీలన ఎంతవరకయింది సార్!" అన్నాడు. సోమరత్నే చెప్పినదే మళ్ళీ చెప్పాడు కోవూర్. ప్రక్కనే నిలబడి అంతా వింటున్న శ్రీమతి జయసింగే మధ్యలో కలుగజేసుకుంది.

"ఇదా జరిగింది! అయితే అతన్ని ఏ దయ్యమూ పట్టలేదు. దీనికంతకూ కారణం మా ఇంట్లో పనిచేసే లిల్లీ" అని పకపకా నవ్వింది.

"లిల్లీయా? ఎవరామె, ఒకసారి పిలిపించండి"లిల్లీ వచ్చింది. కోవూర్ అడిగిన మీదటలిల్లీ తన అనుభవాన్ని వివరించింది.

ఆరోజు సింహళీయులకు ఉగాది. జయసింగే ఇంట్లో పనిచేస్తున్న లిల్లీ పండుగరోజు కోసం తన ఇంటికి వెళ్ళింది. సాయంకాలంలోపు తిరిగి పనికి వస్తానని కూడా చెప్పింది. అయితే పండుగ ముచ్చట్లలో పడిపోయి ఆలస్యంగా బస్సెక్కి రాత్రి 7గంటలకు డాడల్లా చేరింది. ఆ సన్నని సందునుంచి నడుస్తూ జయసింగే ఇంటికి వెళ్ళడానికి భయమేసింది. చుట్టూ ఓసారి చూసింది. ఎదురుగా అబ్దుల్ ఖాదర్ దుకాణంలో సోమరత్నే కన్పించాడు. 'అమ్మయ్య' ఫరవాలేదనుకొని, అతడు బయలుదేరిందాకా బస్టాపులో నిల్చుంది. సోమరత్నే తన కిరోసిన్ సీసాతో సందులోకి తిరిగాడు. అతని వెనుకనే కొద్దిదూరంలో నడవసాగింది. సోమరత్నేతో కలిసి మాట్లాడుతూ వెళ్ళవచ్చు. కానీ ఎవరైనా చూస్తే.. ఆ చీకటిలో తామిద్దరమే ఉన్న ఆ సందులో ఏదైనా జరిగితే.. ఈ ఆలోచనతో లిల్లీ భయపడింది. సోమరత్నేను అనుసరిస్తూ, మధ్యలో అతడాగినపుడల్లా ఆగుతూ, అతను వేగంగా నడిస్తే, వెనుకబడిపోతానన్న భయంతో తానూ వేగం పెంచుతూ, అతను పరిగెత్తితే తాను పరిగెత్తుతూ, చివరికి ఎలాగైతేనేం ఇంటికి చేరింది. రొప్పుతూ, భయపడినట్లు వస్తున్న లిల్లీని చూసిన జయసింగే భార్య విషయమంతా అడిగి తెల్సుకుంది. అలా, ఆ వేళప్పుడు వచ్చినందుకు లిల్లీని తిట్టింది కూడా.

కోవూర్ జయసింగే దంపతులను, లిల్లీని, సిరిల్‌ను తీసుకుని సోమరత్నే ఇంటికి వచ్చాడు. సోమరత్నే వింటుండగానే లిల్లీ మళ్ళీ తన కథనాన్ని విన్పించింది. అప్పుడుగానీ సోమరత్నేకి విషయం అర్థంకాలేదు. లిల్లీ వల్ల తానెంత భయపడ్డాడో!

కోవూర్ అక్కడున్నవారిని ఉద్దేశించి ఇలా చెప్పసాగాడు.

"ప్రపంచంలో ఎన్నో జీవజాతులున్నాయి. అతి చిన్న ఏకకణ జీవి అమీబా మొదలు అతి పెద్ద ఆకారాలు గల డైనోసార్లు వరకు వివిధ పరిమాణాల్లో జీవులు బ్రతుకుతుంటాయి. అందులో మనిషికి మాత్రమే దయ్యాల భయం వుంది. అది అతడు ఏర్పరుచుకున్న భయమే. జీవులు చనిపోయాక, వాటి ఆత్మలు దయ్యాలై తిరుగుతాయని మనిషి మాత్రమే నమ్ముతాడు.

జీవికి ఆత్మ అనేది వుంటుందని ఎన్నడూ, ఎక్కడా రుజువు కాలేదు. అయినా, ఆత్మపై విశ్వాసం వుంచుకొని, తద్వారా పూర్వజన్మ, పునర్జన్మ, స్వర్గం, నరకం, మోక్షం

మొదలైన అనేక కల్పనలకు పూనుకొన్నాడు మనిషి. ఆదిమానవుల అజ్ఞానం, నేటి విజ్ఞాన యుగంలో మనిషిని ఇంకా శాసిస్తోందనడానికి ఈ 'ఆత్మ' ఒక ఉదాహరణ.

ఆత్మ దయ్యమవుతుందని నమ్మి భయపడడం మొదలుపెడితే, చీకట్లో మనకు కన్పించే ప్రతిదీ ఏదో ఆకారంలో వుంటూ మనల్నివెంటాడుతుంది. అలాంటి అనుభవాలను బట్టే కొందరు తాము దయ్యాలను చూశామంటారు. కొందరు దాని శబ్దాలను, మాటలను విన్నామంటారు. ఇంకొందరు దాన్ని తాకామంటారు. ఇంకా ఎన్నో విధాల వర్ణించి చెప్తారు. కానీ అవన్నీ వారి వారి భ్రమలనీ, భ్రాంతులనీ ఎవరైనా చెపితే ఒప్పుకోరు. తన అనుభవాన్ని విశ్లేషించుకొని, పరిశీలించుకొని వాస్తవాన్ని గ్రహించేవారు వారిలో అతికొద్దిమందే వుంటారు.

దయ్యాలను చూశామనే వారంతా రాత్రివేళనే చూశామంటారు. అవి బాగా ముస్తాబయి కనిపించాయని కూడా చెప్తారు. అదే నిజమైతే, దయ్యాల్లో కూడా బట్టలు తయారు చేసేవి వుండాలి. వాటికి మళ్ళీ మార్కెటింగు వుండాలి. వాటిలో మళ్ళీ లాభనష్టాలు, ధనిక పేద వర్గాలుండాలి. కాని అలా జరిగే వీలుందా? ఇవన్నీ మనం అడిగితే జవాబులు రావు. అసలు ఆత్మకు ఆకారం ఉండదనే వారూ ఉన్నారు. వారు ఇవన్నీ నమ్మరు. కానీ నిరాకారంగా వుంటుందంటారు. ఒక నియమిత ఆకారంలేని దాన్ని పంచేంద్రియ జ్ఞానానికి అతీతమైనదాన్ని 'ఉందని' ఎలా చెప్పగలం?

కనుక, 'ఆత్మ' పేరుతో ప్రచారమవుతున్న భావజాలమంతా దగా. ఆ భావజాలంతో మన మనుగడను మనమే మోసం చేసుకుంటున్నాం.

డాడల్లా శ్మశానంలో పూడ్చబడ్డ శవాలన్నీ ఇంటి వద్ద మరణించిన వారివో, లేక హాస్పిటల్లో, ప్రమాదాల్లో, లేక మరోచోటనో మరణించిన వారివో అయివుంటాయి. ఎక్కడ మరణిస్తే అక్కడే ఆత్మ తిరుగుతుందనేది నిజమైతే, ఈ డాడల్లా శ్మశానంలో దయ్యాలు వుండవు. అలాకాదు, ఆత్మలు శవాలున్న చోటే వుంటాయనుకొంటే, కాల్చబడ్డ శవాల సంగతేమిటి? ఒకవేళ కాల్చిన బూడిదతో పాటే ఆత్మలున్నాయనుకొంటే గాంధీ, నెహ్రూల 'దయ్యాలు' ప్రపంచమంతా వుండివుండాలి. వారి శవాలను కాల్చి, ఆ బూడిదను గాలిలో, నీటిలో, సముద్రాల్లో కలిపారు గదా!

కనుక 'ఆత్మ' వుందని నమ్ముతూ నిత్యం మీరు 'ఆత్మవంచన'కు గురికాకండి. దాని చుట్టూ అల్లుకొన్న భావజాలంలో పడి జీవితాన్ని దుర్భరం చేసుకోకండి.

కోవూర్ దయ్యాలగురించి, భయాలను గురించి చెప్పిందంతా విన్నాక సోమరత్నేలో ధైర్యం వచ్చింది. అందరికీ కృతజ్ఞతలు చెప్పుకొన్నాడు. మర్నాడు తన డ్యూటీకి తాను చక్కగా వెళ్ళిపోయాడు.



# మహాత్ములను ఛాలెంజ్ చేయండి!

"నమస్కారమండీ!"

"నమస్కారం"పుస్తకంలోంచి తలపైకెత్తి ఎదురుగా చూశాడు కోవూర్.

"ఈ అమ్మాయి నా మనుమరాలు. పేరు విమల" అంది వచ్చిన ముసలమ్మ.

"అలాగా" అంటూ విమలను ఎగాదిగా చూశాడు కోవూర్.

"మా మిత్రుడు ఫెర్నాండో, సోమతిలకేలు మా గురించి మీకు చెప్పే వుంటారు. మేము అనురాధపురానికి దగ్గర్లో వున్న 'అలంకులామా' నుంచి వచ్చాం బాబూ!"

శ్రీలంక హేతువాద సంఘ సభ్యులు ఫెర్నాండో, సోమతిలకేల పేర్లు చెప్పగానే, వారు ఎందుకు వచ్చారో కోవూర్‌కి అర్థమయింది. చేతిలో చదివే పుస్తకాన్ని టేబుల్ మీదుంచాడు.

రండి, కూర్చోండి – నాయనమ్మ, మనమరాళ్ళు కూర్చున్నారు. కోవూర్ విమల వైపు పరిశీలనగా చూశాడు. ఇరవై ఏళ్ళ వయసులో ఎంతో అందంగా కన్పిస్తున్నా విమల ముఖంలో ఆనందచ్ఛాయలు మాత్రం లేవు. ఏదో వెలితి, నిరాశ ఆమెను పీడిస్తున్నట్లు స్పష్టమవుతోంది.

"నా మిత్రులు మీ గురించి చెప్పారమ్మా! కానీ వివరాలు సరిగా ఇవ్వలేకపోయారు. ఈ పాప గురించే గదా మీరు వచ్చారు?" అడిగాడు కోవూర్.

"ఈ పిల్ల గురించేనండి మా దిగులంతా!" ఎంతో భారంగా అంది వృద్ధురాలు.

"విమల తల్లిదండ్రులు రాలేదా?"

"వచ్చేస్తారండీ, ఎందుకో ఆలస్యమయివుంటుంది"

"ముందుగా, ఈ విమల గురించి, ఈమె బాధ గురించి మీకేం తెలుసో చెప్పండి" అడిగాడు కోవూర్.

విమల నాయనమ్మ తనకు తెల్సిందంతా కోవూర్ ముందు ఓ కథలా చెప్పసాగింది.

***

పదేళ్ళ వయసున్నప్పుడు, చదువుకొంటున్న రోజుల్లో, ఓ రోజు విమల పాఠశాలలో స్పృహతప్పిపడిపోయింది. పరిస్థితిని గమనించిన హెడ్మాస్టర్, తల్లిదండ్రులకు కబురుపెట్టారు. వాళ్ళు వెంటనే ఒక డాక్టర్ దగ్గరకి తీసుకెళ్ళారు. శరీరంలో ఏ జబ్బూ లేదని, అజీర్ణం వల్లనో, కడుపునొప్పి వల్లనో అలా జరిగివుంటుందని అన్నాడు.

రెండేళ్ళు గడిచాయి. ఓరోజు విమల మళ్ళీ పొలంలో పడిపోయింది. డాక్టర్‌కు చూపించారు. తన వల్లకాదని, ఎవరైనా మానసిక వైద్యునికి చూపించమన్నాడు ఆ డాక్టర్. ప్రముఖ మానసిక వైద్యుడు డాక్టర్ గ్రిమ్ లేయర్‌కు చూపించారు. మెదడును పరీక్షించి కొన్ని మందులు ఇచ్చాడు డాక్టర్. తర్వాత ఏ బాధా లేకపోవడంతో స్కూలుకు మామూలుగానే వెళ్ళేది విమల.

కొన్ని నెలలు గడిచాక మళ్ళీ ఓరోజు విమల పడిపోయింది. తల్లిదండ్రులకు విమల బాధేమిటో అర్థంకాలేదు. ఆందోళన పడసాగారు. బంధువులు, మిత్రులు, ఇరుగుపొరుగు వాళ్ళు అలా జరగడానికి ఏ గాలో, దయ్యమో కారణమన్నారు. డాక్టర్లకు డబ్బు తగలేసేకన్నా, భూతవైద్యులను పిలిపించడం మంచిదన్నారు.

ఆ సాయంత్రమే భూతవైద్యుడు ఇంటి ముందు ప్రత్యక్షమయ్యాడు. తన తతంగం కానిచ్చి, దయ్యమే పూనిందని చెప్పి చేతికొక దారం, మెడలో ఓ దారం కట్టి మరేం ఫరవాలేదన్నాడు.

మర్నాటి నుంచి విమలకు పూనకాలు రావడం మొదలయ్యాయి. అర్థంపర్థంలేని మాటలు, వాగుడు ఎక్కువయ్యాయి.

తల్లిదండ్రులు విమలకు చదువు మాన్పించారు. కొందరిచ్చిన ఉచిత సలహాతో 'పహల్‌గామా'లోని 'వల్లీ'దేవాలయానికివిమలను తీసుకెళ్ళారు. అక్కడ పూజారి విమల కథంతా విని, మూడురోజుల పాటు ప్రత్యేక పూజలు చేయిస్తే పట్టిన 'గ్రహం' విడిచిపోతుందని అభయహస్తం చూపించాడు. కాగితమ్మీద కొన్ని వస్తువుల వివరాలు వ్రాసి, మళ్ళీ నేను రమ్మన్నపుడు వాటితో రమ్మన్నాడు. ఆ లిస్టులో విమలంత పొడవున్న బంగారు గొలుసు కూడా ఒకటుంది.

పూజారి చెప్పిన రోజున అన్ని వస్తువులతో వెళ్ళారు విమల తల్లిదండ్రులు. పూజ మూడురోజులు జరిగింది. నాలుగు అడుగుల 10అంగుళాల పొడవున్న బంగారు గొలుసు

పూజారి సొంతం అయిపోయింది. రూ॥137, రూ॥147, రూ॥157 వంతున మూడు పూజలకు దక్షిణ ముట్టింది. ఆ పూజల్లో కూడా విమల అచేతనురాలయ్యేది.



మూడోరోజున డాన్సు చేస్తున్న విమల, పెద్దగా అరుస్తూ తను 'వల్లీ' దేవతనని చెప్పింది. తనకీ ఆలయంలో ఉండడం ఇష్టంలేదనీ, విమల ఇంటిలోనే తాను వుంటాననీ వల్లీదేవత విమల ద్వారా పలికింది!

ఇంటికి తిరిగి వచ్చాక, ఇంటిలో తనకొక గుడి కట్టించమని పోరు పెట్టసాగింది. 'దేవత చెపితే తప్పేదేముంది?' అనుకొని ఇంటి ఖాళీ స్థలంలో గుడినిర్మాణానికి ప్రయత్నాలు ప్రారంభించాడు విమల తండ్రి. గుడి పూర్తికాగానే కొందరు పూజారులు, వాద్యకారులు తయారయ్యారు. రోజూ పూజలు జరిగేవి. డప్పులమోత వినగానే విమల అచేతనురాలై నిద్రలోకి వెళ్ళిపోయేది. అది చూసి, చూడడానికి వచ్చినవారంతా విమలను 'వల్లీ అవతారం' అని పిలవసాగారు. మొదట్లో రోజూ పూజలు జరిగేవి. ఖర్చు పెరిగి రాబడి లేకపోవడం వల్ల వారంలో మంగళ, శుక్రవారాల్లోనే పూజలు జరిపించేవాడు విమల తండ్రి. రెండే రోజులవడంతో జనం కూడా ఎక్కువ వచ్చే వీలు కలిగింది.

కొద్దిరోజుల్లోనే విమల పేరు శ్రీలంక అంతటా వ్యాపించింది. జనం గుంపులు గుంపులుగా రాసాగారు.

మంగళ, శుక్రవారాల్లో పూజలు రాత్రివేళల్లోనే జరిగేవి. ఓ ప్రక్క డప్పుల మోత, మరో ప్రక్క మంత్రాల ఘోష. ఆ సమయంలో గుడిలో కూర్చుండి, నిద్రాస్థితిలోకి వెళ్ళిపోయేది విమల. అప్పుడే ఎవరికేకష్టమొచ్చినా, ఏ బాధలున్నా తరణోపాయం చెప్పేది.

రోగులు ఆమె దగ్గరకెళితే తన ప్రక్కనే గిన్నెలో వున్న 'దివ్యతైలాన్ని' చేతితో అంటి నుదుట బొట్టు పెట్టేది. ఆ 'నూనెబొట్టు'తోనే తమ జబ్బులు తగ్గిపోతాయనే నమ్మకం కూడా జనంలో వ్యాపించింది. ప్రతిఫలంగా నాలుగు తమలపాకుల్లో రెండురూపాయిలుంచి విమలకు సమర్పించేవారు రోగులు.

విమల 'నూనెబొట్టు వైద్యం' కోసం కొలంబో నుండి కూడా ధనవంతులు, విద్యావేత్తలు, రాజకీయ నాయకులు కార్లలో వచ్చేవారు. 'జోస్యాన్ని' చెప్పించుకునేవారు. పెద్దమొత్తంలో కానుకలు ఇచ్చేవారు.

ఏవైనా ఎన్నికలు వస్తే విమల ఇంటి ముందు హడావుడి అంతా ఇంతా కాదు. ఎన్నికల్లో పోటీచేసేవారు తమ మందీమార్బలంతో ప్రవాహంలా వచ్చిపడేవారు. గెలిచేవారు, ఓడేవారు ఎవరొచ్చినా గెలుస్తారనే విమల చెప్పేది. గెల్చినవారు సంతోషంతో ఆమెకు ముడుపులు చెల్లిస్తుంటే, ఓడినవారు తమ 'కర్మ'అనుకొనేవారు.

విమల తల్లిదండ్రుల ఆర్థికపరిస్థితి బాగా మెరుగయింది. గుడిని కూడా అందంగా తీర్చిదిద్ది మరింత ఆకర్షణ కల్గించారు. గుడి చుట్టూ రకరకాల దేవతల, దేవుళ్ళ బొమ్మలు, సగం జంతువు, సగం మనిషి, పది తలలు, ఇరవై చేతులు, ఎనిమిది కాళ్ళు, పదహారు చేతులు.. ఇలా వింతాకారాల బొమ్మలు గుడినిండా పెట్టారు. విమల కూర్చొనే పీఠం ప్రక్కనే వల్లీ దేవతకొక పీఠం వుండేది. కర్పూరం వెలిగించేందుకు ఒక బంగారు పళ్ళెం, విమల ఫోటోలపై పూలదండలు, రెండు హారతి దిమ్మలు, సిద్ధంగా వుండేవి. 'దివ్యతైలం' తయారీకొక గది కూడా వుండేది.

శ్రీలంకలోని విమల 'వల్లీ'అవతారమని, ఆధ్యాత్మిక పత్రికలు కూడా చాటింపుచేయడం మొదలుపెట్టాయి. కొందరు పండితులు తమ కల్పనాచాతుర్యంతో ఆమె గురించి, ఆమె అవతారం గురించి పురాణాలు, కావ్యాలు వ్రాయసాగారు.

అటువంటి పరిస్థితుల్లో శ్రీలంక హేతువాద సంఘం సభ్యులు రంగంలోకి దిగారు. విమల ఇంటికి వచ్చారు విమల చేష్టలను గమనించారు. తల్లిదండ్రులను కలిసి విమల వల్లీ 'దేవత'కావడం బూటకమని, ఆమె మానసిక ధోరణులకు గల కారణాలను వివరించారు. హేతువాదులైన ఫెర్నాండో, సోమతిలకేల సలహాలు విమల తల్లిదండ్రులను ఆలోచింపచేసాయి.

1964 ఏప్రిల్ 10వ తేదీ తన తల్లిదండ్రులు, భక్తులు, ప్రజలు ఆశ్చర్యపడే సంఘటన జరిగింది. విమల తాను వల్లీదేవతను కానేకానని ప్రకటించింది. తాను ఇక ముందే ఏ నూనె బొట్టులు ఎవరికీ పెట్టననీ, ఎవరికీ జోస్యం చెప్పననీ మొండికేసింది. పూజకై వచ్చిన పూజారులను, వాద్యకారులను అక్కడినుండి తరిమేసింది. తాను స్త్రీలందరిలాంటి దానినేనని, ఇకనుంచి తాను కూడా అలాగే జీవిస్తానని చెప్పింది.

పూజలు, మంత్రాలు ఆగిపోయాయి. జనం రావడం తగ్గిపోయింది. ఆ తర్వాత కూడా విమల రెండు మూడుసార్లు స్పృహ కోల్పోయింది. అతివాగుడు బాగా తగ్గిపోయింది.

***

విమల నాయనమ్మ కథనం సమగ్రంగానే అన్పించింది డాక్టర్ కోవూర్‌కి. తల్లిదండ్రులు వచ్చినా ఇంతకన్నా తెలుసుకోవాల్సిందేముంది?

కోవూర్ విమలను హిప్నోసిస్‌లోకి తీసుకెళ్ళాడు. ఆ నిద్రలో వుండగానే 'వల్లీదేవత'గురించిన కథనాలన్నీ అబద్ధాలని, వాటిని నమ్మనవసరం లేదని చెప్పాడు. ఇకనుంచి వల్లీదేవత విమల దగ్గరికి రాదన్నాడు. అలాగే ఏ దయ్యాలూ ఆమెకేమీ చేయవని చెప్పారు. పూనకాలు రాకుండా ఆమెకు అనేక సజెషన్స్ (సూచనలు) ఇచ్చాడు.

ఆ నిద్రలోనే తనకు చదువుకోవాలని వుందని చెప్పింది విమల. పెళ్లిచేస్తే చేసుకుంటానని చెప్పింది. వల్లీదేవత గుడికి వెళ్తావా అంటే వెళ్ళనంది. ఆ దేవత ఇకనీపైకి రాదు అని చెప్పగానే ఆమె ముఖం విప్పారింది.

కోవూర్ తిరిగి విమలను వృద్ధురాలికి ఒప్పగించారు. తీసుకోవాల్సిన జాగ్రత్తలు, తల్లిదండ్రులకు చెప్పవలసినవీ ఆమెకు వివరించాడు.

విమల ఇరవై ఏళ్ళ ప్రాయపు అందానికి ఇపుడు ఆనందం కూడా తోడయింది. అక్కడికి వచ్చినపుడు నిరాశ, వెలితి ఇపుడు తొలిగాయి. ఉరకలు వేసే ఉత్సాహంతో ఇంటికి వెళ్ళింది.

మొదట విమల తక్కువ స్థాయిలో వున్న హిస్టీరియాతో బాధపడేది. డాక్టర్ గ్రిమ్‌లేయర్ వైద్యాన్ని కొనసాగించి వుంటే ఆమె బాధ నుంచి బయటపడేది. అలా జరగకపోవడమే ఆమె 'దేవత' అవడానికి కారణం.

తమకే రోగంవచ్చినా దయ్యాల వల్లనే అయివుంటుందన్న నమ్మకం ఆదిమ మానవుల కాలం నాటిది. ఆ నమ్మకాన్ని సొమ్ము చేసుకోవడానికే భూతవైద్యులు, తాంత్రికులు తయారయ్యారు. వైద్యవిజ్ఞానం వృద్ధి చెందిన ఆధునికయుగంలో, అభివృద్ధి చెందిన దేశాలలో క్షుద్రవిద్యలు మంత్రతంత్రాలు తగ్గి హాస్పిటల్స్ పెరిగాయి. పేదదేశాల్లోనే అవి ఇంకా మనగల్గుతున్నాయి.

దయ్యం పట్టిందని భూతవైద్యుడన్నాకనే, విమలలో పూనకాలు మొదలవడం గమనార్హం. 'వల్లీ'గుడిలో పూజలు జరిగాకే, ఆమె 'వల్లీ'దేవతగా మాట్లాడసాగింది. హేతువాదులు వెళ్ళి 'వల్లీ' కాదు, విమల 'మానసికరోగి' అని చెప్పాక, పూజలు నిలిపివేయడం గమనించాలి. వీటన్నిటినీ బట్టి, "దేన్నైనా త్వరగా నమ్మే స్వభావం విమలది" అని తెలుసుకోవచ్చు.

భవిష్యత్తును చెప్తామనేవారు దగాకోరులు. రాబోయే పరిస్థితులను ముందుగానే చెప్పగల్గడం ఎక్కడా జరగదు. అయితే, సైన్సు సహాయంతో వాతావరణం, తుఫానులు, కరువులు, వర్షపాతం మొదలైనవన్నీ నేడు శాస్త్రవేత్తలు చెప్పగల్గుతున్నారు. నేటి జ్యోతిష్యులు సైన్సు వాడుకుంటూనే, పైకి మాత్రం 'ఇదంతా తమ జ్యోతిశ్శాస్త్ర ప్రభావం' అని మనల్ని దబాయిస్తారు. ఆ దబాయింపుల్ని నమ్మేవారంతా వాళ్ళ బుట్టలో పడతారు. మహత్తులున్నాయని, మహాత్ములు కొందరున్నారని అలాంటివారిని నమ్మేవారు పనిగట్టుకొని

ప్రచారం చేస్తారు. అవన్నీ అబద్దాలనీ వారెరుగక పోవటానికి కారణం, వారిలో పరిశీలనాదృష్టి లేకపోవడమే.

కొందరు మానసికంగా వికలత్వంగలవారుంటారు. వారి ప్రేలాపనలన్నిటికీ ఆధ్యాత్మికంగా అర్థాలు పుట్టించి వారిని మహాత్ములను, తర్వాత దేవుళ్ళను చేసే ప్రవృత్తి మరికొందరిది.

విమల విషయంలో అదే జరిగింది. ఆమె జోస్యం, ఆమె 'వైద్యం' ఏ సత్ఫలితాలను ఇవ్వలేదు. అయినా ఆమెను ఒక దేవతను చేసి కొలిచారు. పురాణాలు, కథలు కల్పించేంతవరకు వెళ్ళారు. ఆమె తన చేతిని తలపై పెట్టినపుడో, నూనెబొట్టు పెట్టినపుడో కొందరిలో ఒకరకమైన మానసిక తృప్తి కలగవచ్చు. అది వారి మనోబలహీనతకు చిహ్నం. ఇలాంటి ప్రక్రియలవల్ల ఒక్కోసారి కొన్ని రోగాలు లోలోపల అణచబడి ప్రాణాపాయానికి దారి తీయవచ్చు.

ప్రపంచంలో నిజంగానే ఎవరైనా అతీంద్రియశక్తి గలవారుంటే, వారంత ధనవంతులు మరెవరూ వుండరు. జాక్‌పాట్‌లో గెలిచే గుర్రాల నంబర్లు, లక్షలు, కోట్లు రప్పించే లాటరీ టికెట్ల నంబర్లు వారిని ధనవంతులని చేయవా?

అలాంటి వారేవుంటే ప్రభుత్వం ఎన్నడో వారికి ప్రత్యేక ఉద్యోగాలు, హోదాలు కల్పించేది. వారి వల్ల సి.ఐ.డి.వారికి లాభం. వ్యాపారంలో ధరల మార్పిడి ముందే పసిగట్టి జాగ్రత్త పడవచ్చు. వాతావరణ బీభత్సాలను తెలుసుకోవచ్చు. అట్టి వారికి, 'అతీంద్రియ జ్ఞాన మంత్రిత్వశాఖ'ను కేటాయించవచ్చు. దాని వల్ల ఆ శాఖామంత్రి మిగిలిన జ్యోతిష్యులను సంప్రదించి భవిష్యత్తును ప్రభుత్వం ముందుంచే అవకాశం వుంటుంది. బడా పారిశ్రామికవేత్తలయితే అట్టివారికి కోట్లాదిరూపాయిలు చెల్లించి ఆర్థికమంత్రి ప్రవేశపెట్టబోయే బడ్జెట్ గురించి తెలుసుకొని అపారలాభాలు గడించే వీలుంటుంది.

ప్రజల్లో వున్న అజ్ఞానం మీద, అమాయకత్వం మీద ఆధారపడివున్న వివిధ మూఢనమ్మకాలను సొమ్ము చేసుకునే దగాకోరులు, మోసగాళ్ళు అనేకమంది వున్నారు. వారినుండి, మూఢనమ్మకాలనుండి సమాజాన్ని తప్పించి విజ్ఞానాన్ని, హేతువాదాన్ని పెంపొందించాలి. అట్టి మోసగాళ్ళ బండారాన్ని ప్రజల ముందు బయటపెట్టాలి. అందుకు వారిని తమ 'మహిమలను'నిరూపించమని ఛాలెంజ్ చేయాలి. అదే సమయంలో ఆ మోసగాళ్ళ నుండి ఎదురయ్యే కుట్రల నుంచి, దాడుల నుంచి మనల్ని మనం రక్షించుకొనే ఏర్పాట్లు కూడా చేసుకోవాలి.



# మహత్తులా, గమ్మత్తులా?

అది 1932వ సంవత్సరం ఏప్రిల్ నెల. విద్యాసంస్థలన్నింటికీ సెలవులిచ్చారు. కోవూర్ దంపతులు తమ కొడుకుతో, ఏదైనా చల్లని ప్రాంతానికి వెళ్ళి వేసవిని గడిపి రావాలనుకున్నారు. ఆలోచించాక, జాఫ్నాకు దక్షిణంగా వున్న చిన్న దీవి 'మాండైతివు' తమకు తగినదిగా తోచింది. చల్లని ప్రశాంత వాతావరణం గల ఆ దీవిలో విహారంతో పాటు, సముద్రతీరంలో దొరికే వివిధ వస్తువులను కూడా సేకరించి వినోదించవచ్చని కోవూర్ ఆశించాడు.

మాండైతివు చాలా చిన్నదీవి. కొద్దిమంది రైతులు, ఇంకా కొంతమంది జాలర్లు మాత్రమే అందులో బ్రతుకుతున్నారు. రైతుల ముఖ్యపంట పొగాకు. ఆ దీవికీ, జాఫ్నాకు మధ్య నాలుగు మైళ్ళ విస్తీర్ణం గల నీటిమడుగు వుంది. అందుకే అక్కడి వారికి మిగిలిన ప్రపంచంతో దాదాపు సంబంధాలు వుండవు. ప్రతి ఏటా జాఫ్నాలో 'నల్లూరు కందసామి' తిరునాళ్ళు జరుగుతుంది. దానికోసం ఆ దీవి ప్రజలు ఎదురుచూస్తుంటారు. ఆ సందర్భంగా మాత్రమే ఆ దీవి జనం ఆ నీటిమడుగును దాటి వెళ్తారు. అప్పుడే నగర జీవితాలను, పట్నపు సోకుల్ని కనులారా చూసి ఆనందిస్తారు.

కోవూర్ తన భార్యాకొడుకులతో 'మాండైతివు'చేరుకున్నాడు. అక్కడ ఒకే ఒక బంగళా వుంది. నెవిన్స్ సెల్వదురై అనే ఒక విద్యావేత్త వేసవి విడదిగా దాన్ని కట్టించాడు. ఆ దీవికి ఎవరు విహరించడానికి వచ్చినా, అందులోనే వుంటారు. సముద్రానికి ఎదురుగా వుండడంతో అన్నిటికీ అనుకూలంగా వుంది. కోవూర్ కుటుంబం ఆ బంగ్లాలోనే దిగింది.

ఆ దీవిలో గడిపేందుకు వారొక కార్యక్రమం రూపొందించుకున్నారు. ఉదయం నుండి మధ్యాహ్నం వరకు సముద్రతీరంలో గడపడం, మధ్యాహ్నం భోజనాలయ్యాక ఆ దీవిలోని ప్రదేశాలను తిలకించడం వారి నిత్యకృత్యం.

అలా దీవిని సందర్శిస్తుంటే, ఓ రోజు మార్కండు అనే టీచర్ పరిచయమయ్యాడు. ఆ దీవిలో వంటి మీద చొక్కా ధరించిన ఏకైక వ్యక్తి మార్కండు. అతనితో పరిచయం కోవూర్‌కి ఎడారిలో ఒయాసిస్సులా అనిపించింది. కాస్తో కూస్తో భాష తెలిసినవాడు, చదువు కొన్నవాడు కావటం వల్ల అక్కడి విశేషాలను మార్కండు ద్వారా తెలుసుకునేవాడు కోవూర్. పరిచయం రోజురోజుకీ పెరిగింది. మార్కండు కోవూర్ కుటుంబ స్నేహితుడయ్యాడు.



ఓరోజు మార్కండు కోవూర్ ఇంటికి వచ్చాడు. చేతిలో ఓ పెద్ద చిట్టా వుంది. అదేమిటన్నాడు కోవూర్. చందాల చిట్టా అన్నాడు మార్కండు. చందాల వసూలు దేనికని అడిగాడు. కొన్ని వివరాలను కోవూర్‌కి ఇలా వినిపించాడు మార్కండు.

***

ఓరోజు ఒక స్త్రీ తన ఇంటి వెనుక పెరట్లోకి వెళ్ళింది. దగ్గర్లో ఉన్న కొబ్బరిచెట్టును ఆనుకుని మరో స్త్రీ నిలబడివుంది. ఈమె ఆమెను రమ్మని సైగ చేసింది. ఆమె దగ్గరకు వెళ్ళి తన తెలివిని కోల్పోయిన ఈమె, ఆమె వెనుకనే సాగిపోయింది. అలా చాలా దూరం నడిచారు ఇద్దరూ. ఆమె కొంతసేపటికి మాయమయింది. తర్వాత మూడు గంటలకు ఈమె మామూలు స్థితికి వచ్చింది. కానీ అప్పటి నుంచి పూనకం వచ్చిన దానిలా ఊగుతూ ఉంటుంది.

మార్కండు మరో సంగతి చెప్పాడు. ఓ యువకుడు తన పొగాకు తోట నుండి వస్తూ దారిలో ఒక యువతిని చూసాడు. తాను దారి తప్పి ఉన్నానని, తన తండ్రి దగ్గరకు తనను చేర్చమని ఆమె అడిగింది. ఆ యువకుడు జాలిపడి ఆమెను కలుపుకుని నడుస్తున్నాడు. ఇద్దరూ ఏవో విషయాలు మాట్లాడుతూనే నడుస్తున్నారు. ఇంతలో ఆ యువతి వస్తున్న అలికిడి ఆగిపోయింది. యువకుడు చుట్టూ వెదికాడు. కన్పించలేదు. కాని మాటలు మాత్రం వినపడుతున్నాయ్. అతనికి భయం వేసింది. ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని ఇంటికి పరిగెత్తాడు. ఇంటికి చేరేసరికి బాగా అలసి, స్పృహతప్పి పడిపోయాడు. మర్నాటి ఉదయం వరకు తెలివిలోకి రాలేదు.

NAL_3112 2 19_

మరో ఉదంతం. ఏడేళ్ళ అమ్మాయి తన ఇంటి ముందు ఓ నల్లకుక్కని చూసింది. బైటకి తోలుదామని రాయి విసిరింది. దాంతో ఆ కుక్క పిశాచమై ఆ పాపను భయపెట్టింది. అప్పటి నుండి ఆ పాప నోటమాట పడిపోయి మూగదైంది.

ఇలా చెవుతున్నవన్నీ విన్నాడు కోవూర్. మార్కండు చందాలు ఎందుకు వసూలు చేస్తున్నాడో అడిగాడు. ఆ దీవిలో పిశాచాలున్నాయని, తమను పీడిస్తున్నాయని, వాటిని వదిలించడానికి ఒక యోగిని తీసుకు రాబోతున్నామని, ఖర్చుల నిమిత్తం ఈ చందాలు వసూలు చేస్తున్నామని చెప్పాడు మార్కండు. యోగి వివరాలు అడిగాడు కోవూర్. జాఫ్నాలోని నల్లూర్ కందసామి గుడి దగ్గర్లో ఆ యోగి వుంటాడట. అతనికున్న మహత్తులు అన్నీ ఇన్నీ కావట. ఏడాదికి రెండు నెలలే నల్లూరులో ఉంటాడట. మిగిలిన కాలమంతా దేశాటన చేస్తాడట. అనేక చోట్ల ఇలాంటి పిశాచాలను వదిలిస్తూ వుంటాడట.

మార్కండు కోవూర్‌ని కూడా చందా అడిగాడు. ఇటువంటి మోసపూరితమైన గారడీల కోసం తాను చందా ఇవ్వనన్నాడు. మహత్తులనేవీ ఏవీ వుండవనీ, దయ్యాలు పిశాచాలు వున్నాయనుకోవడం పూర్తిగా మన భ్రమ అనీ చెప్పాడు. మార్కండు అన్నీ విన్నాడే కానీ, కోవూర్ మాటలపై నమ్మకం కుదరలేదు.

మరో వారం గడిచాక, మార్కండు కోవూర్ వద్దకు వచ్చాడు. యోగిని వచ్చే ఆదివారం తీసుకువస్తున్నట్లు చెప్పాడు. ఆ యోగి ఒక యజ్ఞం చేయబోతున్నాడట. కోవూర్ తాను కూడా ఆ యజ్ఞం చూడటానికి వస్తానని చెప్పాడు.

ఆదివారం వచ్చింది. ఒకరైతు ఇంట్లో పూజకు ఏర్పాటయింది. దీవిలోని జనమంతా అక్కడకి చేరారు. యోగి ప్రత్యేకంగా నిర్మించిన ఒక పందిరి కింద కూర్చున్నాడు. పొడవైన గడ్డం, పచ్చని పట్టుబట్ట, మెడలో ముప్పేటల రుద్రాక్షమాల, నుదుట విభూతిరేఖలు – వున్న ఆ వ్యక్తి యోగికి తగినవేషంలో, చూడ్డానికి గంభీరంగా కనిపిస్తున్నాడు. అతని ముందు రెండు పళ్ళాల నిండా పూలు, పండ్లు, వివిధ రకాల ధాన్యాలున్నాయి. ఒక ప్రక్క ఎత్తైన రాళ్ళను పొయ్యిలా అమర్చి దానిపై రాగి కళాయిని వుంచారు. ప్రక్కనే అయిదు సీసాలు వున్నాయి. వాటిలో నెయ్యి, కొబ్బరినూనె, శనగనూనె, వేపనూనె, ఇప్పనూనెలు వున్నాయి.

పూజ మొదలయింది. అతని భాషలో అది యజ్ఞం. యోగి తమిళ, సంస్కృతభాషల్లో మంత్రాలు చదువుతూ పూలూ, పండ్లు చల్లుతున్నాడు. ఇలా ఒక గంట గడిచింది. యోగి ధ్యానంలోకి వెళ్ళిపోయాడు. ఉన్నట్టుండి నాలుక బైటకి చాచాడు. అతని ప్రక్కనే ఉన్న అతని సహాయకుడు చిన్న కర్పూర గుళికను నిప్పంటించి యోగి నాలుకపై వుంచాడు. కొన్ని క్షణాలు గడిచాయి. అప్పుడు తన నాలుక మీద మంటను ప్రక్కనే ఉన్న రాగి

కళాయిలోకి వూశాడు యోగి. ఇలా మూడుసార్లు యోగి నాలుకపై కర్పూరాన్ని వెలిగించు కున్నాడు. జనమంతా ఆశ్చర్యమగ్నులై చూస్తున్నారు. అది యోగి మహత్తనుకున్నారు. వారిలో ఆవేశం పొంగింది. 'హరహరో' అంటూ అరిచారు.

యోగి మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు. పద్మాసనంలో కూర్చున్నాడు. కొద్దిసేపయ్యాక మార్కండుని పిలిచాడు. తన నాడి కొట్టుకుంటుందో లేదో చూడమన్నాడు. కొన్ని క్షణాలయ్యాక నాడీస్పందన ఆగిందని అరిచాడు మార్కండు. తరువాత మరో పెద్ద మనిషిని పిలిచాడు యోగి. అతడు కూడా పరీక్షించి నాడి ఆగినట్లు చెప్పాడు. జనంలో మళ్ళీ ఆవేశం. 'హరహరో' అంటూ అరిచారు.

యోగి ధ్యానం విడిచాడు. రాగిపాత్రను శుభ్రం చేసి పొయ్యి మీద వుంచాడు. పొయ్యిలో మంటను వెలిగించాడు అసిస్టెంట్. యోగి ప్రక్కనే అయిదు సీసాల్లో వున్న అయిదు రకాల నూనెలను ఆ రాగి కళాయిలోకి వంచాడు. అవి క్రమంగా వేడెక్కుతున్నాయి. మూడు నిమ్మకాయలను తీసి అందరికీ చూపుతూ వాటిని మంత్రించి, అడ్డంగా కోసి ఆ ముక్కలను నూనెలో వేసాడు. ఆ నూనె బాగా వేడెక్కినట్లు గుర్తించాడు. పిశాచాల చేత పీడింపబడ్డవారిని వరుసలో తన దగ్గరకు రమ్మనమన్నాడు.

యోగి తన చేతి వేళ్ళను మండే నూనె మీద వుంచి వెంటనే తీసాడు. ఆలస్యం లేకుండా ఎడమచేతితో ఆ నూనె వేళ్ళని బాగా రుద్దాడు. చేతికంటిన నూనెతో ఒకొక్కరి నుదుటన బొట్టు పెడుతున్నాడు. పిల్లా పెద్దా, ఆడా మగా అందరూ వరుసగా వెళ్ళి నూనె బొట్టు పెట్టించుకున్నారు. కోవూర్ ఇదంతా గమనిస్తూనే తనలో తాను నవ్వుకుంటున్నాడు. ఒకసారి ముంచిన వేళ్ళని కనీసం అయిదుగురికి బొట్లుగా పెడుతున్నాడు. ఒక్కోసారి చేతిని పూర్తిగా లోనికి ముంచుతున్నాడు కూడా. ఇదంతా యోగి మహత్తేనని జనం నమ్మారు. ఆవేశం పెరిగింది. 'హరహరో' అంటూ గొంతెత్తి అరిచారు.

అందరికీ నూనెతో బొట్టు పెట్టడం పూర్తయింది. ఈసారి మహత్తేమిటోనని జనం ఆతృతగా చూస్తున్నారు.

యోగి తన సంచిలోనుండి బాగా నున్నగా వున్న ఒక కొబ్బరి చిప్పను తీసాడు. తన ముందు బోర్లా వుంచాడు. తర్వాత ఏడు గవ్వల్ని తీసాడు. ఆ చిప్ప మీద ఆరింటిని గుండ్రంగా నిలబెట్టాడు. మధ్యలో ఒక గవ్వనుంచాడు. సంచిలోంచి ఒక చిన్న సీసాను బైటకి తీసాడు. దాన్లో మంత్రజలం వుందని చెప్పాడు. ప్రజలనుద్దేశించి ఇలా అన్నాడు.

"జనులారా! ఈ దీవిని ఏడు ఆడామగా పిశాచాలు పీడిస్తున్నాయి. వీటికున్న శక్తి అపారమయింది. నేనిప్పుడు కొబ్బరిచిప్పపై ఏడు గవ్వలుంచాను. ఇవి ఆ పిశాచాలకు గుర్తు. కొబ్బరి చిప్ప ఈ దీవికి గుర్తు. ఇపుడు మీ అందరి ముందే ఈ గవ్వలమీద మంత్రజలాన్ని చల్లుతాను. ఆ మంత్రం దెబ్బకు పోగలిగేవన్నీ పారిపోతాయి. గవ్వలు

క్రిందపడతాయి. అలా పడకుండా ఎన్ని గవ్వలుంటే అన్ని పిశాచాలు ఈ దీవిని వదలడానికి ఇష్టపడడం లేదని అర్థం. వాటిని కూడా పారదోలడానికి ఇంతకన్నా మహత్తు గల యజ్ఞం చేయవలసి వుంటుంది".

యోగి సీసాలోని ద్రవాన్ని మళ్ళీ మంత్రించాడు. అందరూ తమను తాము మరచి ఆ గవ్వలవైపే చూస్తున్నారు. ఎన్ని పిశాచాలుంటాయో ఎన్ని పారిపోతాయోనని వారి ఆదుర్దా. యోగి గవ్వల మీద మంత్రజలం చుక్కలు చుక్కలుగా వేసాడు. కొద్ది క్షణాలు గడిచాయి. ఆశ్చర్యం! అందరి కళ్ళల్లో ఆశ్చర్యం విప్పారింది! ఆ ద్రవం పడడంతోనే గవ్వలన్నీ అటూ ఇటూ కదలసాగాయి. కొబ్బరిచిప్ప మీద నుండి ఒక్కొక్కటీ క్రింద పడసాగాయి. ఏడూ అలా పడిపోయాయి. యోగి బిగ్గరగా నవ్వుతూ అన్ని పిశాచాలూ దీవిని వదిలి పారిపోయాయని, ఇక ఎవ్వరూ భయపడవలసిన పనిలేదని చెప్పాడు.

జనమంతా సంతోషంతో కేరింతలు కొట్టారు. కొందరు యోగికి జేజేలు కొట్టారు. మరికొందరు యోగి మహత్తును కొనియాడసాగారు. అందరి మనసుల్లో ఆనందసాగర తరంగాలు వువ్వెత్తున లేచాయి.

మార్కండు కూడా పైకి లేచాడు. అందర్నీ నిశ్శబ్దంగా వుండమని కోరాడు. యోగిని గూర్చి, అతని మహత్తులను గూర్చి తన ఉపన్యాసంలో బాగా పొగిడాడు. దేవుడల్లే ఆ యోగి తమను పిశాచాల బారినుడి కాపాడినందుకు అందరి తరఫున కృతజ్ఞతలు చెప్పుకొన్నాడు. అందరి తరఫునా యోగికి అయిదువందల ఒక్క రూపాయి పర్సును బహూకరించాడు. తర్వాత జనంలో కొందరు వ్యక్తిగతంగా, తమకు తోచిన బహుమతుల్ని ఆ యోగికి సమర్పించారు.

మర్నాడు మార్కండు కోవూర్‌ను బంగ్లా దగ్గర కలిశాడు. అతనిలో ఒక విధమైన విజయగర్వం తొణికిసలాడుతోంది.

"చూశారా సార్! ఆ యోగికి ఎన్ని మహత్తులున్నాయో! ఏ సైన్సు ఆ మహత్తుల్ని కాదనగలదు? ఆ గవ్వలు ఎలా తమకుతాము పడిపోయాయో చూశారా? ఇప్పటికైనా దయ్యాలున్నాయని అంగీకరిస్తారా? మీ సైన్సుతో కాగే నూనెలో చేతులుంచగలరా? నాడీస్పందనను ఏ సైంటిస్టు ఆపగలడు? నిన్న మీరు ప్రత్యక్షంగా చూసినదాన్ని బట్టి అతీతశక్తులు లేవనే మీ అభిప్రాయాన్ని మార్చుకోండి" అంటూ హుషారుగా చెప్పుకుపో తున్నాడు మార్కండు.

కోవూర్‌కి మార్కండు మాటలు చిరాకు పుట్టించాయి. సైన్సునీ, సైంటిస్టులను అలా సవాలు చేయడం అతనికి బాధ కలిగించింది. ఆ సైన్సుతోనే అతని మూర్ఖత్వాన్ని తలదించుకునేలా చేయాలనుకున్నాడు.

"మార్కండూ! అయిందా నీ వాచాలత్వం. నీ ప్రశ్నలకి నా సమాధానం విను. యోగి చూపించినవన్నీ మహత్తులని నీవు అజ్ఞానంతో నమ్ముతున్నావు. అవేవీ మహత్తులు కావు, అన్నీ సైన్స్‌తో చేసే గమ్మత్తులే. పైగా అవన్నీ సైన్సుకి సంబంధించినవే. కాస్త ఆలోచన వుంటే ఎవరైనా చేయగలరు. ఇలా నేనెంతచెప్పినా నీవు నమ్మవు. రేపు సాయంత్రం ఊర్లోని పెద్దలను వెంటపెట్టుకురా. ఆ యోగి అవన్నీ ఎలా చేశాడో నేనూ చేసి చూపిస్తాను." అన్నాడు కోవూర్. ఏ మాత్రం చూపగలడో, అదీ చూద్దాం అనుకుంటూ మార్కండు వెళ్ళిపోయాడు.

మర్నాడు ఉదయం ఒంట్లో ఉన్న పని కుర్రాడిని పిలిచి ఒక కొబ్బరిచిప్పను తెప్పించాడు. దాని అడుగుభాగాన్ని నున్నగా చేయించాడు. కర్పూరం తెప్పించాడు. ఒక స్టౌ, ఒక నూనె కళాయి, నిమ్మకాయలు, కొబ్బరినూనె సిద్ధం చేసి వుంచాడు. సాయంకాలం మార్కండు తదితరుల కోసం చూస్తున్నాడు.

దీవిలోని అయిదుగురు పెద్దమనుషులతో హుషారుగా వచ్చాడు మార్కండు. అందర్నీ తన ముందర కూర్చోబెట్టుకున్నాడు కోవూర్. నమ్మించడానికి యోగిలా పద్మాసనం వేశాడు. వస్తువులన్నిటినీ తనచుట్టూ అమర్చుకున్నాడు. ముందుగా కర్పూరం ముద్దను వెలిగించి నాలుకపై వుంచుకున్నాడు. కొద్దిసెకన్లు గడిచాక వూసేసాడు. ఇలా మూడుసార్లు చేసాడు. తర్వాత మార్కండుని పిలిచి నాడిని పరీక్షించమన్నాడు. నాడీస్పందన లేదు. వచ్చిన పెద్దమనుషులు కూడా పరీక్షించారు. నాడి కొట్టుకోవడం ఆగిపోయినట్లు అందరూ గుర్తించారు. మార్కండులోని హుషారు తగ్గిపోయింది. ఇప్పుడు ఆశ్చర్యం ఎక్కువైంది. 'యోగి మహత్తుల' పట్ల అతనికున్న నమ్మకం పలుచనవుతోంది.

ఇది ఇలా జరుగుతుండగానే పని కుర్రాడు స్టవ్ వెలిగించాడు. దానిపై నూనె పాత్ర (కళాయి) ఉంచాడు. కొబ్బరి నూనె పోశాడు. నూనె వేడెక్కుతుండగా నిమ్మకాయలను కోసి ముక్కలను అందులో వేశాడు. నూనె మరగడం మొదలైంది. తన కుడిచేతిని అందరికీ చూపించి అందులో ముంచాడు కోవూర్. ఏ మాత్రం ఆలస్యం లేకుండా వెంటనే పైకి తీసి ఎడమచేతిని గట్టిగా రుద్దుకున్నాడు. ఇలా అనేక సార్లు చేసి చూపించాడు.

మార్కండుకీ, అతనితో వచ్చిన పెద్దలకీ కళ్ళు పత్తికాయలయ్యాయి. నోళ్ళు తెరుచుకున్నాయి. యోగిలో వున్న 'మహత్తు'ల గుట్టు ఇదేనా? అని తెలుసుకుంటున్నారు.

కోవూర్ కొద్దిసేపటికి ఆ పని ముగించాడు. ప్రక్కన కొబ్బరి చిప్పను అందుకున్నాడు. తన ఎదురుగా బోర్లించాడు. ఏడు గవ్వల్ని తీసి, యోగి అమర్చినట్లే అమర్చాడు. ప్రక్కనున్న చిన్న సీసాను అందుకున్నాడు. దీన్నే పవిత్రమైన మంత్రజలం అన్నాడు యోగి. దాన్ని చుక్కలు చుక్కలుగా గవ్వలపై వేశాడు. అంతే గవ్వలన్నీ అటూఇటూ తిరుగుతూ కొబ్బరి చిప్ప మీద నుండి క్రిందపడిపోయాయి.

విజయ దరహాసంతో వారి వైపు చూశాడు కోవూర్. ఇప్పుడేమంటారు?అని వారిని ప్రశ్నించినట్లుంది ఆ చూపు. వారేం చెప్పగలరు? ఆశ్చర్యంతో ఒకరి వైపు ఒకరు చూసుకున్నారు.

'అయితే సారు! యోగి చేసిందంతా మోసమేనంటారా?' అన్నాడు మార్కండు.

'ఇంకా అనుమానమా? అక్షరాలా మోసమే' అన్నాడు కోవూర్.

'ఇది మేమైనా చెయ్యొచ్చా సార్!'

'ఆహా! ఎవరైనా చెయ్యొచ్చు'

మార్కండులో జిజ్ఞాస మొదలయింది. వాటినెలా చేయాలో తెలుసుకోవాలను కున్నాడు. మిగిలిన వారు కూడా అదే అనుకున్నారు. ఆ గమ్మత్తుల గుట్టుని వివరించమని కోవూర్‌ని అభ్యర్థించారు.

కోవూర్ తాను చేసిన ట్రిక్కులను ఇలా వివరించాడు.

మొదటగా కర్పూరం సంగతి. కర్పూరం తేలికగా మండే స్వభావం కలది. అది మండుతూ ఆవిరవుతుందిగానీ, దాని నుండి ఎటువంటి నుసిగానీ, ద్రవం గానీ రావు. కాబట్టి నాలుక కాలటం జరగదు. మన నాలుకను తడి చేసుకుని మండే కర్పూరాన్ని ఉంచుకోవాలి. ఇంకా కొద్ది క్షణాల్లో మంట అయిపోతుందనుకోగానే వూసెయ్యాలి. కర్పూరం ముద్ద పరిమాణాన్ని బట్టి నాలుక మీద వుండే సమయం ఆధారపడి వుంటుంది. మరో విషయం, కర్పూరం నాలుక మీద మండేటప్పుడు ఊపిరి పీల్చడం లేదా విడవడం చేయడం మంచిది కాదు.

ఇక నాడి కొట్టుకోవడాన్ని ఆపడం కూడా పెద్ద కష్టమేమీకావు. చంకలో నిమ్మకాయను గానీ, ఆ సైజు రబ్బరు బంతినిగాని వుంచుకోవాలి. నాడిని ఆపాలనుకున్నప్పుడు చంకను గట్టిగా శరీరం వైపుకు నొక్కుకోవాలి. క్రమంగా నాడి కొట్టుకోవడం ఆగుతుంది. ఇది అలవాటు లేని వారు ఎక్కువ సేపు చేయలేరు.

ఇక మూడోది మరిగే నూనెలో చేతులుంచడం. ఇది కాస్త జాగ్రత్తగా చేయదగినపని. మరిగే నూనెలో చేతులుంచితే ఎవరికైనా కాలతాయి. అలాగే ఒకే రకంనూనె అయినా అయిదారు రకాల నూనెలు కలిపినా ఫలితం ఒకటే. మరిగే నూనెలో ఏదైనా ఉడుకుతున్నా లేదా తడిగా వున్నా ఆ నూనె ఉష్ణోగ్రత 100 డిగ్రీలకు మించదు. కళాయిని ఎప్పుడూ తెరిచే వుంచాలి. మూత పెట్టరాదు. మధ్యలో నిమ్మకాయ ముక్కలు వేస్తున్నాం కాబట్టి అవి ఉడకడం వల్ల, నిమ్మరసం తడిగా వుండడం వల్ల నూనె వంద డిగ్రీల వేడి కంటే ఎక్కువ మరగదు. వాటిలోని రసం మరుగుతున్నంత సేపు నూనె పై భాగం వేడి తక్కువగానే వుంటుంది. చేయి పెట్టే ముందు ఆవిరిని ప్రక్కకు విసురుకోవాలి. వేడి తగ్గి దానివల్ల

నూనె పైభాగం వేడిగా వున్నట్లే కనపడుతుంది. అయితే కాలి, బొబ్బలెక్కడం మాత్రం జరగదు. నూనెను తాకిన వెంటనే ఆ వేళ్ళను, లేదా చేతిని ఎడమచేతితో రుద్దాలి. దాని వల్ల కాలిన బాధ తగ్గుతుంది. మరిగే నూనెలో నిమ్మకాయముక్కలు వేయకుండా యోగే కాదు మరెవ్వరూ చేతులు పెట్టలేరు.

ఇక గవ్వలు, కొబ్బరి చిప్పల రహస్యం. గవ్వల మీద చల్లింది మంత్రజలం కాదు. యోగి అలా చెప్పి జనాన్ని మోసపుచ్చాడు. ఇది కేవలం నిమ్మరసమే. గవ్వల్లో కాల్షియం కార్బొనేట్ అనే రసాయనిక పదార్థం వుంటుంది. అంటే సున్నమన్నమాట. నిమ్మరసం అంటే సిట్రికామ్లం. ఈ రెండూ కలసినపుడు రసాయనిక చర్య జరిగింది. కార్బన్ డయాక్సైడ్ విడుదలయింది. ఫలితంగా బుడగలు ఏర్పడ్డాయి. గవ్వల్లో వచ్చిన వేలాది అతి సూక్ష్మమైన బుడగల కదలికలకు గవ్వలు క్రిందకి జారాయి. గవ్వల అడుగుభాగం నున్నగా చేయబడి వుంది. కొబ్బరి చిప్ప పై భాగం కూడా నున్నగా చేయబడింది. అందుకే గవ్వలు తేలిగ్గా జారాయి. ఒక వేళ ఏదైనా పడదేమోనని అనుమానం యోగికి కల్గింది. అందుకే ఏవైనా పడకపోతే మరో యజ్ఞం చేయాల్సి వస్తుందన్నాడు.

ఈ వివరణ విన్నాక మార్కండు ముఖంలో ఆనందం వెల్లివిరిసింది. చీకట్లు తొలిగించుకుని వచ్చే వేకువ వెలుగుల కాంతి తొణికిసలాడింది. పెద్ద మనుషులక్కూడా యోగి చేసిన మోసం అర్థమయింది.

కోవూర్‌ని తన మాటలతో నొప్పించినందుకు మార్కండు క్షమాపణ కోరుకున్నాడు. ఇక నుండి ఏ మహత్తులనూ, మాయలను నమ్మనని కోవూర్‌కి వాగ్దానం చేశాడు. మహత్తులనేవి అన్నీ గమ్మత్తులేనని, పదిమందికీ తెలియజేస్తానన్నాడు.



# SATYA SODHANA

Dr. A.T. Kovur's research on Parapsychical activities

*Narration:* **B.SambasivaRao**

వెలిగే చెట్లున్నాయా?

ఆత్మలు మాట్లాడతాయా?

మహత్తులన్నవి బాబాలకే సాధ్యమా?

దయ్యం బ్రతికిందా?

కథలు కాచే మామిడిచెట్లు ఉంటాయా?

దయ్యంతో వియ్యం గురించి విన్నారా?

దివ్యదృష్టి ఎవరికైనా ఉంటుందా?

చెంబుజోస్యం తెలుసా?

పునర్జన్మ అబద్ధమా? నిజమా?

పురాణకథలు పిల్లల్ని ఏం చేస్తాయి?

మంత్రాలు, చేతబడులు నిజంగా ఉంటాయా?

ఇలాంటి చిత్ర విచిత్ర యధార్థగాథల సమాహారం ఈ పుస్తకం.
మొదటివాక్యం నుంచి చివరి వాక్యం వరకు అక్షరక్షరం ఉత్కంఠతను రేపుతూ,
అనుక్షణం మిమ్మల్ని ఆశ్చర్యానికి లోనుచేసే చైతన్యవంతమైన గాథలు
మీకోసం ఇప్పుడు మీ చేతిలోకి వచ్చాయి.
చదివిన ప్రతి ఒక్కరినీ ఒక్కో డిటెక్టివ్‌గా మార్చే గొప్ప పరిశోధనల్లోకి తొంగిచూడండి.
రండి ఎ.టి.కోవూర్ చైతన్యస్రవంతిలో కలుద్దాం !
తెలివైన పౌరులమని నిరూపించుకుందాం !!



Swetchalochana Publications